# సారంగు తమ్మయ

# వైజయంతీవిలాసము

## ఒక పరిశీలనము





శ్రీమాన్
తిరుమల
పెద్దింటి
నరసింహాచార్యులు

# వైజయంతీ విలాసము

## ఒక పరిశీలన

ర చ యి త

విద్వాన్
తిరుమల పెద్దింటి నరసింహాచార్యులు

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది.

# Vaijayantyi Vilasamu
# Oka Pariseelana

By Tirumala Peddinti Narasimha Charyulu


ప్రథమ ముద్రణ:
ప్రమోద-జ్యేష్ఠ పూర్ణిమ 1 5- 0
1000 కాపీలు





ముఖచిత్రం బాపు

ప్రతులకు
R VIJAYA LAKSHMI
B H P V E M High school
VISAKHAPATNAM-530012

గ్రంథముద్రణ
లలితా ఆర్టు ప్రెస్
టౌను హాల్ రోడ్డు
విశాఖపట్నం- 1


---


*This Book is Published with the Financial Assistance of Tirumala Tirupathi Devasthanams Uuder their Scheme Aid to Publish Religious Books*


---

ఓం

# అంకితం

వినావేంకటేశం ననాథో ననాథః
సదావేంకటేశం స్మరామిస్మరామి
హరేవేంకటేశ ప్రసీదప్రసీద!
ప్రియంవేంకటేశ ప్రయచ్ఛప్రయచ్ఛ!



శ్రీ వేంకటేశ్వరుని పాదపద్మములకు అంకితం

# అభివందనములు

* వే. శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు
సాహిత్య విద్యాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ,
భాషాప్రవీణ *M A RTD*, సంస్కృతభాషోపన్యాసకులు.

శ్రీమాన్ తిరుమల పెద్దింటి నరసింహాచార్యులవారు సాంప్రదాయ ... మైన విద్యాభ్యాసము చేసినవారు మొదట శ్రీ వైష్ణవ సమయాను సారము ... గ ద్రావిడ ప్రబంధమును ఆగమమును కొంతవర కధికరించి, తరువాత ప్రాచ్య విద్యా పట్టభద్రులైరి స్వయంకృషిచే *M A* పట్టమును ... కైవసము చేసికొన్నారు దానిపై విమర్శనావ్యాసమును ప్రకటించి-*M Phil* డిగ్రీ పొందవలెనని తలంచి, మద్రాస్ విశ్వ విద్యాలయము ప్రొఫెసర్ *L B* శంకరరావు గారికి అంతేవాసులై చరితార్థులైరి *M Phil* ... ట్టము నకు శ్రీసారంగు తమ్మయ్య రచించిన 'వైజయంతీవిలాస' ప్రబంధము ... వీరుపరిశోధించిరి. దానిపై వీరు వ్రాసిన సిద్ధాంత వ్యాసమునకు విశ్వవిద్యాల యమువారు *M Phil* డిగ్రీని ప్రసాదించిరి ఆ వ్యాసమునే గ్రంథరూపము గా ముద్రించి, లోకమునకందించు ప్రయత్నములో ఈ గ్రంథము వెలువ రించు చున్నారు

శ్రీ వైష్ణవ సాంప్రదాయమున దక్షిణ దేశమున ఆళ్వార్లు భక్తిని, ఉపనిషద్రహస్యములను సామాన్యులకందించిన మహనీయులు భగవదను గ్రహమున మునిగినవారు ఆళ్వారులు, జన్మచేతగాని, విద్యచేతగాని వృత్త ము చేతగాని గొప్ప వారలై సాధనచేసి భగవదను గ్రహమును పొందినవారు కారు ఆళ్వారులు వీరు పదిమంది వీరిలో ఒకరు అంత్యకులజులు, మరియొ కరు మ్లేచ్ఛులు ఇంకొకరు హింసాప్రవృత్తిచే భగవద్భాగవత సేవను చేసిన వారు, వేరొకరు వేశ్యాలంపటులైననూ, భగవదను గ్రహమును కోల్పోవని వారు.

అన్నిటికంటే నడవడి ప్రధానమని చెప్పుదురు ఆనడవడి లేక పోయిన భగవ దనుగ్రహపాత్రులు కాజాలరని 'కఠోపనిషత్' పేర్కొనినది కాని భగ

పద్గీతలో శ్రీకృష్ణుడు "అపిచేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్-సాధు రేవ" అనినాడు ఆసూక్తికి నిదర్శనమే శ్రీ తొండరడిప్పొడి యాళ్వార్. శ్రీ రంగనాథ పాదార విందభజనమే ప్రయత్నముగ వారికి జన్మసిద్ధమై లభించినది.

శ్రీ రంగనాథ గుణగానమే వారికి తారకము శ్రీరంగ నాథ కైంకర్యమే వారికి పరమ ప్రాప్యం నందనవనమును నిర్మించుకొని తోమాలలు కట్టి స్వామి కర్పించుటయే వీరి దినచర్య వీరు పాడిన ప్రబోధకిగీతములు నేటికినీ శ్రీవైష్ణవాలయమున ంగస్వామి సుప్రభాతగానముగా శిష్టులచే ఆదరించ బడు చున్నది. వీరు శ్రీరంగనాధునితప్ప వేరొకదైవమును కీర్తించి ఎరుగరు మహాభక్తిభరితాంతరంగులగువారు వంచనము నెరుగరు కావున లోపల వేరొకభావముతో బాహ్యముగ భక్తి వైరాగ్యములను నటించుచూవచ్చిన దేవదేవికి వారు వశమైనారు భాగవతురాలుగా ఆదరించినారు, ప్రేమించినారు వారి ప్రేమమాయ నెరుగనిది స్వామిని ప్రేమించిననూ ఆ ప్రేమకు ఒక హేతువుగాని ప్రయోజనముగాని యుండదు, అవధులు లేక సాగు చండును ఎదుటి వ్యక్తి హృదయములో వంచన భావముండుటచే అదివారి భక్తికి ప్రతిబంధకమైనట్లు భాసించినది

ఎంత మహాపురుషులైననూ మెన్నటు పతిన్ని సంబంధము పలె మనసును ద్రవింపజేయకతప్పదు బాహ్యముగ వేశ్యాంసగతిచే భ్రష్టత కన్పట్టిననూ అంతరముగ సహజమగు భక్తిభావము ఆత్మను పదలక యుండి శ్రీరంగ నామ స్మరణమునగాని, శ్రీరంగనాథ కైంకర్యమున అనాదరముగాని కలుగ లేదు ఇది చాలును భగవదనుగ్రహపాత్రత కల్గుటకు ఈ యాళ్వారు సహజముగ భగవద్భక్తి కలిగిన వారగుటచే తమ నడువడి భగవత్ప్రాప్తికి సాధనమనిగాని, తమ విషయ లౌల్యము భగవన్నిగ్రహమునకు హేతువని గాని వారు భావింపరు స్వామి పరమకృపాళువై వారి మనసున కంటిన విషయన ఘదోషమును తానే క్షాళనము చేసికొని మరల తన వానినిగా స్వీకరించినాడు జితేంద్రియత్వము మొదలుకొని పరమ భక్తివరకు' భగవానుడే యుపాయమని నమ్మినవారు యాళ్వారులు తమ అనుష్ఠానముచే-తాము భగవంతుని పొందుదమనుకొనితమ శీల భ్రంశముచే భగవంతునికి దూరమగుదమని భావించిన వారు కారు స్వామియే వారికి యుపాయము, ఉపేయముకూడ

ఆళ్వారులు పరమభక్తులై యున్ననాడుకాని పరమరక్తులై యున్ననాడు కాని వారికి మోదములేదు. శోకములేదు. స్వామి శ్రీరంగనాథుడే వారిని చూచి పొంగినవాడు వారికై కృంగినవాడు. ఈ యాళ్వారుల చరిత్ర అనుష్ఠాన రహితులైనవారుకూడ భగవంతుడే తనకు సాధనమని, వాడే సాధ్యమని విశ్వసించినవారు, వీరి యనుష్ఠానముతో సంబంధము లేకయే భగవంతుని పొందెదరు ఆనందింతురు అను రహస్యమును లోకమునకు వెల్లడించును.

శృంగారము పరమహేయముగా వర్ణింపబడినదని కొందరు యనుకొనవచ్చును. కవి వానిని అంత అశ్లీలముగా వర్ణించుట భగవానుని కృపాతిశయము ను ప్రకాశింపజేయుటకే. భగవన్మహిమ నెరుగనివారికి యదియొక వింతగ కన్పట్టును ఎరిగినవారికి "తొండరడిప్పొడి యాళ్వారులకంటె ఆరాధ్యులు ఉపాస్యులులేరు. మహావైష్ణవాగ్రేసరుడు శ్రీ సారంగు తమ్మ వారి చరితమును కావ్యముగా రచించి తరించినాడు దానిపై విమర్శనావ్యాసము ను వ్రాసి మా నరసింహాచార్యులుగారు తమ వైష్ణవత్వమును సార్థకపరచుకొనినారు. యాళ్వారుల దివ్యానుగ్రహముచే యుత్తరోత్తరము దివ్యసూరి చరితములను తమ విమర్శక విషయముగ స్వీకరించి పట్టములగా, పదవులలో యతిశయమును పొందునట్లు శ్రీరంగనాథు డనుగ్రహించుగాక వీరు దీర్ఘాయురనామయత్వములతో, సుఖశాంతులతో వర్ధిల్లునట్లు శ్రియఃపతి శ్రీనివాసుడు సదా యనుగ్రహించుగాక,

ఇట్లు

శ్రీభాష్యం అప్పలాచార్యులు

*Chitrakavi Atreya*
**PRESIDENT**
*Sahridaya Sahithi*

# ఆకాంక్ష

దక్షిణ దేశమున విప్రనారాయణుని చరితము తెలియని వారుండరు. వైజయంతి మాలాంశా సంభూతుడుగా పేరుగాంచిన ఈ భక్తకవి గాథనే వైజయంతీ విలాస కావ్యముగ శ్రీ సారంగు తిమ్మయకవి వ్రాసాడు. జీవిత సంధ్యలో 'తిరుప్పళ్ళి ఎళుచ్చి' అను మహత్తర శ్రీరంగశాయి సుప్రభాతమును 'తొండరడిప్పొడి' ఆళ్వారుగా శ్రీవైష్ణవ లోకమున ప్రసిద్ధి కెక్కిన ఈ భక్తశిఖామణి వెలయించి చరితార్థుడైనాడు

ఒకదశాబ్దము నుండి సహృదయ క్రియాశీల సభ్యులై మంచికవితలు వ్రాస్తున్న శ్రీ టి పి యస్ ఆచార్యులుగారు మద్రాసు విశ్వవిద్యాలయము నుండి యం. ఫిల్ పట్టమును పొందుటకు వైజయంతీ విలాస కావ్య పరిశీలన చేసి, ఈ పుస్తకమును వెలయిస్తున్నందుకు 'సహృదయ' మిక్కిలి సంతోషిస్తున్నది. శ్రీ ఆచార్యులగారు మంచి నాటకకర్త, కార్యకర్త, దైవభక్తి దేశభక్తి భావాల ఆవిష్కర్త కూడా కావడం మా 'సహృదయ'కు గర్వకారణం

ప్రవచన శిరోమణి, ఉభయ వేదాంత ప్రవర్తకులు శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారి అనుగ్రహ అభినందన శ్రీ చందనము నందుకున్న ఉత్తమ ఉపాధ్యాయులు శ్రీనరసింహాచార్యులుగారికి మా సహృదయ సాహితి సంస్కృతి కుటుంబము శుభాకాంక్షలు అందిస్తున్నది శ్రీ ఆచార్యులుగారింకను సమాజ శ్రేయస్సును పెంపొందించే ఉత్తమగ్రంథములు వెలయించి చిరయశస్సు పొందగలరని మనసారా కోరుకుంటున్నాము

విశాఖపట్టణం-16
17-3-1990

చిత్రకవి ఆత్రేయ
అధ్యక్షుడు
సహృదయసాహితి

# కృతజ్ఞతాంజలి

నేను M Phil డిగ్రీకొరకు ముందుగా ప్రెసిడెన్సీ కళాశాలలో ప్రొఫెసర్ శ్రీ L B. శంకరరావుగారిని కలిసినపుడు వారు వాత్సల్యముతో ఆళ్వారులలో పేరెన్నికగన్న 'తొండరడిప్పొడి యాళ్వారు' అను నామాంతరము గల విప్రనారాయణుని కథాంశమైన ఈ వైజయంతీ విలాస గ్రంథమును సూచించి దీనిపై లఘు సిద్ధాంత వ్యాసమును వ్రాయమని తెల్పిరి అది నాకెంతో ముదావహమును కల్గించినది కేవలము గ్రంథమును సూచించుటయే గాక ఈ సిద్ధాంత వ్యాసము రూపొందించుటలో శ్రద్ధ వహించి కడుంగడు ప్రోత్సహించిన మద్గురువులు ఆచార్య శ్రీ లింగంనేని బసవ శంకర రావుగారికి యివే నా కృతజ్ఞతాంజలులు

నాకు నా కుటుంబమునకు సదా మంగళాశీస్సుల నొసగుచూ, ఈ సిద్ధాంత వ్యాసవిషయమున తగు సలహాల నొసంగుటయేగాక ఈ గ్రంథమునకు 'అభినందనము' కూడా ప్రసాదించిన పుంభావ సరస్వతీ స్వరూపులు, ఉ॥ వే॥ శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారికి ఇవియే యనేక కృత దాసోహములు

సదా నా యెడల సోదర వాత్సల్యము జూపుచూ వెన్నుతట్టి ప్రోత్సహించి ఉన్నత విద్యా మార్గమున నన్ను నడిపించి సఫలీకృతుణ్ణి చేసిన సోదర తుల్యులు ఉ॥ వే॥ శ్రీమాన్ S T. P. రామచంద్రాచార్యులగారికి వందన శతమర్పించుచున్నాను.

నేను M Phil డిగ్రీ పొందుటకు ముఖ్యులు, నా సిద్ధాంత వ్యాసము పుస్తక రూపము ధరించుటకు తగిన సూచనల నొసంగిన మిత్రులు డా॥ P. వేణుగోపాలరావుగారికి, వారి సతీమణి జయగారికి హృదయపూర్వక కృతజ్ఞతలర్పించుచున్నాను

అన్ని విధములా, అన్ని వేళలా తగు సహాయము చేయుచు, సాహితీ వ్యాసంగమునందు నన్ను ముందుకు నడిపించిన పూజ్యులు 'సహృదయ సాహితీ' స్థాపకులు, అధ్యక్షులు శ్రీ చిత్రకవి ఆత్రేయగారికి, మరియు సహృదయ సాహితీ మిత్రులకు అక్షర సుమాంజలి ఘటిస్తున్నాను

మరియు పరిశోధన చేయుటకనుమతించిన మద్రాస్ విశ్వవిద్యాలయమువారికి, ప్రెసిడెన్సీ కళాశాల ప్రిన్సిపల్‌గారికి తగిన సూచనలొసంగిన తెలుగు శాఖాధ్యక్షులు సౌశ్వ కృష్ణమూర్తిగార్కి కృతజ్ఞతాంజలులు

నా జీవిత భాగస్వామ్యమునందే గాక నా ఈ పురోగమనానికి అన్ని విధముల తన సంపూర్ణ సహకారము అందించుచున్న నా శ్రీమతి విజయలక్ష్మికి-చిరంజీవులు - శ్రీధర్, శ్రీనివాసులకు హృదయపూర్వక ఆశీస్సుల నందించుచున్నాను

ఈ పుస్తకము నింత అందముగా తీర్చిదిద్దిన లలితా ఆర్టుప్రెస్ వారికి,

అడిగిన వెంటనే హృద్యమంగా ముఖచిత్రం వేసి పంపిన శ్రీ బాపు గారికి కృతజ్ఞతలు

చివరిగా ఈ గ్రంథమును ముద్రించుటకు తగిన ఆర్థిక సహాయమొనరించిన తిరుమల తిరుపతి దేవస్థానం కార్యవర్గ సభ్యులకు కృతజ్ఞతలు సమర్పిస్తున్నాము

శ్రీ వేంకట నాయకునికివియే కోటి నమస్సులు



# దైవస్తుతి

ఉ. వేత్రలత న్ధరించి యరవిందభవాండ చరాచరావళి
శ్చిత్రగతి న్నటించుటకు శిక్షయొనర్పఁగ సూత్రధారుఁడై
మిత్ర శశాంక లోచనుఁడు మెచ్చఁ బరాంకుశవృత్తిఁ జెందు మా
సూత్రవతీశుచేఁ గవితచొప్పడుఁగాత నిరంతరాయమై. 1-6

శా. శ్రీరంగత్తుఙ్గచకుంభపాళి శిఖరోచిర్మండలిన్ దుగ్ధపా
థోరాశిన్ దులసీవనంబునఁ ద్రిపాద్భూతిన్ బలెన్ మన్మనో
గారాష్ఠి న్వసియించి సంసరణ దుఃఖంబు న్నివారింపుమో
శ్రీరంగేశ్వర! శాశ్వతత్రిశిరస్సింహాసనాధీశ్వరా. 4-121

# విజ్ఞాపనము

పై జయంతీ విలాసముద్రకుగల ప్రతులలో వావిళ్ళ రామస్వామి అండు సన్సు వారి ప్రతి, ఎమెస్కోవారి ప్రతిని, ఆధారముగ చేసికొని పరిశోధన సాగినది లఘుసిద్ధాంత గ్రంధమునందు వావిళ్ళవారి పద్యసంఖ్యాక్రమమే పాటింపబడినదని విన్నపము.

లఘుసిద్ధాంత వ్యాసరచనలో నెడనెడ అవసరమగు తాపుల విసంధి చేయుట జరిగినది ఉదాహృత పద్యములందు తప్ప తక్కినచోట్ల అర్ధబిందువు సూచింపబడలేదు మరియు సాదు శకట రేఫల భేదము గమనింపబడలేదని విజ్ఞాపనము. అలవాటు బలిమిచే నెక్కడైన నిది పాటింపబడిన మన్ననకు పాత్రుడను.

లఘుసిద్ధాంత వ్యాసరచన కుపయుక్తమైన గ్రంధరచయితల పేర్లు అకారాది క్రమమున నీయబడినది. అవి ప్రశస్తములైనవి కావున ప్రచురణ కర్త సంవత్సరము ఇత్యాదులు త్యక్తములని విన్నవించుచున్నాడను.

విబుధాళికి వినయాంజలి.

# ఉపయుక్త గ్రంథ రచయితల సూచి

| | |
|---|---|
| అనంతామాత్యుడు | ఛందోదర్పణము |
| అప్పకవి | అప్పకవీయము |
| అప్పారావు, పి. ఎస్. ఆర్ | తెలుగు నాటక వికాసము |
| ఆరుద్ర | సమగ్రాంధ్రసాహిత్యం సం-8 |
| ఇనాకె, కొలకలూరి | తెలుగు వ్యాసపరిణామం |
| ఎర్రన | హరివంశము |
| గోపరాజు, కొఱవి | సింహాసనద్వాత్రింశిక |
| చిన్నయసూరి, పరవస్తు | బాలవ్యాకరణము |
| జక్కన | విక్రమార్కచరిత్రము |
| తిక్కన | ఆంధ్రమహాభారతము |
| దండి | కావ్యాదర్శమ్ |
| దుర్గయ్య, పల్లా | సాహిత్యవాల్లభ్యము-వ్యాసము |
| దొరసామిశర్మ, రావూరి | అప్పకవీయభావప్రకాశిక |
| ధనంజయుడు | దశరూపకమ్ |
| నన్నయ | ఆంధ్రమహాభారతము |
| నన్నెచోడుడు | కుమారసంభవము |
| నాగయ్య, జి | తెలుగు సాహిత్య సమీక్ష |
| పెద్దన, అల్లసాని | మనుచరిత్రము |
| పెద్దన, విన్నకోట | కావ్యాలంకార చూడామణి |
| పోతన | ఆంధ్రమహాభాగవతము |
| భట్టుమూర్తి | కావ్యాలంకారసంగ్రహము |
| భరతుడు | నాట్యశాస్త్రమ్ |
| భాస్కరుడు, హుళక్కి | భాస్కరరామాయణము |
| మల్లన, చదలువాడ | విప్రనారాయణ చరిత్ర |
| మాధవరాయశర్మ | ఆంధ్రమహాభారతము-ఛందఃశిల్పము |
| రంగాచార్యులు, చెలమచర్ల | ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము |
| రామయ్యపంతులు, జయంతి | సూర్యరాయాంధ్ర నిఘంటువు |
| రామశాస్త్రి అండు సన్స్ వావిళ్ళ | వైజయంతీవిలాస భూమిక |

| | |
|---|---|
| లక్ష్మీకాంతం, పింగళి | ఆంధ్రసాహిత్యచరిత్ర |
| లక్ష్మీరంజనం, ఖండవిల్లి | ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము |
| లింగయసూరి | గురుబాలప్రబోధిక |
| విద్యానాధుడు | ప్రతాపరుద్రీయమ్ |
| విశ్వనాధుడు | సాహిత్యదర్పణమ్ |
| వేంకటరమణాచార్యులు మేడేపల్లి | ఆముక్తమాల్యద- ఉపోద్ఘాతము |
| వేంకటరమణయ్య,- బులుసు | ఆంధ్రకవి సప్తశతి |
| వేంకటరామశాస్త్రి, వేదం | ఆంధ్రసాహిత్య దర్పణము |
| వేంకటరావు, కవికొండల | తెనుగుశైలి |
| వేంకటరావు, నిడుదవోలు | విప్రనారాయణచరిత్ర- ద్వితీయపీఠిక |
| శేషయ్య, చాగంటి | ఆంధ్రకవితరంగిణి సం 8,10. |
| శ్రీనాధుడు | కాశీఖండము |
| శ్రీ స్వామీశివశంకరస్వామి- | వైజయంతీవిలాసప్రవేశిక |
| సీతారామాచార్యులు. బహుజనపల్లి | ప్రౌఢవ్యాకరణము, శబ్దరత్నాకరము |
| సుబ్బారాయుడు, మహాకాళి | శబ్దార్థచంద్రిక |
| సుబ్బారావు, వావిలకొలను | సులభవ్యాకరణము |
| సూరకవి, అడిదము | ఆంధ్రచంద్రాలోకము |
| సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానం | కావ్యాలంకార సంగ్రహవ్యాఖ్యానము |
| సోమన నాచన | ఉత్తరహరివంశము |

# సంకేత వివరణము

| | |
|---|---|
| ఆ | ఆటవెలది |
| అచ్ఛిక | అచ్ఛిక పరిచ్ఛేదము |
| ఉ | ఉత్పలమాల |
| ఉదా | ఉదాహరణము |
| క | కందము |
| కారక | కారకపరిచ్ఛేదము |
| క్రియ | క్రియాపరిచ్ఛేదము |
| చ | చంపకమాల |
| చ. ఆ | చతుర్థాశ్వాసము |
| తత్సమ | తత్సమ పరిచ్ఛేదము |
| తద్ధిత | తద్ధిత పరిచ్ఛేదము |
| తృ. ఆ | తృతీయాశ్వాసము |
| ద్వి. ఆ | ద్వితీయాశ్వాసము |
| పు | పుట |
| ప్ర. ఆ | ప్రథమాశ్వాసము |
| ప్రౌఢ | ప్రౌఢవ్యాకరణము |
| బాల | బాలవ్యాకరణము |
| మ | మత్తేభము |
| మొ | మొత్తము |
| వ | వచనము |
| వి. వృ | విశేషవృత్తము |
| వి. చ | విప్రనారాయణ చరిత్రము |
| శబ్ద | శబ్దపరిచ్ఛేదము |
| శా | శార్దూలము |
| సంజ్ఞా | సంజ్ఞాపరిచ్ఛేదము |
| సమాస | సమాసపరిచ్ఛేదము |
| సీ | సీసపద్యము |

# ప్రస్తావన

ద్రావిడ దేశమునందు వైష్ణవ మతప్రచార గావించిన వారిలో సుప్రసిద్ధులైనవారు పన్నిద్దరాళ్వారులు. పన్నిద్దరాళ్వారుల కాలవిషయము న భేదాభిప్రాయములు గలవు. క్రీస్తుశకము 2–8 శతాబ్దముల మధ్యకాల ము నందలి వారను నభిప్రాయము సర్వజనసమ్మోదమైనది ఈ పన్నిద్దరా ళ్వారులను కాలమునుబట్టి మూడురకములుగ పేర్కొనుచున్నారు 1. పూర్వ కాలికులు 2. మధ్యకాలికులు 3. అర్వాచీనులు 'భక్తాంఘ్రిరేణువు'గా సం స్కృత భాషయందు పేర్కొనబడుచున్న ఈ ఆళ్వారు అర్వాచీనుడుగా పరిగ ణింపబడుచున్నాడు భక్తాంఘ్రిరేణువును తమిళమునందు 'తొండరడిప్పొడి' 'అన్బర్ తాళ్ తూళి' యనియు పిలుతురు. ఈ తొండరడిప్పొడినే మనవారు విప్రనారాయణు డందురు ఇతడు మార్గశిర (మార్గళి) మాసమునందు జ్యేష్ఠా నక్షత్రము (కేట్టై)లో జన్మించినాడు. ఇతని జన్మస్థలము కుంభకోణ సమీపస్థ మైన 'తిరుమండంగుడి' గ్రామమందురు వైజయంతీ విలాసమునందు గ్రా మము 'మండగుడి'గ పేర్కొనబడినది.

విప్రనారాయణుడు హరివనమాల లేక వైజయంతి మాలాంశ సంభూ తుడుగా చెప్పబడు చున్నాడు అందువలననే సారంగు తమ్మయ్య, తన కావ్య మునకు వైజయంతీ విలాసమని పేరిడినాడు విప్రనారాయణుడు శ్రీరంగము నందలి రంగశాయినే కాని అన్యదైవమును, అన్యస్థలము నందలి శ్రీహరిని గాని ఒల్లడు కావునతని మంగళాశాసన స్థలము శ్రీరంగము మాత్రమే అందువలన నీ భక్తికి పరమైకాంతికమని కీర్తి విప్రనారాయణుడు తమిళ భాషలో 'తిరుమాలై' [శ్రీమాల] అను ప్రబంధమును 45 పాశురములలో విరచించిచెను అంతియేగాక 'తిరుప్పళ్లి ఎఱుచ్చి' [సుప్రభాతము] అను గీతమును రచించిన ప్రసిద్ధకవి ఈ విప్రనారాయణుడు, ఇతడు భక్తకవిగా పేరొందినవాడు.

పన్నిద్దరాళ్వారుల చరిత్రను ప్రథమముగ నాంధ్రభాషలో సంతరించిన కీర్తి తాళ్లపాక చిన్నన్నది ఇతడు మహాభక్తులైన ఈ ఆళ్వారుల చరిత్రను పరమయోగి విలాసమను కావ్యమున కీర్తించినాడు ఆళ్వారులలో ఒకరినో ఇద్దరినో గ్రహించి ప్రత్యేక కావ్యముగా సంతరించిన వారిలో మొదటివాడు శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదయందు పెరియాళ్వారు [విష్ణుచిత్తుడు]

ఆతని పుత్రిక చూడికుడుత్తనాచ్చియార్ [గోదాదేవి] చరితలను విరచించినాడు.

కృష్ణదేవరాయల యనంతరము చదలువాడ మల్లన తొండరడిప్పొడి చరిత్రను విప్రనారాయణ చరిత్రగా గ్రంథస్థము గావించినాడు దాదాపు ఇతని సమకాలికుడగు సారంగు తమ్మయ్య వైజయంతీ విలాసము నందు ఈ భక్తకవిని వినుతించినాడు. ఆ పిమ్మట ఈ కథ యక్షగానముగను, నాటకములుగను, సినిమాలుగను వచ్చి బహుళ ప్రచారము నొందినది. పండిత పామరసమాదరణీయమైనదీ విప్రనారాయణుని కథ మల్లన విప్రనారాయణ చరిత్ర కంటెను తమ్మయ వైజయంతీ విలాసమునకు ప్రచారము మెండు,

తమ్మయ సంతరించిన వైజయంతీ విలాసమునందు నాలుగాశ్వాసములున్నవి. ఇందు 468 పద్య గద్యములు కలవు. వావిళ్లవారు, ఎమెస్కోవారు ఈ గ్రంథమును ప్రచురించి ప్రచారము గావించిరి

"వైజయంతీ విలాసము-ఒకపరిశీలన" అను నీలఘు సిద్ధాంతగ్రంథము నందైదు అధ్యాయములు గలవు 'అవతారిక' అను ప్రథమాధ్యాయమునందు కవి, వంశము,కాలము,అవతారికా వైశిష్ట్యము కొనియాడబడినవి ద్వితీయాధ్యాయమగు 'కథావైచిత్రి-పాత్రచిత్రణ' యందు పన్నిద్దరాళ్వారులు తొండరడిప్పొడి, కథామూలము కథాప్రాశస్త్యము కథానిర్మాణము, కథాక్రమము, విప్రనారాయణుడు, దేవదేవి పాత్రలు పరిశీలింపబడినవి. 'రసపరిపోషణ-వర్ణనావైశిష్ట్యము' మను తృతీయాధ్యాయమునందు శృంగారము శాంతము అద్భుతము, భక్తి మున్నగు రసములును, శ్రీరంగ పురవర్ణన మధురాపురవర్ణన, కాంచిపుర వర్ణన, కుమారోదయము, సూర్యోదయ సూర్యాస్తమయ, చంద్రోదయ చంద్రాస్తమయాదులు, ఋతువర్ణనలుట్టంకింపబడినవి చతుర్థాధ్యాయమగు 'శైలిసౌభాగ్యము' నందు జటిలశైలి, సమాసరచన, అచ్చతెలుగురచన, రచనాచమత్కృతి, సంభాషణాత్మకత, సూక్తులు కళాపరిచయము, అనౌచిత్యము, సాదృశ్యరచన, లోకజ్ఞత మున్నగు విషయములన్నియు పరిశోధింపబడినవి చివరిదగు పంచమాధ్యాయమైన 'ఛందో వ్యాకరణ విన్యాసము' నందు ఛందముల పట్టిక, భిన్నయతి, వికల్పవిరమణము, ప్రాదియతి, నిత్యసమాసయతి, కాకుస్వరవళి, వైరిప్రాస, అభేదప్రాస, త్ర్యక్షరప్రాస, దుష్కరప్రాస మరియు కొన్ని వ్యాకరణాంశములు పరిశీలింపబడినవి

విబుధులు గుణమకరందమును గ్రహించి దోషలేశము నెత్తి చూపిననదియ చాలును

# విషయ సూచిక

# వైజయంతీ విలాసము – ఒక పరిశీలన

## అవతారిక

వైజయంతీ విలాస కావ్యకర్త సారంగు తమ్మయ్య శ్రీకారముతో కావ్యారంభము గావించిన వారిలో ఆద్యుడు ఆదికవి నన్నయ నాటి నుండి అది ఒక కవితా సంప్రదాయమై అలరారినది తమ్మయ కూడ తనకావ్యమును శ్రీకారముతో ఉత్పలమాల పద్యముతో ప్రారంభించినాడు వైజయంతీమాల వనమాలాంశ సంభూతుడగు విప్రనారాయణుని చరిత్రగల కావ్యమును ఉత్పలమాలా వృత్తముతో శ్రీకారము చుట్టుట మనోజ్ఞము శ్రీకారము సకల దోష నివారిణీ యనియు నా శ్రీకారమే కావ్యములకు నాద్యక్షరముగ నుండవలె ననుట కవి జనుల ప్రగాఢ విశ్వాసము [2] సారంగు తమ్మయ శ్రీరామచంద్ర కరుణాతరంగిత వైభవ సంపన్నుడు అందువలన కావ్యమును శ్రీరాముని సంస్తుతితో నారంభించినాడు

ఇష్ట దేవతా వందనము

తమ్మయ ఇష్టదైవము శ్రీరాముడు శ్రీరామ కళ్యాణమును ప్రస్తుతించుట చమత్కారముగ నున్నది వసుధాసుతాంఘ్రిదళము శిరీషదళోపమానము శ్రీరామచంద్రుని కేలు నిసర్గగుణ కర్కశము మరి రామచంద్రు డెట్లు అశ్మము మెట్టపట్టెనో యని ఇంతులు తలంతురు అట్టి పెండ్లి కాడుకు కృతికర్త కభీప్సితములు ఘటించునట 1–1

రెండవ పద్యమున ధరాసుతను కీర్తించి తన్ను బ్రోవుమని వేడి కొనినాడు. 1–2

వైజయంతీ విలాసకథ వైష్ణవ సంబంధమైనది కావున విష్ణువుని ఆయుధములను సంకీర్తించినాడు చక్రమును, ఆదిశేషుని, గరుత్మంతుని, విష్వక్సేనాదులను కీర్తించుట వైష్ణవ మత సంప్రదాయము దాని ననుసరించి తమ్మయ కూడ సుదర్శన చక్రమును సంస్తుతించినాడు సుదర్శనము ప్రసన్నభావమును తన కృతికి కూర్చుగావుత మని వేడినాడు 1–3 సహస్ర ముఖుడగు నాదిశేషుడు తనకు వచః పరంపరలను కృపసేయుగాత 1–4 అ

మట చమత్కారావహముగ నున్నది వేయునోరుల వాని వచః పరంపర అత్యద్భుతము గదా!

ఆదినారాయణునకు దాసుడు, సఖుడు, తురంగము, చిత్ర ఛ్ఛత్రము, సింహాసనమై తనర్చు వేదమయుడు, కళ్యాణప్రదుడునగు గరుత్మంతుని ప్రశంసించినాడు 1-5. వైష్ణవు లందరికి విశ్వక్సేనుడు అత్యంత ప్రాధాన్యుడు. వేత్రలతను ధరించి ఒరాచరావలులను చిత్రగతిలో శిక్షించు నేర్పరి, సూత్రధారుడై పరాంకుశవృత్తి చేకొనిన సూత్రవతీశుని చేత తన కవిత నిరంతరాయమై చొప్పడు గావుత మని 1-6 వినుతించినాడు వీరందరి నిట్లు ప్రస్తుతించినాడే గాని విష్ణుస్తుతి గావింపలేదు సుదర్శన చక్రమును, ఆదిశేషువును, గరుడుని, విష్వక్సేనుని స్తుతించిన నాది నారాయణుని స్తుతించినట్లే యని భావన కాబోలు

కంజభవుడు తన కృతి ముఖమున విశ్వజన ప్రమోద మొనరించు గాక యని బ్రహ్మను 1-7 నుతించినాడు వీణాతంత్రులు మీటుచు సుధాప్రాయాను లాపముల సారెసారెకు రుచులు పాటింప పల్కించు నా వాణీదేవి తన విమల జిహ్వారంగ మధ్యమున నటించు 1-8 గావుత మనెను, గిరివిభుడగు శివుడు కృపతో తన్ను బ్రోచు గావుత 1-9 మనెను

## పన్నిద్దరాళ్వారుల స్తుతి :

వైష్ణవ భక్తులకు ద్వాదశ సూరి స్తుతి ముఖ్యము ప్రాభాత సమయ వేళ ప్రార్థనకు పూర్వము పన్నిద్దరాళ్వారులతో ప్రార్థన ప్రారంభించుట సంప్రదాయము. సారంగు తమ్మయ యిష్టదేవతాస్తుత్యనంతరము పన్నిద్దరాళ్వారులను ప్రకీర్తించినాడు ఇష్టదేవతల యనంతర మంతటి స్థానము నీ అళ్వారుల కిచ్చినాడు ఆస్తుతి మనోహరము-

ఉ॥ ఏ దమ వచ్ఛిఖామణు లహీన శయానుఁ బ్రపత్తివాసనా
స్వాదముగ్రోలుచున్ మలయశైల మరుత్తులు తేఁటిరీతి స
శ్రీ దయితంబుగా సహచరిష్ణువుఁ జేయుచు రట్టి యాదిమ
ద్వాదశ సూరివర్యుల పదంబులు మానసవీథిఁ గొల్చెదన్ 1-10

గురుస్తుతి .

సారంగు తమ్మయ 'గురుర్దేవో' యను భావము గలవాడగుటచే తన గురువును చక్కగ నుతించినాడు.

క॥ వందారు దాస జనతా
మందారు న్వేదశాస్త్రమహిత ప్రజ్ఞా
బృందారక గురు మద్గురుఁ
గందాళప్పల గురు న్జగద్ధితుఁ గొలుతున్ 1-11

సుకవి స్తుతి :

తమ్మయ సుకవి స్తుతిని ఒక కందపద్యములో గావించుట విశేషము. నన్నయ, తిక్కనాది మహాకవుల పేర్లుగూడ తలంపలేదు జాతుల, వార్తల ఉపమల, రీతుల పద బంధముల విఖ్యాతిగ కృతులొనరించు పురాతన నూతన కవీశ్వరావళిని గొలుతు 1-12 ననినాడు. పురాతన కవులతో కలిపి నూతన కవీశ్వరావళిని తలంచినాడు

కుకవినింద ·

కుకవి నింద నొక కందపద్యములో గావించినాడు కుకవుల కృతు లందు గణశుద్ధి, గుణశుద్ధి యుండనపుడు వారిని తలంచుటేల యనినాడు-

క॥ గణశుద్ధియు గుణశుద్ధియు
గణుతింప గ లేని వారు కవితలఁ ంచు
న్గణము లు దెలుపు కొనంగా
గుణదోషము లెంచనేల కుకవులయందున్ 1-13

ఇట్లు ఇష్టదేవతాస్తుతి గావించిన యనంతరము కవి తాను గావించిన స్తుతు లన్నిటిని ఒక వాక్యమున మరల ఏకరు పెట్టినాడు శిధిలమై పోయిన భాగము లేమైన యున్న ఔచితల నవి ఈ వచనము సాయముతో పేతు చేయ

తమ్మమంత్రి భార్య తిమ్మాయి. ఈ దంపతులకు శౌర్యసింహుడు, నారసింహుడను నిరువురు పుత్రు లుదయించిరి. అందు నారసింహుడు దాన మునందు, పౌరుషమునందు, గాంభీర్య ధైర్య శౌర్యములందు వినుతి కెక్కె ను 1-25 ఈ నరసింహ మంత్రిమౌళి దాతృత్వమును, మతిలీలను, సత్కీర్తిని, విక్రమమును, తేజమును కవి బహువిధముల వినుతించెను వద, ము సీసపద్యము. ప్రతిపాదాదిని 'ఏమంత్రి' అని మొదలిడి ఎత్తుగీతిలో అతడు అని యత్తదర్థక సర్వనామ రచన గావించినాడు. ఇట్టి రచన కాద్యుడు ఉభయ కవిమిత్రుడు తిక్కనయే [3] తిక్కన పిమ్మట ముఖ్యముగా ప్రబంధ కవులందు ఈ రచన చాల ఎక్కువగా నున్నది తమ్మయ పద్యమును తిలకించుడు-

సీ॥ ఏమంత్రి దాతృత్వ మిన తనూభవ కల్ప
భూజాత మేఘులకోజబంతి
ఏమంత్రి మతిలీల యిభవక్త్ర షణ్ముఖ
స్వర ధీశ్వరుల మనీషలకు సాటి
ఏమంత్రి సత్కీర్తి హిమశైల కైలాస
పర్వతేంద్రులకు సౌభాగ్య ధాత్రి
ఏమంత్రి విక్రమం బింద్రనందన భీమ
చర్యలకును నతిస్మారకంబు

తే॥ పరంగ నే మంత్రి తేజంబు పవనమిత్ర
భానుభవ ఫాలలోచన ప్రభలకుద్ది
యతండు బుధ బంధులోక సన్నుతికిఁ దగఁడె
మంత్రికులహేళి నరసింహ మంత్రిమౌళి 1-28

అ నరసింహమంత్రి వారాశి గభీరుడై గౌరిరమణిని ఈశ్వరుడు చేపట్టినరీతి అక్కమ సాధ్విని తాను వరించెను. 1-27

మాతృభక్తి :

ఈ అక్కమాంబయే తమ్మయ మాతృదేవతి "మాతృదేవోభవ" అను

భావము గలవాడగుటచే నీ తమ్మయకవి మాతృభక్తిచే తన తల్లి నీ క్రింది విధముగ వేనోళ్ళ కీర్తించెను.

సీ॥ అశ్రాంత శాంతి దాంత్యతుల వర్తనముల
నల యరుంధతిసాటి యక్కమాంబ
కళ్యాణరూప సౌశీల్య లక్షణముల
నవని పుత్రికబోల్కి యక్కమాంబ
ప్రణుత పాతివ్రత్య గుణవైభవంబున
ననసూయ పెన్మద్ది యక్కమాంబ
యతిథి సంతర్పణవ్రత విధానంబుల
నన్నపూర్ణకు జోక యక్కమాంబ
తే॥ యనఘ లక్ష్మీకటాక్ష వీక్షానులబ్ధ
సకల సంపత్సమృద్ధిచే జగతియందుఁ
బొగడఁదగు నస్మదాదిక పుత్రజనని
హరి కృపాలంబ నరసయ్య యక్కమాంబ 1–28

ఈ అక్కమాంబ నరసింహ మంత్రులకు అనంతనమంత్రి, వేంకటాద్రి పిమ్మట సారంగు తమ్మయ్య జన్మించిరి. అనంతన, వేంకటాద్రులు వామ దక్షిణ భుజములవలె సారంగు తమ్మయకు సహాయులుగా నుండిరి 1–29

ఈ సారంగు తమ్మయ అమాత్యుడు మహమ్మదు శాహి దగ్గర కరిణీ కంబొనర్చెను. మహమ్మదు శాహి ఎనుబదినాల్గు దుర్గములకు గోలుకొండలో నేలిక ఈ రాజు హిమ్ము రమ్ము అనునంతటి సాహచర్యముతో తమ్మయ మంత్రినిచూచెనట –

చం॥ ఇనసమతేజులౌ నృపుల నెల్ల మహమ్మదు శాహి యేలు నీ
యెనుబదినాల్గు దుర్గముల నేలిన యేలిక గోలకొండఁద
ద్ఘన నగరస్థలిన్ గరిణికం బొనరించెడుఁ దమ్మమంత్రి యా
జనపతి రమ్ము హిమ్మనఁ బ్రజల్ జయపెట్ట గృహస్థులౌననన్ 1–30.

స్వప్న వృత్తాంతము :

ఇటి మహోన్నతితో వైభవములు, వివిధ భోగము లనుభవించుచున్న

పు డొక రాత్రి శ్రీరామచంద్రుడు స్వప్నమున కనబడి నీవు రచించు కావ్యము నా కంకిత మొనర్పు మని కోరెనట—కలలో కాంచిన రఘువరుని రూపమును రమణీయముగా కవి చిత్రించినాడు. అనుప్రాస శోభితమై సీసపద్యము విన నింపుగానున్నది. ప్రత్యేకమైన శ్రద్ధతో పద్యమును సంతరించినట్లు కాన బడును గమనించుడు—

సీ॥ రవికోటి రుచిపెంపు రవణింపు మణి కిరి
 టంబు వాఁడు సులలాటంబు వాఁడు
ప్రతిలేక తమకోక భాసిల్లు సిరిపేరి
 జోటివాఁడు సువర్ణ కాటి వాఁడు
కరుణారసము మించు కమలాలి వర్షించు
 చూపు వాఁడెనలేని రూపు వాఁడు
పలు వన్నియుల మించుఁ దులకించు దా ప—పు
 వింటి వాఁ డభ్రంబు వంటి వాఁడు

తే॥ నగు మొగంబున నెలవంక నలిక మొయిన
తిరుమణి ధరించు వాఁడొక్క దివ్యపురుషుఁ
డెదుట నిలుచుండి నాపేర నీవు సేయు
కావ్య మంకిత మొనరింపు భవ్యసరణి 1—32

ఇట్లు రఘుపతి పల్కు నంతలో మేల్కని పలుదిక్కులు గన్గొని స్వప్న మున కులదైవము ప్రత్యక్షమైనాడని కవి భావించెనట. స్వప్నమున దైవ సాక్షాత్కార వృత్తాంతమును చెప్పిన వారిలో నాద్యుడు తిక్కన సోమయాజి యే గ.

శ్రీరాముని కోరికను పురాకృత సుకృత పరీ పాకముగా సారంగు తమ్మయ తలంచినాడు. వినయ విధేయతలతో తన రచనా రీతిని తెల్పికొని నాడు అతిమధుర రసాస్వాదనమునకు వెగటుపడిన వారెట్లు కట్వామ్లాదిక మును రుచి చూడ నెంచునో అట్లే ప్రాచేతసమాత్ర మహాకవి ప్రవచనస్సుధారస ముల గ్రోలిన శ్రీరాముని వీనులు సారంగు తమ్మయ అల్పరస వాక్యము లానుటకు నుత్సహించెనని చెప్పుటలో నతని వినయము సువ్యక్తము.

షష్ట్యంత రచన :

ప్రాచీన మహాకవులగు నన్నెచోడాదులనుండి షష్ట్యంత పద్యరచన చేయుట ఒక కవితా సంప్రదాయముగా నెలకొనినది షష్ట్యంత రచన యందు సర్వసాధారణముగా నలతి యలతి సంస్కృత సమాసము లందుండుటయు నొక సంప్రదాయమైనది ఏ ఒక్క ప్రాచీన తెలుగు కవియు దీనికి భిన్నముగా రచించినట్లు కానరాదు ఈ షష్ట్యంత పద్యములందు కృతిపతి గుణ గణములు, ఇతర విశేషములు కీర్తింప బడును ఒకొక్కప్పుడా పద్యములు కవి కాలనిర్ణయమునకు, కృతిపతి రాజయినచో కొన్ని చారిత్రికాంశములు వ్యక్తము అగుచుండును ఈ వైజయంతీవిలాస కావ్య కృతిభర్త శ్రీరామచంద్రుడగుటచే నిది చారిత్రకముగా పెద్ద యవసరములేదు

సారంగు తమ్మయ్య ఏ కందపద్యములను షష్ట్యంత రచనలో చేసినట్లు వావిళ్ళవారి ప్రతివలన తెలియును. కాని వ్రాతప్రతిలోనివని చెప్పి మరి రెండు పద్యములను కలిపి ఎమెస్కోవారు ముద్రించిరి ఆ రెండు పద్యము లివి.

కం॥ అంభోద ప్రతిమునకున్
గాంభీర్యోదధికిఁ జటుల ఘన శాతప్రవ రా
టుంభినవ జగవ్యకిన్
గుంభీభవ వినుతునకును గుణధుర్యునకున్

కం॥ పక్షీంద్ర ధ్వజునకు సం
రక్షిత గంధేభుఖనకు నిరంతర నుత ఫా
లేక్షణ గిరిధృతికిన్ జల
జేక్షణునకు భక్తలోక చింతామణికిన్,

షష్ట్యంతపద్యము లన్నియు కందములేయగుట కూడ ఒక కవితా సంప్రదాయమే అగుచున్నది

వావిళ్లవారు, ఎమెస్కోవారు ముద్రించిన మొదటి ఐదు కంద పద్య ములందు రెండు రెండేసి చొప్పున సంస్కృత సమాసములు కలవు. అనగా ప్రతి పద్యమునందు రెండే షష్ఠీ విభక్తులుండుట, కాని పైనుదాహరించిన రెండు పద్యములందు ఒక్కొక్క దానియందు 5 సంస్కృత సమాసములు అనగా 5 షష్ఠీ విభక్తులుండుట మనము గమినింప వచ్చును సమాన రచనలో మొదటి 5 పద్యము లొకరీతిని, చివరి రెండు పద్యము లోకేరీతిని ఉండుటను బట్టి చూచినచో నా చివరి రెండు పద్యములు కొన్ని వ్రాత ప్రతుల లో ప్రక్షిప్తములయినవని తప్పక తెలియును. కావున ఎమెస్కో వారు వ్రాత ప్రతిలోనివని చెప్పి ఇచ్చిన పై రెండు పద్యములు ప్రక్షిప్తములు కానోపును

షష్ఠ్యంత పద్యానంతరవచనము :-

సారంగు తమ్మయ ప్రాచీన కవితా సంప్రదాయము ననుసరించి షష్ఠ్యంత కంద పద్యముల పిమ్మట ఒక వచనమును రచించినాడు "సమర్పణంబుగా నభ్యుదయ పరంపరాభివృద్ధిగా నభిమతార్థసిద్ధిగా నే రచియింపంబూనిన వైజయంతీ విలాసంబునకుం గథాక్రమంబెట్టిదనిన" 1-40 ప్రాచీన కవి యగు మూలఘటిక కేతన నుండి ఈ రచనా సంప్రదాయము ఆంధ్రవాఙ్మయమున నేర్పడిన దని విమర్శకాభిప్రాయము మూలఘటిక కేతన "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా చెప్పంబూనిన కథానికాయంబను లతా జాలం బెట్టిదనిన" అని మొదలిడినాడు సారంగు తమ్మయ్య వచనము నందొక వైశిష్ట్యము కలదు ప్రాచీన కవులందరి యందును ప్రథమా విభక్తికి బదులు షష్ఠీ విభక్తిని ఈ వచనములో ప్రయోగించుట ఒక సంప్రదాయమైపోయి నది, కాని ఈ తమ్మయ ప్రథమావిభక్తిలోనే-'నే రచియింపంబూనిన' అని రచించినాడేగాని ప్రాచీన కవులందరివలె 'నా రచియింపం బూనిన' అని విర రచింపక పోవుట గమనార్హము

ఆశ్వాసాంత గద్య.

ప్రతి ఆశ్వాసాంతము నందును గద్యను రచియించుట ఒక కవితా సంప్రదాయమై అలరారు చున్నది ప్రాచీన మహాకవులగు నన్నయ తిక్కనా దులు తమ ఆశ్వాసాంత గద్యలను చాల స్వల్పమైనవిగా రచియించిరి. ఒక

గద్యానే వ్రాసి ఆశ్వాసాంతము నందును వేయుచురు నాచన సోమన తన ఉత్తరహరివంశములో సుదీర్ఘమైన గద్యను వేసుకొనినాడు తరువాత ప్రబంధకవులు స్వాతిశయమును వ్యక్తీకరించు సమాసములతో, శబ్దాడంబరముతో గద్యలను రచించిన విషయము సాహిత్యోపాసకు లందరెరిగిన విషయముగదా సారంగు తమ్మయగద్య ప్రబంధకాలపు కవుల గద్యల వలె గాక ప్రాచీన మహాకవుల గద్యవలె స్వల్పముగనె యున్నది "ఇది శ్రీమదాపస్తంభసూత్ర భారద్వాజస గోత్ర పవిత్ర శ్రీరామచంద్ర కరుణాతరంగిత వైభవ సారంగు నృసింహమంత్రి తనూభవ పరిచిత భగవద్భాగవత కైంకర్యవిధాన తమ్మయాభిధాన ప్రణీతంబైన వైజయంతీ విలాసంబను మహాప్రబంధము నందు ప్రథమాశ్వాసము,"

పై గద్యను ననుసరించి సారంగు తమ్మకవి జీవిత విశేషములు తెలియును సారంగు వారిది ఆపస్తంబ సూత్రము, భారద్వాజస గోత్రము, శ్రీరామచంద్ర కరుణాతరంగిత వైభవుడు తమ్మయ సారంగు తమ్మయ నృసింహమంత్రి తనూభవు డని వ్యక్తము తమ్మయకు భగవద్భాగవత కైంకర్య విధానము పరిచితము ఈ గ్రంథము పేరు కవి ఉద్దేశించినది వైజయంతీ విలాస మనునదే కాని గ్రంథ ప్రచురణ కర్తలిరువురు అనగా వావిళ్ళవారు వైజయంతీ విలాసమను నామాంతరము గల విప్రనారాయణ చరిత్రము సారంగు తమ్మయ ప్రణీతము అని ముద్రించిరి ఎమెస్కోవారు సారంగు తమ్మయ వైజయంతీ విలాసము (విప్రనారాయణ చరిత్రము) అని ముద్రించుట విశేషము సారంగు తమ్మయ గద్యలో వైజయంతీ విలాస మను ప్రబంధముగా పేర్కొనుట పరికించ దగినది అవతారికలో ప్రబంధమని పేర్కొనలేదు

కవి కాలము :

సారంగు తమ్మయ్య కాలమును తెలిసి కొనుటకు కావ్యావతారికనుండి రెండు ఆధారములు లభించుచున్నవి–1 కవి గురువు కందాళప్పలాచార్యులు 1-11 2. గోలకొండలో నెనుబది నాల్గు దుర్గముల ఏలికయగు మహమ్మదు శాహి వద్దనే కవి కరిణీక మొనరించుట పై రెండు విషయముల నాధారముగ గాని తమ్మయ కాల నిర్ణయము గావించ వచ్చును తమ్మయ కాలమును

ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారు లీ క్రింది విధముగా పలువురు పేర్కొని యున్నారు.

కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ్మయ కాలమును 1581–161 ప్రాంతముగా పేర్కొనిరి[7] మహమ్మదు శాహి కాలమే తమ్మయ కాలమని ఆ కాలము నట్లు వీరేశలింగముగారు సూచించియున్నారు

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు సారంగు తమ్మయ కాలమును 1465 గా నిర్ణయించి యున్నారు[8] ఏ ఆధారమును బట్టి ఆ కాల నిర్ణయమును గావించినారో వారు వరిగా పేర్కొనలేదు

ఖండవల్లి లక్ష్మీరంజనముగారు కులీకుతుబ్ శాహి కాలమే 1581–1611 సారంగు తమ్మయ కాలమగువని నిర్ణయించిరి[9] మరియు నీ తమ్మయ గురువు కందాళాప్పలాచార్యులుగా చెప్పిరి ఈ కందాళాప్పలాచార్యు లెవరో కాదు' తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్య కృతిపతి యగు విరూరి వేదాద్రి గురువే[10] కావున తెనాలి రామకృష్ణుడు, సారంగు తమ్మయ సమకాలికులనిరి.

బులుసు వేంకట రమణయ్యగారు సారంగు వాని కాలమును 1510 గా పేర్కొనుట విచార్యము.[11]

చాగంటి శేషయ్యగారు తమ్మయ కాలమును క్రీ॥శ॥ 1510 గా పేర్కొనివారు[12] తమ్మయ పేర్కొనిన గోలుకొండ ఏలిక మహమ్మధు కులీకుతుబ్ శాహి కాదనియు నతడు బహమనీ రెండవ మహమ్మదు శాహి యనియు నతని కాలము 1481–15'1 కావున తమ్మయ కాలము క్రీ॥శ॥ 1510 అని నిర్ణయించిరి కాని తర్వాత చాగంటి శేషయ్యగారు తమ అభిప్రాయమును మార్చుకొనిరి చదలు వాడ మల్లన గూర్చి వ్రాయుచు మల్లన కాలము 1580 అని నిశ్చయించిరి మరియు సారంగు తమ్మయు, చదలు వాడని ఇరు మల్లన వురు సమకాలికులని పేర్కొనిరి[13] కావున శేషయ్యగారి రెండవ అభిప్రాయము ననుసరించి సారంగు తమ్మయ కాలము 1580 ప్రాంతమగుచున్నది సారంగు తమ్మయ చదలువాడ మల్లన ఇరువురు ఒకరి కావ్యము నొకరు

చూచుచుండ తమ గ్రంథములను సంతరించి యుండుననిరి.14

ఆరుద్రగారు సారంగు తమ్మయ కాలమును క్రీ శ. 1580 ప్రాంతమని చెప్పియున్నారు 15

వల్లా దుర్గయ్యగారు తమ 'మల్లన తమ్మయ కవుల విప్రనారాయణ చరిత్రములు' అనువ్యాసములో సారంగు తమ్మయ కాలమును 16వ శతాబ్దము తుది భాగముగా పేర్కొనియున్నారు.16

శ్రీ స్వామీ శివ శంకరస్వామిగారు ఎమెస్కోవారి పై జయంతీ విలాసమునకు పీఠిక వ్రాయుచు సారంగు తమ్మయ కాలము గోలకొండ నవాబు మహమ్మదుషాహి కాలము 1581-1611 గా నిర్ణయించిరి 17 కవి ఆ నవాబు దగ్గర కరణముగానుండి సరియనిరి

జయంతి రామయ్య పంతులు, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు ఆంధ్రసాహిత్య పరిషత్తు వారి విప్రనారాయణ చరిత్రకు పీఠిక వ్రాయుచు నందు సారంగు తమ్మయ కాలము 16వ శతాబ్దము తుది భాగముగా పేర్కొని యున్నారు 18

డా జి నాగయ్యగారు తమ సాహిత్య సమీక్షలో సారంగు తమ్మయ కాలము 1581-1611గా పేర్కొనిరి 19

పైన పేర్కొనిన పదుగురు అభిప్రాయములు అన్నియు సంపదించక పోవుచున్నను వానన్నిటికి ముఖ్యాధారములు కవి పేర్కొనిన రెండు ఆధారములేగదా।

I. కవి గురువు కందాళాప్పలా చార్యులు, ఇతడే పాండు రంగమాహాత్మ్య కృతిపతియగు విరూరి వేదాద్రి గురువు కూడ, కావున సారంగు తమ్మయ తెనాలి రామకృష్ణుని కాలమువాడు, కందాళాప్పలాచార్యుల కాలమువాడు ఈ కందాళాప్పలాచార్యులే చరిగొండ ధర్మన తండ్రికి పెదతండ్రి కూడ గురువని ధర్మన చెప్పియున్నాడు 20 గావున కందాళాప్పలాచార్యుల కాలమే కవి కాలము.

2. గోలకొండ నవాబు కులీకుతుబ్‌షాహి కడ కవి కరణీక మొనరించినాడు 1-30 కావున కుతుబ్‌షాహి కాలమే సారంగు తమ్మయ కాలము. కులీకుతుబ్ షాహి కాలము క్రీ శ 1581-1611 గా చారిత్రకాభిప్రాయము, కావున సారంగు తమ్మయ కాలము 1581-1611.

శాఖ :-

కందుకూరి వీరేశలింగము పంతులుగారు సారంగు తమ్మయ నియోగి శాఖ బ్రాహ్మణుడని పేర్కొనిరి, కాని చాగంటి శేషయ్యగారు సారంగు తమ్మయ నియోగి బ్రాహ్మణుడనియు, మాధ్వశాఖీయుడనిరి.21 సారంగు వారిలో భారద్వాజస గోత్రులైనవారు లేరనియు నట్లు లభించినచో నియోగిగా భావింపవచ్చుననియు, అంతదనుక తమ్మయ మాధ్వుడనియే తలంప వలయు ననిరి శ్రీ స్వామీశివ శంకరస్వామిగారు కూడ సారంగ తమ్మయను మాధ్వునిగా పేర్కొనరాదనిరి 'ఇంటిపేరును బట్టి మాధ్వుడని ఒకానొక విద్వాంసుడు వ్రాసినాడు ఆయాధార మొక్కటే చాలదు తమ్మయ మంత్రియే యైనచో నియోగియనియు, వైష్ణవము స్వీకరించిన వాడనియు చెప్ప వచ్చును' అని భావించిరి 22

అవతారికా వైశిష్ట్యము .-

ఆంధ్రవాఙ్మయము నందు అవతారిక రచన ఒక విశిష్టమైన సంప్రదాయమై విరాజిల్లు చున్నది. సంస్కృత కావ్యములందు నిట్టి కావ్యావతారిక లున్నట్లగపడదు నన్నయ నుండి ఈ అవతారికరచనా సంప్రదాయము ఆంధ్రవాఙ్మయమున నెలకొనినది సర్వసాధారణముగ తెలుగు కవుల యవతారికలందు 1 ఇష్టదేవతాస్తుతి, 2 గురుస్తుతి, 3 సుకవిస్తుతి, 4 కుకవినింద, 5 కృతికర్త వంశాను క్రమణిక 6 కృతిభర్త వంశము 7 షష్ఠ్యంతములు 8 కథాసూత్ర ప్రశంస ఇత్యాది విషయములు ప్రశక్తములగును.

సారంగు తమ్మయ వైజయంతీ విలాసము నందు పైన పేర్కొన్న విషయములు కొన్ని గలవు ఈ అవతారికలు చారిత్రక దృష్టితో చూచినపుడు చాల సహాయ కారులగున్నవి కవికిగల మత దృష్టి అందు వ్యక్తమగును.

గుతువు, పూర్వకవులస్తుతుల వలన కవికాలమును తెలిసి కొన నగును. కుకవి నింద వలన కవికి గల కవితాదృష్టి, కవిత్వ విమర్శ తెలియును

వైజయంతీ విలాస కావ్యావతారిక ననుసరించి కవి ఇష్టదైవము శ్రీ రామ చంద్రుడని తెలియు చున్నది 1-1 కావ్యము వైష్ణవమత ప్రచార గ్రంధ మగుటచే నితడు చక్రము, శేషుడు, గరుడుడు, విష్వక్సేనుని నుతించినాడు. కవియు వైష్ణవుడే గదా, బ్రహ్మ, వాణి, శివుడు మున్నగు నవ్యదైవములను కూడ స్తుతించుటచే నితడు సర్వమత సహనము కలవాడని వ్యక్తము. కావ్యము వైజయంతీ విలాసమగుటచే వన్నిద్ధ రాళ్వారుల స్తుతి చేసినాడు 1-10 గురువగు కందాళాప్పలాచార్యుల సంస్తుతి చేయుటచే సారంగు తమ్మయ కాలము మనకు సువ్యక్తమగుచున్నది.

పురాతన నూతన కవీశ్వరావళిని స్తుతించుచు వారి కవిత్వములోని విశేషములు తనకు నచ్చిన వానిని పేర్కొనుటచే మంచి కవిత్వ మన నెట్టిదో అతని అభిప్రాయము తెలిసినది జాతులు, వార్తలు ఉపమలు, పదబంధములచే సుకవులు కృతులొనర్తురనినాడు 1-12 కుకవి నిందనము వలన చెడ్డ కవిత్వము నందు గణశుద్ధియు, గుణశుద్ధియు నుండవని ఎరుగనగును.

కవి వంశాను క్రమణిక ననుసరించి సారంగు అను నింటిపేరువారికెట్లు ఏర్పడినదో ఎరుగ వచ్చును. సారంగు తమ్మయ తాతయగు తమ్మనయు రామభక్తి గల వాడని తెలియును 1-22 పూర్వీకులు కూడ రామ భక్తులన్న మాట. ఈ కవికి పితృభక్తి 1-28, మాతృభక్తి 1-28 అగ్గలము 84 దుర్గము లకు ఏలికయగు మహమ్మదు శాహి దగ్గర తాను కరణిక మొనరించితినని 1-31 చెప్పికొనుటచే కవికాలము కనుగొనుటకు అనువైనది కృతిపతి రామ చంద్రుడగుటచే చారిత్రకాంశములు లభింపవు.

సారంగు తమ్మయ వైజయంతీ విలాసంబునకున్ గథా క్రమం బెట్టిదనిన అని చెప్పి శ్రీరంగ పుర వర్ణనముతో కథ నారంభించినాడు. వైజయంతీ విలాసకావ్యము నందలి కథా వైచిత్రి, కథామూలము, కథాక్రమము, ఇత్యాదులు పరిశీలింపవలయును.

# జ్ఞాపికలు

# కథావైచిత్రి—పాత్రచిత్రణ

విశిష్టాద్వైతమత ప్రవర్తయగు శ్రీరామానుజాచార్యులకు పూర్వమే ద్రావిడ దేశమున వైష్ణవ మతమును, వైష్ణవ సంప్రదాయములను ప్రచారము గావించిన వారిలో ప్రసిద్ధులు పన్నిద్దరాళ్వారులు ఈ ఆళ్వారులను దివ్యసూరులనియు, నిత్య సూరులనియు, ద్వాదశ సూరులనియు నందురు. ఆళ్వారుల కాల విషయములో పలు భిన్నాభిప్రాయములు కలవు ద్రావిడ గ్రంథముల ననుసరించి కొందరాళ్వారులు, క్రీస్తు పూర్వము 3000 నకు సంబంధించిన వారగుదురు వైష్ణవ చారిత్రకులు వీరు క్రీస్తు శకము 2వ శతాబ్దమునకు చెందిన వారని అభిప్రాయపడిరి కొందరు పరిశోధకులు ఆళ్వారుల కాలము క్రీస్తు శకము 5–8 శతాబ్దుల మధ్యకాలమని నిరూపించిరి విప్రనారాయణుడు 8వ శతాబ్దమునకు చెందిన వాడని నిర్ణయించిరి 1

పనిద్దరాళ్వారులు :

ఆళ్వారు అను పదమునకు ప్రభువు లేక రక్షించువాడను నర్థము కలదని నిడుదవోలు వారు తలంచిరి2 మహాభక్తులైన వారిని తమిళమున ఆళ్వారులని పిలుతురు.3 ప్రాచీన తమిళము అనగా సెందమిళము నందలి ఆల్వార్ అను పదము ఆధునిక తమిళమున ఉచ్చారణలో పరిణామము చెంది ఆళ్వారు గనుచ్చరింపబడుచున్నది ఆట్ = లోతు, అవర్ = వారు = ఆటివర్ > ఆట్వార్ > ఆళ్వార్ అయి యుండవచ్చును. ఆళ్వారు అనగా భగవంతుని లోతును తెలిసి నటువంటి వారని మొదటి అర్థము కాలక్రమమున వాచ్యార్థము పోయి లక్ష్యార్థమేర్పడి ఆళ్వారు అనగా మహాభక్తులని అర్థమువచ్చి యుండ నోపును. ఈ పన్నిద్దరాళ్వారులు ద్రావిడదేశజులనియే చెప్పుదురు.
శ్రీవైష్ణవులు పఠించు గురుపరంపరా సంధాన శ్లోకమున ద్వాదశ సూరులు కీర్తింప బడినారు 4

"భూతం, సరస్య, మహదాహ్వయ, భట్టనాథ
శ్రీభక్తిసార, కులశేఖర, యోగివాహాన్
భక్తాంఘ్రిరేణు, పరకాల, యతీంద్ర, మిశ్రాన్
శ్రీమత్పరాంకుశ మునిం ప్రణతోస్మి నిత్యమ్"

పరమ వైష్ణవ భాగవతోత్తములుగా ప్రహ్లాద నారదాదులు ప్రకీర్తింప బడిన శ్లోకమొకటి ప్రాచీనమైనదికలదు. బహుశ పై శ్లోకము పౌరాణిక వైష్ణవ భాగవతోత్తములు ప్రకీర్తింపబడిన శ్లోకము ననుసరించి వీర్పడియుండ వచ్చును. ఆ శ్లోకమీరీతి నున్నది—

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి"

పై రెండు శ్లోకములు చతుర్దశాక్షర సహిత పాదములు కలిగియుండుటచే సామ్యము కొంత ద్యోతకము.

ద్వాదశ సూరుల నామములు తమిళమునందలివి కొన్ని సంస్కృతీక రింపబడినవి. ఇరువురికి మాత్రము సంస్కృత నామములేగాని ద్రావిడ నామములు లేకుండుట ఆశ్చర్యకరముగానున్నది. గురుపరంపరాను సంధానమునందలి శ్లోకములోని నామములకు ఈ దిగువనీయబడిన సంస్కృత నామములకునుకొంత విభేదము కనబడుచున్నది.

| సంస్కృత నామములు | | ద్రావిడ నామములు |
|---|---|---|
| 1 | భూతయోగి | పూదత్తాళ్వారు |
| 2 | సారయోగి | పోయిగ్గైయాళ్వారు |
| 3 | మహాయోగి | పేయాళ్వారు |
| 4 | భక్తిసారయోగి | తిరుమళిశాళ్వారు |
| 5 | శఠకోపముని | నమ్మాళ్వారు |
| 6 | మధురకవి | — |
| 7 | కులశేఖరాళ్వారు | — |
| 8 | విష్ణుచిత్తుడు | పెరియాళ్వారు |
| 9, | గోదాదేవి | ఆండాళ్ |

| | | |
|---|---|---|
| 10 | భక్తాంఘ్రిరేణువు | తొండరడిప్పొడి |
| 11 | వరకాళయతి | తిరుమంగైయాళ్వారు |
| 12 | యోగివాహయతి | తిరుప్పాణాళ్వారు |

తొండరడిప్పొడియాళ్వారు ·

ఇది ద్రావిడ నామము తమిళ భాషలోని తొండర్ = భక్తులకు' అడి = అంఘ్రులకు, పొడి = రేణువు అను పదముల యర్థమునకు సంస్కృతీకరణమే భక్తాంఘ్రిరేణువు ఈ భక్తాంఘ్రిరేణు వెవరోకాదు విప్రనారాయణుడే ఈ విప్రనారాయణుడు బాల్యము నుండియు విష్ణు భక్తుడై

తే ''వేదవేదాంగ శాస్త్రాది విద్యలెల్ల
గురు ముఖంనఁ జదివి తత్పరత నతఁడు
విష్ణుపద భక్తులఁగని సేవించి పుడమి
నెఱఁగు మీ పాదరేణువునే నటంచు'' 1 — 74

అందువలననే అతడు భక్తాంఘ్రిరేణువైనాడు మరియు నతనికిగల తమిళ నామమునకు వ్యుత్పత్తిని సారంగు తమ్మయ యిట్లు చెప్పినాడు

తే భక్తులఁ దొండరంఘ్రి శబ్దమున కడియు
రేణువునకుఁ బొడి యనియు నీరీతి ద్రవిడ
భాషఁ బరఁగుటఁ జేసి తద్భాషజనము
లతనిఁ దొండరడిప్పొడి యంద్రు భువిని 1 — 75

అని తమిళ నామమును సంస్కృత నామముల రెంటిని సమన్వయించినాడు విప్రనారాయణుడు వైజయంత్యంశ విస్ఫురణతో జనియించుట చేసి, అతని కథను వ్రాయుచు సారంగుతమ్మయ వైజయంతీ విలాస నామము ఈ గ్రంథమున కొసగినాడు. వైజయంతీ విలాసమునందలి కథకు మూలము ద్రావిడ దేశము నందలిదే.

కథా మూలము :

ద్రావిడ దేశమునందలి విప్రనారాయణుని కథ మిక్కిలి ప్రాచుర్యము నొంది యుండుటచే, ప్రాచీన కాలముననందే సంస్కృతము, తమిళము భాషలలో విభిన్న గ్రంథములు రచింపబడినవి శ్రీరామనుజాచార్యులకు సమకాలికుడుగా పరిగణింపబడుచున్న గరుడవాహన పండిత కృతమగు దివ్యసూరి చరితమే ప్రాచీనమైన గ్రంథము 6 ఈ దివ్యసూరి చరితమునే ద్వాదశసూరి చరితమనియు నందురు. ఈగ్రంథము సంస్కృతమున విరచితము దీని రచనాకాలము 11వ శతాబ్దిగ పేర్కొనబడుచున్నది7 తమిళుడగు పెరుమాళ్ జియ్యరు సంతరించిన గురుపరంపరా ప్రభావము రెండవ గ్రంథము ఈ గ్రంథము సంస్కృత తమిళ మిశ్రమమగు మణిప్రవాళశైలిలో 14వ శతాబ్దమున విరచితము8 ఈ శతాబ్దముననే మనవాళ మహాముని కృతమైన ఉపదేశరత్నమాల మూడవ గ్రంథము గ్రంథనామ సంస్కృతమే యయ్యును కావ్యము తమిళమున రచితము9 వేంకటపతిరాయల [1554-1611] కాలమున వర్ధిల్లిన అనంతాచార్య కృతమైన ప్రపన్నామృతము నాల్గవ గ్రంథము సంస్కృతరచనయగు నీగ్రంథమునకు ప్రాశస్త్యము మెండు10

సారంగు తమ్మయ వైజయంతీ విలాసమునకు మూలము ప్రపన్నామృతమని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు11, శ్రీ స్వామీ శివశంకర స్వామిగారు12 పేర్కొని యున్నారు కాని డా జి. నాగయ్యగారు గరుడ వాహన పండిత కృతమగు దివ్యసూరి చరితము మరియు ప్రపన్నామృతము రెండు గ్రంథములు మూలములని వ్రాసియున్నారు13 వాస్తవమునకే కవి ప్రపన్నామృత కథనాధారముగగొని కొన్ని మార్పులు గావించి వైజయంతీ విలాస కథను సంతరించినాడు

కథాప్రాశస్త్యము :—

విప్రనారాయణు కథకు నాంధ్రభాషలోను ఆంధ్రదేశము నందుమ కడు ప్రశస్తి కలదు పన్నిద్దరాళ్వారుల చరిత్రను తెనుగున రచింప వారిలో ప్రథమముడు తాళ్లపాకచిన్నన్న, వైష్ణవ భక్తుడగు నన్నమాచార్య వంశీ

యుడి చిన్నన్న పన్నిద్దరాళ్వారుల చరిత్రను పరమయోగి విలాసమను ద్విపద గ్రంధమున సంకీర్తించినాడు చిన్నన్న కాలము 1545 ప్రాంతమని చారిత్రకారీప్రాయము తిరుమల శ్రీనివాసుడు

"పనువడ ద్రవిడ ప్రబంధంబుఁజూచి తెనుఁగున రచియింపు ద్విపద రూపమున" అని చిన్నన్నకు ఆదేశించినట్లు గనీకవి చెప్పికొనినాడు పరమయోగి విలాసము నందలి నాల్గవ ఆశ్వాసమున విప్రనారాయణ చరిత్రము వర్ణితము.14

తాళ్ళపాక చిన్నన్న అనంతరము అళియ రామరాయుల (1564) మేనల్లుడైన సిద్ధరాజు తిమ్మరాజు పద్యకావ్యము గ పరమయోగి విలాసమను పేర పన్నిద్దరాళ్వారుల చరిత్రను విరచించినాడు ఈ పద్యకావ్యమునందలి తృతీయాశ్వాసమున 180–309 పద్యగద్యములందు విప్రనారాయణ చరిత్ర కీర్తింపబడినది 15 ఈ తిమ్మరాజు కొండవీటి ప్రభువు.

విప్రనారాయణ చరిత్రను ప్రత్యేక కావ్యముగ సంతరించినవారిలో ప్రధముడు చదలువాడ మల్లన ఈ కావ్యమునందు ౬ ఆశ్వాసములు గలవు ఇందు 4 2 పద్య గద్యములు కలవు చిన్నన్న కృతమగు పరమ యోగి విలాస కథయే మల్లన రచించిన విప్రనారాయణ చరిత్రకు మూలము.

వైజయంతీ విలాసమును ప్రస్తుత కావ్యరచయిత సారంగు తమ్మయ్య ద్వితీయుడగుచున్నాడు విప్రనారాయణ చరిత్రయను నామాంతరమును సారంగుతమ్మయ పేర్కొనలేదు కాలాంతరమున వైజయంతీ విలాసము నకు విప్రనారాయణ చరిత్రమను నామాంతరము వచ్చియుండవచ్చును 16

తంజావూరునేలిన విజయరాఘవ నాయకుడు [1633–1673] విప్రనారాయణ చరిత్రమును నొక యక్షగానమును సంతరించెను.

విప్రనారాయణ చరిత్రమును పిడుగు వేంకటకవి తృతీయాశ్వాస చరితముగ విరచించినాడు అధునాతనుడైన ఈ కవి రచించిన ఈ గ్రంధ

ము ముద్రితమై సరస్వతీమహలుపుస్తక భాండాగారమున గలదని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు చెప్పియున్నారు. 17

విప్రనారాయణ చరిత్రకు నాంధ్రదేశమున మిక్కిలి కీర్తి గడించి పెట్టిన వారు, పానుగంటి లక్ష్మీనరసింహముగారు వీరు ఈ కథను చక్కని నాటకముగా సంతరించి యున్నారు ఆంధ్రదేశమున ననేక పర్యాయము లు దిగ్విజయముగా నీ నాటకము ప్రదర్శింపబడి పెక్కు మన్ననలను గడించినది

విప్రనారాయణ చరిత్రను నాటకముగ విరచించిన వారిలో ద్వితీయుడు ఎమ్ రామదాసు. ఇతని పిమ్మట ఈనాటకమును రూపన గూడి నారాయదాసుగారును రచించియుండిరి.18 పైమూడు నాటకములు ఆంధ్రదేశమున ప్రదర్శింపబడి ప్రేక్షకుల మన్ననలకు పాత్రమైనవి.

సుప్రసిద్ధమైన విప్రనారాయణ చరిత్ర కథను సినిమాగ వెలువరించిరి.19 ఇందు కాంచనమాల దేవదేవిగను, నరసింహారావు విప్రనారాయణునిగను నటించి కథకు మిక్కిలి ప్రచారము కలిగించిరి. ఆ పిమ్మట మరల 'విప్రనారాయణ' సినిమాను రెండువసారిగ తీసిరి.23 ఈసినిమాలో శ్రీ నాగేశ్వరావు విప్రనారాయణుడుగను, శ్రీమతి భానుమతి దేవదేవిగను నటించిరి ఈ సినమా కారణముగ నీ కథ ఆంధ్రదేశమున ఆబాలగోపాలమునకు వ్యాప్తిగాంచినది ఇట్లు విప్రనారాయణకథ పండిత పామర సమాదరణీయమై ఆంధ్రలోకమున విరాజిల్లినది

కథానిర్మాణ పరిమితి :–

వైజయంతీ విలాసము చతుర్థాశ్వాస సమన్వితము. ఈ కావ్యమునందు 568 పద్య గద్యములున్నవి అవతారికకు 40 పద్య గద్యములు పోగా 528 మిగిలినవి ఇందు ఆశ్వాసాదిపద్యములు 3 + ఆశ్వాసాంత పద్యములు 4 × 3 = 12 = పోగా మిగిలినవి. 513 ఈ గ్రంథమునందు వర్ణనలకు కొంత ప్రాధాన్యము గలదు ప్రధానముగా వేశ్యావాటికా వర్ణనము తీర్థముగానే

సాగినది. సుమారు వర్ణనలకు 113 పద్య గద్యములు పోగా దాదాపు 400 పద్య గద్యములలో కథ చెప్పబడినది. మల్లన వి ప్రనారాయణ చరిత్రము నందు కథ 300 పద్య గద్యములలో నే వినుతింపబడినది వీరిరువురి కథా భాగములలో కొంత విభేదము కనబడు చున్నది ముఖ్యముగ సారంగు తమ్మయ పెక్కు మార్పులను గావించి యున్నాడనుటలో సందేహము లేదు. ఎప్పటికప్పుడు తమ్మయ గావించిన మార్పులను మల్లన కథతో పోల్చుచు నా ప్రధాన భేదములు ఇకపై జ్ఞాపికల మూలమున సూచింపబడును.

కథా క్రమము :—

శ్రీ రంగపుర వర్ణనతో కథా ప్రారంభము జరిగినది[21] శ్రీరంగపుర వైభవము పొగడశక్యము కానిది ఆపురి కుభయ పార్శ్వముల కావేరి నది ప్రవహించును ఆ నదికడ మండగుడియను భూసురపురము కలదు అందు లక్ష్మీనారాయణ[22]లను బ్రాహ్మణ దంపతులుందురు ఒకనాడు వారింటికి మాధుకరవృత్తి తను యాత్రగావించు నొకయతివరుడేతెంచెను. ఆ గృహిణి భిక్షనీయగా ననపత్య భిక్షగైకొననని చెప్పి పోబోయెను అంతనామె అతిధి విభాగమైన విష్ణు ప్రసాదమును గైకొనక ఉల్లంఘింపదగునా యని ప్రశ్నించెను యతి[23]సమ్మతించి మాధుకరమును గైకొనెను యతి వాక్యము దలచి ఆమె చింతింప దొడంగెను పతియేతెంచి చింతకు కారణమడుగ నామె యతి వాక్యము చెప్పి గొడ్రాలైన తన జన్మము నిష్ఫలమని బాధపడెను దానధర్మము లెన్ని చందముల గావించినను పుత్రుడులేని జన్మ వ్యర్థమని దుఃఖించెను. ఎంతసంపదనో ఇచ్చి దేవుడు సంతతి నీయలేదని ఆమె భర్త కెఱిగించెను, అంత నాతడు కారణములేక ఏమియు జరగదు దానికి సర్వేశ్వరుని దూఱుట వలదని చెప్పెను[24]

నాటి రాత్రి వేకువజామున నల్లనిమేనుతో, తిరునామముతో గరుత్మంతుని పై నెక్కి నారాయణుడామెకు స్వప్న సాక్షాత్కారమొసగి నలుపు తెలుపు గల పువ్వులదండ నిచ్చెను[25] ఆ వైజయంత్యంశ విస్ఫురణతో నామె గర్భము దాల్చి ఆమె ఒక కుమారుని గనియెను క్రమమున నా బాలునికి జాతకర్మ నామకర్మాది సంస్కారములు గూర్చి విప్రనారాయణుడు ఉపనీతుడై

వేదవేదాంగములు గురుముఖమున చదివెను విష్ణుభక్తులగని మీపాద రేణువు ను నేనటంచు నాతడు మ్రొక్కును విప్రుడు సకల కళ్యాణ గుణనిధియై భగవ దష్టాక్షరీ మంత్రజప పరాయణుడైనాడు వనమాలికాంశమున జనించుటచే పూర్వజన్మవాసనా కారణముగ నాతడు విష్ణువునకు వనమాలిక లర్పించు చుండును. నిత్యము నవపుష్పదామకములను నాతడు శ్రీరంగశాయికి సమ ర్పించును.

వరులతోటలలోని విరుల సరులను సమర్పించిన పూర్ణఫలము దక్కదని భావించి, కావేరితీర ద్వీపమున దేవార్చనా నిమిత్తము నొక సుక్షేత్రభూమిని విలువకు కొనెను26 ఆ తోటనుదున్ని, కావేరినీరు ఏతామున కెత్తుచు జాజులు, చామంతులు, విరవాదులు, కురువేరుకుంద వాసంతికాది పుష్పముల పూయిం చెను తోట ముందుభాగమున నొక తులసీ వనమును పెంచెను స్వాధ్యా యము పఠించుచు, విద్యుక్తక్రియ అనుష్ఠానము గావించుచు శ్రీరంగనికి మాలికలర్పించి మధ్యాహ్న సమయమున మాధుకరభిక్ష శరీర యాత్ర గడ పును ఆరామమును శిశువుగతి పోషించుచు నిట్లు జీవితము గడపుచుండగ వసంత ఋతువు వచ్చినది.

సౌందర్యవతియగు దేవదేవి అపర రతిదేవియని పుడమిజనులు ప్రస్తు తింపగా నొకతె కలదు. ఆమె అక్క శృంగార రసవేది మధురవాణి27 అప్పచెల్లెండ్రు గీతవాద్య నిరూఢి మేళమొనరించుకొని మధుర చోళవిభుని గాంచిరి ఆ మధురానగరము జొచ్చి వేశ్యవాటిని విడిసిరి సూర్యుడస్త మించెను మరునాడుదయమున సమయోచిత కృత్యములు దీర్చి ఆ స్థాన మునకేగిరి చోళవిభుని గాంచి, తత్సభాగారమున నుచిత ప్రదేశమున నాసీనులై పిమ్మట వీణవాయించిరి. రాజు సంతసిల్లి ఉడుగర లిచ్చెను మధురవాణి దేవదేవిని జూపి బాలిక రంగశాయి గుడిపాత్ర28. ఆమెమావటి నాడు సభాస్థలిలో నాట్యమాడుటకు సమ్మతింప వలసినదిగ రాజును కోరెను. రాజానుమతితో మరునాడు సభకేతెంచి సభాసదులు బాపురేయనగ నాట్య మొనరించినది చోళపతి మెచ్చివేయు సూటపదార్లు దీనారము లొసంగగా గైకొని, వీడుకొని నిజపురమునకు పోవుచు, ఎండవడికి తట్టుకొనగలేక ఒక వటవిటపి నీడ ముచ్చటలాడు కొనుచునుండిరి

ద్వితీయాశ్వాస కథ .

ప్రౌఢురాల్లనయినది చెంతనున్న విప్రుని ఉద్యాన వనమునందు పద్మాసనస్థుడై, కన్నుమోడ్చియున్న విప్రనారాయణుని గాంచిరి అనుష్ఠానానంతరము విప్రుని కించిద్దూరమునగాంచి మ్రొక్కిరి మోముపంచి గమనించక విప్రుడేగెను దేవదేవి మ్రొక్కినను మోమటు వాల్చుకొని పోవువానికి మ్రొక్కుట అనవసరమని అక్కకు చెప్పెను అంత అక్క దేవదేవితో నాతడు చూచిననేమి చూడకుండిననేమి, దేవునికి మ్రొక్కిన చూచునా? అటులే ఈ భూసురుడని చెప్పెను మరియు నా విప్రుని బ్రహ్మచర్యమును, భక్తిని వైరాగ్యమును సంకీర్తించెను మందస్మిత వదనారవిందయై దేవి-పరాశర కౌశికు లంతవారు స్త్రీలకు వశులు ఈతడేమైన శుకుడా? హనుమంతుడా? భీష్ముడా అని వెక్కిరించెను మరియు నాతని బ్రహ్మచర్యము ఘోటక చర్యమని, బక ధ్యానమని నిరసించెను. నళినాక్షులు కటాక్ష వీక్షణములు వరవ పులకించకుండుటకు నరుల దేహము లేమైన లోహములా? శ్రీరంగేశున కాతడు చేయుసేవ ఆహారార్థమేగాని సహజమైన దేవభక్తి కాదని చెప్పెను అక్క అతడు నిర్జితేంద్రియుడు నిష్ఠాపరుడని చెప్పెను

దేవదేవి అక్కతో నాతని నియమము చెఱచిన పందెము గలదాయని అడిగెను. అక్క నీవేకాదు ఈ పురిలో నున్న ఏ వేశ్య అయినను నితని విటునిగా వింపలేరనియు నట్లు గావించిన స్త్రీకి తాను నీళ్లు కట్టెలు మోతునని చెప్పెను అప్పుడు నీళ్లు కట్టెలు తాను మోచిన తప్పు కాదనియు, అక్కచేత నట్లు చేయించుట తనకు నీతికాదనియు వేరు పందెమును చెప్పుమనను అంతపందెమునవోడిన వారు అంజె తనమును విడువనట్లుగ పంతమిడి29 ఇంటికి పోయిరి.

తరణియు పశ్చిమాంబుధిని జేరెను తారలు వికసించినవి జారులు జారకామినులు రతికార్యలోలులైరి. మరునాడుదయమున విప్రుని విటుని జేసి తెచ్చుట కొరకు కపటలీల దాసరిసాని వేషమును ధరించి దేవదేవి ఆరామమునకు పోయినది మైనిండ బట్టినామములు ధరించి విప్రనారాయణుని గాంచిన, కులము, నెలవు, నామధేయాదులు విప్రుడడిగెను, అంత నామాయ

లాడి తాను శూద్రి కల జననియు, మగనాలినిగాను, ఒంటరి దాననవనియు విన్నవించుకొనెను బ్రాహ్మణులవరను పావన అనియు నందును హరిభక్తులు త్రిలోకపూజ్యు లనియు నా గుణము లాతని యందుండుటచే నాతని ఆశ్ర యింప వచ్చితిననియు చెప్పెను అనాధనని చెప్పినంతనే తల్లి, దండ్రి, అన్నదమ్ములెవ్వరు లేక మింటి నుండి ఊడిపడితివా? విరక్తికి కారణమేమని అడిగెను సాక్షాత్తు రంగనాధుడు వంటి మీతో చెప్పిన దోషము పాయునని తన కథ నిట్లుకల్పించి చెప్పదొడగెను

కాంచిపురము గలదు. ఆపురమునందనేక వారసతులుందురు ఒకవార సతియందుద్భవించి, బాల్యమునందే నృత్యవాద్య సంగీతాది విద్యలభ్య సించితిని, పేరు దేవదేవి యందురు మన్మధుడు తనకను సన్నుల నొదుగు నట, తెంకణకొంకణ దేశాధిపులు విటులై తనకు కానుక లిత్తురట కుబేరారు వారు తనకు ఎల్లపుడు కానుక లర్పింతురట మరియు తన మందిరమున కనక వర్షము కురియునట మరి అట్టి వృత్తిని ఏల ఏవగించితి ననగా నలువ సృష్టిలో లంజెకాకులమే కాకులము వేశ్య జన్మము హేయన్మము వారకాంతకు సత్యము, వలపు, నియమముండవు మూఢవిటులు భ్రమింతురేగాని ప్రద్యు మ్నుడైనవాడే వారభామినికి మన్మధుడు. వేశ్యమాత ధన పిశాచి కూతు నైన నిద్రపోనీయక విటులను పిల్చుచుండును వేశ్యమాత జామాతల నుండి ధనము నొలుచును ఆవృత్తిపై తనకు ఏహ్యభావము కలిగినదని చెప్పెను ఒక ఏకాదశి నాటిరేయి వాడవాడల విటాన్వేషణము గావించుచు తాను శిష్ణు భవనాంగణ మంటప వేదికపై భాగవతము పఠించుచుండగ నందలి పింగళాఖ్యానము వినిరోసి. ఆవేశ్య తనకు గురువుగా గ నవిరళభుజంగశయన సేవాను రక్తితో భాగవత ముద్రదాల్చి యిట్లుంటినని తన కథ నెఱింగించెను

వేశ్యాకులజయని తెలిసినంతనె విప్రునకనుమాన మేర్పడెను వేశ్యా సహవాసము శ్రీవైష్ణవులకు చందము కాదనెను మనసు పదిలమైన లంజ మందిరమువనైనను కాపురముండగ నగునని దేవి ఆ వేదవేదికి తెల్పెను నిజముగ వేశ్యావృత్తిపై విరక్తి చెందినదని భావించి, తోటపనికి తనకు సాయపడునని ఇయ్యకొనెను దేవదేవి తనకు పువ్వులు దండలుగ కూర్చుట, ఇంటిపనులు తోటపనులు చేతనగునని చెప్పి, ఆచార్య సేవాలాభమును

ప్రార్థించి ఆతనికడ చేరెను అరుణోదయముకన్న మున్నె మేల్కాంచి, దోవతు లుదికి, అలికి ముగ్గులుపెట్టి, క్రొవ్విరులుకోసి సరులుగట్టి సేవచేసెను ఎల్ల పనులు చేయుచు దాసిగా నాతని కృపవడసి ఆ తీరము నందేవసించి యుండెను. అస్ఖలిత బ్రహ్మచారి వైష్ణవుని ముందు లావణ్యలీలనామె ప్రవర్తించుచు నాతని మనమున మోహపు బీజము నాటినది అతి పరిచయకారణమున నావటువునకు మోహమై బుద్ధి చలించెను క్రమముగ నాతని మనసు కరగి, నీళ్ళకంటె పల్చనై, గారవాలిన మీను వలె, మనోజ వేదనలకు, గురియయ్యెను, అంతలో వర్షర్తువు ఏతెంచెను ఒకనాడు రాత్రి వరకు ఘోరముగ వర్షముకురిసెను వాకిటి తిన్నెపై దేవదేవి, ఇంటిలోని అరుగుపై వటుడు నిద్రించిరి30

## తృతీయాశ్వాస కథ.

వానకు తడిసిపోవుచున్న వనితను గాంచి విప్రుడు వెచ్చని తావునకు లోనికి రమ్మని పిలిచెను ఇన్ని దినములైనను మీరు సరసకు రమ్మని పిల్చినది ఇంతవరకు పూర్వము లేదు, నేడు రమ్మని పిల్చుటనన్ను ఒరసి చూచుటకా యని ప్రశ్నించినది ముంత దాచనేలయని యాతడు మనసును విప్పి చెప్పెను దానరెబోటి ఎక్కినాడు గదా యని సంతోషము మనసు లోపలను, ఎవ్వరికి ఎరకాంత ద్రోహమని, శూద్రజాతి వెశ్యనని చెప్పినది, పైనా పెట్టుదనము చూపించి నీతులు పల్కినది దీపము మలపుమని యలుగు కోరగా దీపమున్నచో ని ప్రౌఢోక్తులు పల్కి విప్రుని మన్మథ రాజ్యమును ఏలించినది ఇట్లు కతిపయ దినములు గడచినవి మానినిపై ప్రేమాతిశయము పెరిగినది దేవదేవికి సేవలు చేయనారంభించి నాడు తన ప్రతిజ్ఞ పూర్తియైనదిగాన దేవదేవి ఇంటికి పోవనుద్యుక్తురాలై ఇట్లు పల్కినది కంచినుండి తమతల్లి ఏతెంచినదనియు, నామె తన అక్క దగ్గర నున్నదనియు నామెను చూచుటకు ఇంటికి పోయెదనని చెప్పెను ఆ మాట విన్నంతనే గుండె జల్లుమన్నది స్వాంతము కలగినది ఒడలు చెమరించినది కొంతసేపటికి తెప్పరిలి, ఆమెతో కలసి సిగ్గు, భయము విడిచి వనితతో శ్రీరంగపురమునకు పోయెను

విప్రనారాయణుడు వేశ్యవిట ప్రకారంబులు గమనించుచు దేవదేవీ పురస్సరముగా వేశ్యామందిర ప్రవేశము గావించెను అతడు దేవదేవి మన్మధలీలల తేలియాడెను ఈవార్త విన్నంతనె మధురవాణి లంజతనము విడిచినది ఇంతలో శరద్రుతు ప్రవేశించినది లక్ష్మీదేవి పండగ ప్రవేశించినది విటులు వేశ్యలకు పండుగ ఉండుగులు తీర్తురాదినమున ఊరి విటులందరు తమతమ వేశ్యలకు కానుకలు పంపగా, ఏ కానుక ఈయని విప్రుని విషయ ముును గూర్చి వేశ్యమాత తనకూతునడిగెను అక్కతో పేసిన పందెము కొరకు విప్రుని ఇంటికి తోడ్తెచ్చితినని మొగమోటము లేక తల్లికి చెప్పుటయేగాక ఇక నీ ఇష్టమని చెప్పెను అంత వేశ్యమాత రొక్కమీక వేశ్యలు విటుల చేర రానీయరనియు, పెట్టలేకపోయిన దొడల నింటికి పొమ్మని కఠినముగ పల్కినది రూకలు, కోకలు ఈయలెని తానచట నుండుట మంచిదిగాదని బుద్ధి తలచి తిరిగి తనతోటకు పోయి31 చింతించెను

వేశ్యమాత తన్ను వెడల నడిపినది దేవదేవికి తెలియదనియు తెలిసిన తానే తిరిగి తోటకు వచ్చుననియు తలంచెను దేవదేవి తలపునకు వచ్చినంతనె నిద్రరాదతనికి, ధృతి ఒక్కట నిలచుటలేదు నిర్ధనునకు తనకేల సతిసంభోగము సిద్ధించుననియు వాపోయెను వారసతులకు మాతల సృజించిన విధాతృని నిందించెను వేశ్యమాతల దూషించెను పూర్వజన్మకారణముగ తాని ట్టి ఈకర్మ ననుభవించుచున్నానని భావించెను చివరికి మన్మధతాపము న కోర్వలేక రంగనాథుని స్మరించి, ఇంతితో సాయుజ్యమొందింపమని ప్రార్థించెను హరిచరణస్మరణమె శరణమని రంగనాడుని నుతించినాడు. భక్తని దీనాలాపములకు మార్గము చూపించవలయునని రంగడే బ్రాహ్మణ వటువై మణిఖచితమగు తన బంగారపు గిన్నెను స్వయముగ చోరుడై దొంగిలించెను

చతుర్థాశ్వాస కథ :

రంగశాయి కృతక వటువేషధారుడై దేవదేవి గృహంబునొచ్చి, తాను విప్రనారాయణుని శిష్యుడనని వెశ్యమాతకు పరిచయము చేసికొనినాడు

పిమ్మట తన గురువుగారిచ్చిన అనర్ఘ్యవస్తువని చెప్పి బంగారు గిన్నె నొసంగెను అంత వేశ్యమాత ఎప్రహృష్ట హృదయాంతరంగయై బాలవటువును తోడ్కొని లోనికితీసికొనిపోయి, మర్యాదగావించి మీ యయ్యగారిని పంపించుమని చెప్పెను. కాని వటువు తాను వెళ్లుటకంటే వేశ్యమాతయే తగువారిని పంపిన బాగుండుననిసలహా నొసంగెను తాను వెడలిపోయెను, చెన్నారు ఆ పసిడి గిన్నెను నమ్మక, సొన్నారి పిలిచి పరీక్షింపుమనెను పదార్వన్నె పసిడి గిన్నెయిదియని చెప్పి సొన్నారి ఆగిన్నె ఎక్కడిదని ప్రశ్నించెను సమాధానముగా వేశ్యమాత తన కూతుంద్ర సంగీత నాట్య విద్యకు మెచ్చి చోళనృపతి ఇచ్చినాడని నమ్మ బలికెను

వేశ్యమాత పసిడిగిన్నెను దేవదేవికి చూపి విప్రనారాయణుని తండ్రి మండగుడిలోని అధికారియనియు, నట్టి సొమ్ములు ఇంకను పెక్కులుండుననియు నవి అన్నియు అవశ్యము తీసుకొనవలయునుగాన నాతని మగుడ పిలువ తలతురు అట్టి కార్యమునకు సమర్థురాలు కావేరియని తలంచి విప్రుని తోడ్కొని తీసికొని రావలయునని కావేరినిపు పుత్తెంచెను ఆమె తోటకు పోయి విప్రనారాయణునితో వేశ్యమాత సంగతి తెలిసి కోపించి, ఇపుడు వెరజునే మిమ్ముతీసికొని రమ్మని దేవదేవి తన్ను పంపినదని చెప్పెను అయినను విప్రుడు నమ్మక నీవు పెరుమాళ్ల ఆన, మీయక్కతోడు నిజము చెప్పుమనిన నది అంబికమ్మపై ఆనపెట్టి మా అమ్మ, మా అక్క ఇరువురు పిలుచుకొని రమ్మనినారని చెప్పి వేగ బయలుదేరుమనెను అయినను సంశయము తీరక పాప్రరక్షకర్మమైన కానిమ్మనితలంచి వేశ్యామందిరమునకు వెడలెను.

తమ అమ్మ మాటలకలిగి అట్లు పోవచ్చునా అని దేవదేవి విప్రుని చేరదీసినది పిమ్మట వేశ్యమాతయు చనుదెంచి నవ్వుచేసికొనవలసినదేగాని తన మాటలకు కోపగించరాదని చెప్పెను దేవదేవి విప్రనారాయణునికి శిరసంటి చెంగావిమడుగులిచ్చి గంధకర్పూర కస్తూరి కాదివిలే పనములొసంగి పిమ్మట వటుని మనో వాంఛ తీర్చినది

మధ్యాహ్న సమయమున దేవళములోని బంగారు గిన్నెను కానక దేవళపుటధికారియైన జియ్యరున కెరిగించిరి వారందరు కలసి తలవరి

మంటపమున నున్న దండనాయకునికి విన్నవించిరి పట్టపగలు బంగారు గిన్నెపోయిన లోకులు నవ్వుదురు ముచ్చులు ఇంకను ఊరిని దాటిపోయి యుండరు పురిలో వెదకింపుమని చెప్పి వారిని పంపించెను వారు ఊరిలో నున్న అగసాలి వారినందరిని పిలిపించి శ్రీరంగశాయి బంగారు గి... సంగతి యడిగిరి వేశ్యమాత మందిరమున గిన్నెను పరీక్షించిన యా... సొన్నారి అపి యమును తెల్పెను అరుణోదయమున తలవరి పరిచారకులను పంపి వేశ్యమందిరమును శోధించి బిందనపు గిన్నెను గాంచిరి వేశ్యమాత తలవరికి జరిగిన వృత్తాంతం బంతయు తెల్పినది అంత తలవరి విప్రనారాయణుని తోడితెండని సేవకుల పంపెను

విప్రుడు సభకు వచ్చెను వేశ్యమాత విప్రుని పరామరిసించుడని చెప్పెను వేదవేది తనకుశిష్యుడే లేడనియు తానేకాకినియు నెరింగించెను వేశ్యామాత సరోష చిత్తయై రంగడను శిష్యునిచే నాగిన్ని పంపించినాడనియు నతని వదలితానే సభకు వచ్చినాడని తెల్పెను అంత జియ్యరు ధర్మసభ కూర్పించెను వైష్ణవ జనులు తమకు తలవంపులు తెచ్చినాడని విప్రనారాయణుని తెగనాడిరి ఎవ్వరైన తీసికొనిపోయి ఊయక గిన్నెతనంతటతాను నడచిపోదుగాన వేశ్యకు విప్రనారాయణుడే ఇప్పించి యుండునని సభాసదులాతనిపై చోరత్వమాపాదించిరి దానికి తగినశాస్తి విజ్ఞానేశ్వరీయము ప్రకారము సీమవెగల వడచుటయే ధర్మమని నిర్ణయించిరి వినమ్రముపదనుడై విప్రనారాయణుడు ఒండేమియు చేయలేక తను త్యాగమునకు కృతనిశ్చయుడాయెను ఆత్మయందు శ్రీరంగనాధుని నిలిపి ప్రార్థింపగా శ్రీరంగశాయి సభలో ప్రత్యక్షమయ్యెను అంతవిప్రుడు ఆ దేవదేవుని కమలారగాంచి, ప్రణామంబాచరించి వేనోళ్ల సంస్తుతించెను శ్రీరంగశాయి తానే లీలా వినోదమునకై యీలాగున కావించితినని, అతడు తన వనమాలికాంశ మగు, ఆమె అప్సరస్త్రీయని సభాసదులకు చెప్పెను. రోవెలదికి తానె ఇచ్చినగిన్నెను మరల తీసికొనరాదని తెల్పి మరల గిన్నెను వేశ్య కిప్పించెను సకల సభాసదులు కనుగొనుచుండ ఆదినారాయణుండు విప్రనారాయణు శరీరంబున ప్రవేశించెను 33 అంత ప్రజలాశ్చర్యచకితులై విప్రనారాయణుని బ్రహ్మరథమున గూర్చుండబెట్టి జియ్యరు ముందరి కొమ్ముమోవగా నూరేగించిరి పిమ్మట వేదవేది రంగధాము సన్నిధికేగి, తిరువాయిమొది ప్రబంధ

సూక్తుల వినుతిచేసి ప్రార్థించెను. విప్రనారాయణుని సంప్రార్థనంబులకు దేవుడు పునః ప్రసన్నుడై యాతడు కోరినట్లు దైవ సామీప్యపదవినిచ్చెను మరియు తొండరడిప్పొడియాళ్వారుగ ప్రసిద్ధినొందుమని దీవించెను. జియ్య రొసగిన బంగారు గిన్నెతోడు రెట్టింపు పసిడి కానుకయిడి విరక్తచిత్తయై దేవదేవి రంగేశ్వరుని భజించుచుండెను 34

పాత్రచిత్రణ :

వైజయంతీ విలాసమునందు ప్రధానమైన పాత్రలు రెండే–విప్రనారాయణుడు, దేవదేవి అక్కయగు మధురవాణి, మాతయగు వేశ్యమాత పాత్రలు కథోన్మీలనమునకు పనికి వచ్చిన పాత్రలేగాని ప్రధానమైనవి గావు. జియ్యరు, తలవరి, చోళరాజాదుల పాత్రలు అప్రధానమైనవే కావున మనకు విప్రనారాయణుడు, దేవదేవి పాత్రలను సారంగు తమ్మయ్య ఎట్లు తీర్చిదిద్దినాడో పరిశీలింపవలసి యున్నది విప్రనారాయణుని పాత్ర చిత్రణను సరిగా సారంగు చేయలేదని పెక్కురు విమర్శకులు చెప్పియున్నారు ఆరుద్రగారు మాత్రము వైజయంతీ విలాసము లోని విప్రనారాయణుడు తలపులు లేని కట్టెకాదు. దేవదేవికి ఆశ్రయమిచ్చు నపుడే భయపడినాడు భయపడినట్లే తాను పతనమైనాడు ఈపాత్ర చిత్రణ, క్రమోన్మీలనముగనే జరిగినదని సారంగు తమ్మయ్యను కీర్తించిరి 35 ఏమైన మానవునిగనే చిత్రించినాడు దైవాంశ సంభూతుడైన వ్యక్తికూడ మానవ జన్మ ఎత్తగనే మానవుని వలెనే ప్రవర్తించుట సహజమను భావము తో తమ్మయ్య చిత్రించి యుండును

విప్రనారాయణుడు .

వైజయంత్యంశమున లక్ష్మీనారాయణులను దంపతులకు విప్రనారాయణుడు జన్మించెను వేదవేదాంగాది విద్యలెల్ల గురు ముఖమున జదివిన వేదవేది ఇతడు భగవంతునియందే గాక భాగవతుల యందును భక్తి కలవాడితడు విష్ణుపదభక్తులను గని మీ పాదరేణువనటంచు మ్రొక్కును ఇతడు శ్రీవైష్ణవాచార విమలబుద్ధి సంపన్నుడు. అష్టాక్షరిమంత్ర జపపారాయణుడు. వనమాలికాంశ సంభూతుడగుటచే నితడు వనమాలికలను శ్రీ రంగశాయి కర్పిం

చును పరులతోటలలోని విరులతో పూజించిన దానికంటె స్వయముగ సుక్షేత్ర భూమిలో పూయించిన పూలతో పూజించిన పుణ్యమంతయు దక్కునను భావము గలవాడు. భూమిని విలిచి మెత్తగా దున్ని, విత్తనాలుచల్లి, జాతులు విర వాదులు చామంతులు మున్నగు పుష్పములపూయించెను పరమపావనమైన తులసీవనమును వేసి, అనుష్ఠానములు తీర్చుకొని, ప్రహృతాత్ముడై ప్రేల్చుచు శ్రీరంగస్వామికి తోమాలికలు సమర్పించును మాధుకరక్రియతో కుక్షిని చల్లార్చుకొనునంతటి భక్తుడితడు. శిశువును పోషించు చున్నటుల ఆరామ మును పోషించుచు కాలము గడుపుచుండెను

ప్రతి మాసవపన ముండితమైన మస్తకముతో, పిల్లసిగతో, నీర్కావి వేష్టువలు ధరించి పద్మాసనస్థుడై కన్నుమోడ్చి అష్టాక్షరీ మంత్ర చింతనము చేయుచుండెను అతడనుష్ఠానము ముగించుకొని పోవునపుడు దేవదేవి మధుర వాణులు ప్రమొక్కిరి అది గమనించలేకయే బ్రహ్మచారి పోయెను దానికలిగి దేవదేసి అక్కతో పందెమాడి విప్రనారాయణుని వంచింపదలచి, దాసరిసాని వేషముతో దరిజేరినది. విప్రుని బ్రహ్మచర్యముపై, జపముపై, అచ్యుతాంఘ్రి సేవాచింతనముపై మధురవాణికి విశ్వాసమెక్కువ, అంత నమ్మకమున్నం దుననే చెలియలుతో పంతమాడినది ఆ పురిలోనున్న ఏ వేశ్యయు విప్రుని విటునిగ చేయలేదను ప్రగాఢ విశ్వాసము మధురవాణికి కలదు దీనివలన విప్రుని ప్రవర్తనపై ఇతరులకుగల నమ్మిక వ్యక్తము.

దేవదేవి దాసరిసాని వోలెవచ్చి విప్రునకు మ్రొక్కినది ఆ దాసురాలిని చూచి ఏ ఊరు? కులమేది? నామమెయ్యది అనికుశల ప్రశ్నలు గావించెను. దేవదేవి తన వృత్తాంత మంతయు నెరింగించి తాను వేశ్యవృత్తిని మాని సేవింప వచ్చితినని చెప్పగా వేశ్యా సహవాసములు శ్రీవైష్ణవులకు పనికిరావని చెప్పిన భాగవతుడితడు వేశ్యను చేరనిచ్చిన బ్రహ్మచర్యమునకు మోసము వచ్చునను భయముతో నామె దాస్యము నంగీకరింపలేదు అంత దేవదేవి పెక్కునీతులు వల్లించి చివరికి తన మనసు పదిలమైన లంజ మందిరమున నైనను గోపురముండ వచ్చునని చెప్పగా ఆమె విరక్తిని నమ్మి, దాస్య వృత్తికి అంగీకరించెను విరక్తురాలనని పలుమార్లు చెప్పుటచే, నిక్కంపు దాసరిదని విశ్వసించి, తోటపనికి చేదోడు వాదోడుగనుండునని భావించిన

వాడే విప్రుడు రంగేశ్వరు కైంకర్యమునకు నిర్విఘ్నముగానన్ని సమకూర్చునను పుణ్యభావముతో ఒప్పుకొనెను పుణ్యభాగుడైన ఇతడు సుకుమారితో తోటపని సేయగలవా మాధుకరవృత్తి జీవింప గలవా అని మొదటనే అడిగినవాడు మాధుకరవృత్తి అలవాటు గలదని చెప్పి నమ్మించి చేరినది సూర్యోదయాత్పూర్వమే మేలుకాంచి కసవూడ్చి, అలికి, ముగ్గులు పెట్టి, దోవ తుడిచి, క్రొవ్విరులు కోసి, మాలలు గట్టి పలువిధముల సాయమొనర్చినది, అన్నపానీయములు కానవడక చేసినట్లు విప్రునికి సెయ మొనర్చినది ఆమెను సంపూర్ణముగ విశ్వసించి, ప్రతిదినము సాయంకాలము ప్రసాదమును తనతోపాటు భుజింపుమని కోరినాడు ఎక్కడ సందు దొరకక దేవదేవి ఎట్లు విప్రుని విటునిగా చేయవలయునో ఆలోచించినది వైష్ణవుని ప్రేమ లావణ్యలీల ఆమె తళుకు బెళుకులు చూపించి క్రమముగ నాతనియందు స్నేహ బీజమును నాటినది అతి స్నేహముచే నా తరుణి ధాన్యము మోహముగా నతనియందు క్రమ పరిణామము చెందినది

సీ. ఆకాంక్ష తెప్పపెయక మాచు ననిశంబుఁ
 దలఁపు చేతనె తృప్తిఁ గొలుపు మదికి
 వనజాక్షి కొంగు సోఁకిన మేను గరు దాల్చి
 మొగము విప్పగఁజేయు మగువ నగిన
 నర్థినొయ్యనఁగోర్కె నడుగ నుద్యోగించు
 నడుగఁజాలమి నేటికనుమానుఁ
 జెలివల్కు మెచ్చి కోయిల పల్కు దూషించు
 నధరంబు మధువున కానచెందు

తే. శిరసుపైఁజేనుబొడగన్నఁజేరఁబోయి
 హింస సేయకుమని చేతికిచ్చుఁదిగిచి
 తన్మయత నొందె ఠలికి చేఁతలనెహరి వ
 రాయణుఁడైన విప్రనారాయణుండు 2—138

మనసు కరిగి పోయినది గాఢదారిన మీనువలె మనోజ వేదనకు గురియైనాడు

ఒకనాడు కుంభద్రోణముగా వానకురిసినది. ఇంటిలోనున్న విప్రుడు బయట వానలో తడియుచున్న దాసరి దానిని లోనికి వచ్చి వెచ్చని ప్రదేశమున నుండుమని కోరినాడు. వాన నెపమున తన మనసులోనిది చెప్పి చిక్కటము సేయు నుపాయము చేయ దలచెను. విప్రుని ఔన్నత్యము దిగజారినది భక్తి, విరక్తి, మరచి మన్మథ జ్వరమున కాహుతి యైనాడు సామాన్యవనిత లోనికి కేతెంచి దేవదేవితో చల్లకువచ్చి ముంత దాచనేల యని తన మనోభావమును వెల్లడించినాడు. పరకాంత నంటుట దోష మనియు, వైష్ణవుడవు నీవు అంటదగునా? అని ప్రశ్నించినది.

క. ఓ సతి భగవత్సేవకు
వాసి గణింపంగ భాగవత సేవయు త
ద్దాసుల కైంకర్యము గ్రవ్వఁ
జేసిన రంగేశ్వరునకు ఁజేయుడె సుమ్మీ 3-23, అనెను.

మరియు నా బ్రహ్మచారి విగత ధైర్యుడై, మనోజ తాప మధికముగా నామె యధరామృతమును గ్రోలకున్న ప్రాణములు నిలువవని చెప్పుటలో నాతని బేలతనము తెలియును. అంత దేవదేవి శయ్యచేరి మన్మథకేళిని తేలించినది రాత్రి నిముషమువోలె విప్రునకు గడచినదట. కతిపయ దినములు గడచిన యనంతర మాతనికి ఆమెపై ప్రేమాతిశయము వృద్ధి చెందినది తన దాసురాలికి తానే సేవలు సేయుట నారంభించుటలో నాతని గాంభీర్యము నశించి పోయినది, నైష్ఠికపు వర్తన మరచినాడు ప్రతిజ్ఞ నెరవేరినది గాన దేవదేవి తన తల్లి వచ్చి తన అక్క ఇంటిలో నున్నదనియు తాను పోయెద ననినది అంత విప్రుని గుండె జల్లు మన్నది ధాతువులు పల్లటిల్లినవి. స్వాంతము కలగినది మూర్ఛిల్లి, పిమ్మట తెప్పరిలి, దేవదేవితో నామె ఇంటికి సిగ్గును, భయమును విడనాడి వెడలి పోవుటలో నాతని తాత్కాలికమైన బేలతనము వ్యక్తము

లక్ష్మీదేవి పండుగకు విటులందరు తమ వేశ్యలకు కానుకలు తీసికొని రాగా నిర్ధనుడైన బ్రహ్మచారి ఏమియు నీయలేక పోయినాడు. అంత నా

వేశ్యమాత యలిగి, దేవదేవితో చెప్పి విప్రునితో సొమ్ములు పెం
ఇంట మందుము, లేకపోయిన వచ్చిన దారినె పొమ్మని కర్క
తిరస్కరించినది రూకలు, కోకలు తేలేని విప్రుడు, మర్యాద
ఒంటరిగ తన తోటకు పోయి చింతింప మొదలిడెను దేవదేవికి తన
తెలియదనియు, తెలిసిన నామెయే మరల తోటకు వచ్చు ననిం
ఉ విరహబాధ ననుభవించు చుండెను ఆ విరహబాధలో కు
భక్తితో నిట్లు తలచినాడు.

తే లాలనము చేసి మన్మథ కేళి నేఁడు
కుసుమ కోమలి యెవ్వాని గూడునొక్కొ
యతఁడు తొలుజన్మమునను శ్రీహరిని బ్రేంచి
పుష్పములఁబూజ చేసిన పుణ్యతముఁడు

విరహజ్వర తప్తుడైన విప్రనారాయణుడు రంగనాథుని స్మరించి
నిలువదని, తన్ను జలజాతేక్షణతో సాయుజ్య మొందింపు మని
వేడుకొనెను. ఆపద్ధరణమునకు హరి స్మరణమే మార్గమని ర
వేసోళ్ల కీర్తించెను. ఇట్టి సమయమున కూడ బ్రహ్మచారి భక్తికి

కావేరి వచ్చి తన్ను వేశ్యమందిరమున కాహ్వానించి నప
డాని మాట నమ్మరాదు, పోకుండ దేవదేవి రాదు, పొందిర్బద్ధకర్మ
కుటు గానిమ్మని దైవమునే విశ్వసించి, తిరిగి వేశ్యామందిరమునకు
మాయలాడి దేవదేవియు వేశ్యమాత వలెనె ఊరడించినది రంగ
రుగిన్నె నిచ్చినది తెలియదు గావున వారు వాస్తవముగ ప్రేమిం
రని నమ్మిన వేల విప్రుడు, తనపై నేరము నారోపించినపుడు కావేరి
సభాసదులు నమ్మక తన్నే దొంగగా నిర్ణయించినపుడు. అవమాన
పలేక దేహ త్యాగము చేయదలచిన అభిమాని ఈ విప్రనారాయ
త్యాగము చేయబోవుచు, నాత్మ శ్రీరంగనాథుని నిల్పి, భక్తితో కీ
ఆతని మొర ఆలకించి, సభాసదు లందరు ఆశ్చర్య మగున్లు లు
కాయి ప్రత్యక్షమయ్యెను. ఆ లీలాదివ్య మంగళ విగ్రహముతను
దముగా సందర్శించి, సంకీర్తించి, దేవతావిత్తాపహరణ నింద

మరి ప్రార్థించిన పుణ్యాత్ముడితడు. అంత నద్దేవదేవుండు ఆ శ్రియః పతిన కిట్లనియె.

క. లీలా వినోదమునకై
యీలాగున నేను వీరి నిరుపురి రతి రా
ట్కేళిం గూర్చితి మద్వన
మాలిక యిత్త దేవరః ప్రమద యీసతియున్ 4-25

సకల జనులు చూచుచుండ నా దేవదేవుడు ఆ విప్రనారాయణుని శరీరము నందు చొచ్చెను అది ఎల్ల గాంచిన సభాసదులు విప్రుని బ్రహ్మరథమున గూర్చుండ బెట్టికొని ఊరేగించిరి. పిమ్మట విప్రుడు రంగనాథు సన్నిధికి పోయి దండ ప్రణామంబు లిడి, తిరువాయి మొదీ సూక్తులు విన్నవించెను ఆ ఆదినారాయణుడు పునః ప్రసన్నుడై సామీప్య పదవిని విప్రనారాయణున కొసంగెను. మరియు తొండరడిప్పొడి యనగా నాళ్వారుగ ప్రసిద్ధి నొందుమని దీవించి హరి అర్ధాన మొందెను. దేవుని దీవన అందిన విప్రనారాయణుడు పరమ భాగవతోత్తముడు, వేశ్య మాయలకు లొంగిన సామాన్య మానవుడుగ సారంగు తమ్మయచే తీర్చి దిద్ద బడినాడు.

దేవదేవి •

ఈమె సౌందర్యవతి. బ్రహ్మ సృష్టిలో నీడులేని అతిలోక లావణ్య రతీదేవి వంటిది చేతనాచేతనములు కరిగిపోవునట్లు వీణవాయించ గలదు, లాస్యమొనరింపగలదు. సభాసదులు మెచ్చగ, చోళాధిపతి ఆమె నర్తనకు పొంగిపోయి వేయు నూట పదార్లు దీనారములు బహుమాన మిచ్చి నాడు

తన అక్కతో కలసి విప్రనారాయణునిపూదోటను చూచుచు నక్కడ ఉన్న విప్రుని గాంచి కించిద్దూరమున నిల్చి మ్రొక్కినది వాని మ్రొక్కును గమనింపక ఆ బ్రహ్మచారి పోయెను. దేవదేవి అహము దెబ్బ తినినది కన్నీసము చూడలేదు దీవింప లేదని భావించి వెట్టివానికి మ్రొక్కుట వ్యర్థ మైనదని అక్కతో పల్కినది. మధురవాణి ఆ బ్రహ్మచారిని అతని భక్తిని పొగడినది.

ధిపదేవి స్త్రీలకు పరాశర కౌశికు లంతవారెవరులు, మరి యింత దేమైన శుకుడా? హనుమంతుడా? అని వెక్కిరించి, అతనిది పిల్లి శీలమనినది. నతిసాత్త్వుల కటాక్ష వీక్షణలకు నరుల దేహములు కరగు నన్నియు చెప్పినది. మఱియు నక్కతో సారె సారెకు నిర్జితేంద్రియు డని చెప్పుచున్నావు, నే నతని విటుని చేసెదను పందెము చెప్పు మనినది పందెము వేయుటలో నామెకు తన నెఱ జాణ తనముపై, సౌందర్యముపై గల ఆత్మవిశ్వాసము వ్యక్తము.

అక్కకు తా నోడిన కట్టెలు, నీళ్లు మోయుట నీతియే గాని, తనకు అక్క నీళ్లు, కట్టెలు మోయుట నీతి కాదని చెప్పుటలో నామెకు పెద్దలపై గల గౌరవము సువ్యక్తము. మాయలాడి యగు దేవదేవి నిక్కపు దాసరి దాని వోలె వేషము ధరించి విప్రుని దగ్గరకు వచ్చినది. ముదురుపోకగ మ్రొక్కినది. తన్ను గూర్చి తాను చెప్పుకొనుటలో ప్రౌఢత తెలియును. మీవంటి వారి యెదుట నాత్మస్తుతి నీతిగాదు. అయినను వినుమని తన మందిరమున సంతతము కనక వర్షము కురియు ననుటలో నెఱజాణ తనము తెలియును. వేశ్య జన్మము జన్మమా? వారకాంతకు సత్యము, వలపు లేవని తెగడుటలో నమ్మింప జూచుటలో వగలాడి తనము వ్యక్తము. వేశ్య మాతలు మాయామయోపేత లని చెప్పినది. వడుపు కూటిపై నసహ్యత కలిగినది. ఒకనాటి రాత్రి భాగవత పఠనలో పింగళాఖ్యానము విని, మనసునకు విరక్తి కలిగి, వేశ్యాత్వంబు మాని భాగవత ముద్రలో నా నున్నానని చెప్పుటలో నామె సంధర్భశుద్ధి, వాక్చాతుర్యము సువ్యక్తము. విప్రుడనుమానించి నపుడు మనసు పదిలమైన అంజ మందిరమున సైనను కాపురముండ వచ్చును, మహాత్మా యని సంబోధించుటలో నామె చతురవచో విలాసిని బ్రహ్మచారి దగ్గర దాసురాలిగ చేరినది. శ్రీరంగనాయికి సమ్ముఖమైన 'నిన్నుఁ గూర్చి వచ్చితి కరుణ నీడేర్పు మన్న' అనుటలోను, 'నెమ్మి వెరవుఁ గలిపి తనిఁగొను మెద తలపు లేక' అని పల్కుట వ్యంగ్య భావ వ్యక్తీకరణము.

దేవదేవి కార్య దీక్షాపరురాలు. అరుణోదయమున మేల్కొని అలికి ముగ్గులువెట్టి తపమూడ్చి, ధోవతులుతికి, ప్రొవ్విరులు కోసి సరములు కట్టుటలో నామె నిక్కపు దాసురాలుగ విప్రుడు భావించినాడు నిత్యము తాను స్వయంపాక మాచరించి సాపాటు చేయుదు నని చెప్పి, ఇ ంటికేగి యమ్మాయి

భుజించుటలో నామె మోసకారి తనము తెలియును ప్రతిదినము బ్రహ్మచారిని విటునిగ చేయుటకై రంధ్రమారయుచు నుండెను. కార్యదీక్షతో నాతని మనసు కరగించుటకై, మోహబీజము నాటుటకై ఇట్లు ప్రవర్తించినది.

సీ. మూఁపుపైఁ గురులు క్రొమ్ముడి నేయు నొకవేళ
నొకవేళఁ జెంప కొప్పారఁగ దిద్దు
వెలివాఱి దోఁప నీవి సడల్చు నొకవేళ
నొకవేళఁ గంచుకంఁ బూడ్చి తొడుగుఁ
దొకతొక నాడు ముద్దుల మాట లొకవేళ
నొకవేళఁ బ్రౌఢోక్తు లొనర నెరపు
వలిపెంబుఁ గట్టుఁ బావడ లేక యొకవేళ
నొకవేళఁ బయ్యెద నోరచేయుఁ

తే. గదిసి వీనులు సొక్కఁ జొక్కముగఁ బలుకు
నొయ్య నొయ్యన సంగీత మొక్క వేళ
సకియ యస్ఖలిత బ్రహ్మచారి యైన
వైష్ణవోత్తము బ్రోల లావణ్య లీల 2-134

ఇట్టి వేశ్యా సహజమైన చేష్టలతో మోహపు వటబీజము బ్రహ్మచారి మనసున నాటినది ఆ తరుణి హాస్య స్నేహము మోహమై విప్రునికి బుద్ధి చలించినది మనోజ వేదనకు గురి అయినాడు ఒకనాడు ఘోరమైన వర్షము కురిసినది వాకిట బయటనున్న దేవదేవిపై జల్లు పడుచున్నది అది గమనించిన విప్రుడు ఇదే అదనని ఆమెను లోనికి పిల్చి తన మన్మథతాపమును ...యట పెట్టినాడు శృంగార విషయము బ్రహ్మచారి చేతనే పల్కించగల దిట్ట దే దేవి చేయ వలసిన చేష్టలు గావించి, ఆ మన్మథబావము నాటి వానిని వెఱ్ఱి వానిగ చేయుటలో నామె ఎట్టి మాయలాడియో, వగలాడియో మనకు తెరియును.

దాసరిసాని లోనికి వచ్చినది. చెంతకు చేర రమ్మని వవుడు బెట్టుదన చూపించుచు తన్ను ఒరసి చూచుటకాం నిక్కమా యని అడిగినది బ్రహ్మ చారి మనోభావమును చెప్పినంతనే 'చిక్కెరా దాసరిబోడి ఇప్పుడు గదా పరి వారలలో తలవెత్త గల్గుదు నని మిక్కిలి సంతోషపడినది. పంతము గెల్చు టలో నామెకు ఎంత సంతసమో! పరకాంతను చేపట్టుట దోషమని, శూద్రజాతి పడుపుసతి నంట రాదని పెక్కు 'శ్రీరంగ నీతులు' వల్కినది బ్రహ్మచారి పెక్కు భంగుల మనోజ తాపమును వ్యక్తము చేయుగా నీమె అనేక రీతుల నీతులు ఒల్కిన నెఱజాణ, దీపము ను మలపు మన్నపుడు దీపము లేని రతులు సుఖలోపములని చెప్పుటలో నామె ఎంత ప్రౌఢయో తెలియుచున్నది స్త్రీ సహజమైన సిగ్గును విడిచి వేశ్యా సహజమైన ఎల్కులు వినిపించినది మరియు మోవి ఇమ్మని బ్రహ్మచారి యడిగి నపుడు—

తే. విటజ నోచ్ఛిష్టమైనట్టి వేశ్యమోవి
వేద పారాయణాతి పవిత్రమైన
వైష్ణ వాస్యంబు నెట్లంట వచ్చు ననిన 3—39 నెఱజాణ ఈమె

మన్మథ జ్వరపీడితుడైన విప్రుని తనకు దాసునిగ నొనర్చిన దిట్ట దాసిగ జేరిన దేవదేవి అతని చేతనే ఊడిగములు చేయించుకొనిన ప్రౌఢవేశ్య.

వచ్చిన పని ముగిసి నంతనే, ప్రతిజ్ఞ తీరినంతనే అక్కడ తనకు పనేమి యని ఆరామము వెడలి పోయినది. ఆమె వెంటనే వచ్చిన బ్రహ్మచారిని కొన్ని దినము లు చేరదీసినది. లక్ష్మి పండుగకు విటులందరు తమ తమ వేశ్యలకు పెక్కు కానుకల నిచ్చిరి ఏమియు నీయజాలని విప్రుని ఇల్వెడలింప దలచి వేశ్యమాత దేవదేవితో చెప్పగా నామె—

క. పొది నవ్వయు నేనును బ
న్నిది మూడిన కోన మితనిందెచ్చితి నింక నా
కొదవ పని తీరె నింక నీ
కొదవయొ యని పల్కెన. 3—86.

మాయలాడి వేశ్య ఈమె బంగారు గిన్నె లభించిన పిమ్మట వేశ్యమాత కావేరి పంపి విప్రనారాయణుని తోడ్తెచ్చిరి వచ్చిన విప్రుని మరల చేరదీసి దేవదేవి ఊరడించినది ధనమే ప్రాధాన్యము వేశ్య కనుటకు దేవదేవి ప్రతినిధురాలైనది సంపె గ నూనెతో విప్రుని శిర సంటినది గంధ కర్పూరాది సుగంధ ద్రవ్యములనిచ్చి గౌరవించినది విప్రుని మనోవాంఛలను దీర్చినది

సభలో రంగశాయి ప్రత్యక్షమై దేవదేవి ఒక అప్సరః ప్రమద యని సభాసదులకు వెల్లడి జేసినాడు తానే వారిరువురి నిట్లు రతిరాట్కేళిని గూర్చి నాననియు తెల్పినాడు. అనగా దైవలీల వలననే దేవదేవి యట్లు ప్రవర్తించిన దన్నమాట ప్రారబ్ధ శుభాశుభ కర్మముల ననుభవింపక ఏరికైనను తప్పదని నపుడు దేవదేవి యనగనెంత మరియు స్వయముగ నాదేవదేవుడే వేశ్య కిచ్చిన యది గైకొనరాదని చెప్పి మరల జియ్యరుచే గిన్నె నిప్పించినాడు జియ్యరు వివిధ వస్త్రసమన్వితముగ కనకపాత్ర నా దేవదేవి కొసగినాడు. అప్పటికే దేవదేవియు విరక్త చిత్తయైనది మరియు

క. పెరుమాళ్లకు నా గిన్నియ
యిరుమడుగుల పసిఁడి కాన్కయిడి తన కిదియే
తిరువారాధనగాఁ గాని
సిరివరు రంగేశ్వరుని భజింపుచు నుండెన్ 4-13.

పూవు వలన దారమునకు తావి యబ్బినట్లు విప్రనారాయణు సాంగత్యము వలన దేవదేవికి తిరువారాధన అబ్బి మహాభక్తురాలుగ, విరక్తురాలుగ పరిణతి నొందినది

ఈ కావ్యము శృంగార రసోపేతమై, వర్ణనల కాలవాలమైనది. వర్ణనలు అతి దీర్ఘములుకావు విసువు పుట్టింపవు వర్ణనలు కథోన్మీలనమునకు పనికి వచ్చునవిగా నున్నవి

)—(

# రసపరిపోషణ - వర్ణనా వైశిష్ట్యము

'రస్' అను ధాతువు వలన ఆస్వాదించుట అని అర్థము "సామాజికైః రస్యన్తే ఆస్వాద్యన్తే ఇతి రసాః"1 - సామాజికులచే నాస్వాదింప బడునది రస మని చెప్పనగును. రసము ను గూర్చి గాని దాని స్వాదుత్వమును గురించిగాని సాహిత్య దృష్టితో పేర్కొనినవారిలో ప్రథముడు భరతముని. భరతుడు - "విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః"2 అని రసనిష్పత్తిని గూర్చి వివరించినాడు. భరత మహర్షి అభిప్రాయము ననుసరించి విభావానుభావ వ్యభిచారి భావముల సంయోగము వలన రస నిష్పత్తి సంభవించునని ఎఱుక పడుచున్నది. దశరూపక కర్తయగు ధనంజయుడు -

'విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమాన స్వాదుత్వం స్థాయీభావో రసస్మృతః'3 అని పేర్కొనుటచే విభావానుభావములతోను సాత్త్విక వ్యభిచారి భావములతోను ఆస్వాద్యమాన మగు స్థాయీభావమే రసమని తెలుచున్నది. ప్రతాపరుద్రీయ కర్త విద్యానాథుడును విభావానుభావ సాత్త్విక వ్యభిచారీ సామగ్రీ సముల్లసిత స్థాయీభావో రసః'4 అనుటచే నితని అభిప్రాయముగూడ - విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావముల సమ్మేళనముతో నేర్పడు స్థాయీభావమే రసమని తెలియుచున్నది.

కావ్యమునకు రసము ఆత్మ వంటిదని కొందరు ఆలంకారికులు పేర్కొనిరి. వారు ఛందశ్శబ్దాలంకారాదులు కావ్యమునకు శరీరము వంటివనియు చెప్పియున్నారు. కావ్య నిర్వచనము గావించుచు విశ్వనాథుడు 'వాక్యమ్ రసాత్మకమ్ కావ్యమ్'5 అని పేర్కొనినది, సర్వజనామోదమై విరాజిల్లినది. మహాకవియగు వాడు తన కావ్యమున రసపరిపోషణకై మిక్కిలి పాటుపడును. రసానందప్రదము గాని కావ్యము నీరసమై పఠితల హృదయముల నాకర్షింపజాలదు. పూర్వజన్మ సంస్కార కారణముగ కావ్యమును పఠించి నంతనే చదువరులకు చిత్త ద్రవీకరణ సంభవించును. పఠితలకు చిత్త ద్రవీకరణము చేయని కావ్యమును మహాకావ్యముగా పేర్కొనుటకు వలను పడదు.

వైజయంతీ విలాసకథ నవరస పరిపోషణ కనువైన ఇతివృత్తము కాదు. పరనారీ పరాఙ్ముఖుడైన విప్రనారాయణుడు సహజ వైరాగ్య సంపన్నుడు వైష్ణవ బ్రహ్మచారి, మహాభక్తుడు, భక్తితత్పరుడగు నితని, వగలాడి దేవదేవి వంచించి శృంగారమునకు దాసోహ మనిపించుటయే ఇందలి కథ పెక్కు రసముల పోషించుట కనువైన ఇతివృత్తము కాదు.

వైజయంతీ విలాసమునకు భూమిక వ్రాసిన వావిళ్ల రామస్వామి అండ్ సన్స్ వారు ఈ కావ్యము నందలి అంగాంగిరస ప్రస్తావనచేయ లేదు ఏమెస్కోవారి వైజయంతీ విలాస కావ్యమునకు ప్రవేశికను సంతరించిన శ్రీ స్వామీ శివశంకర స్వామిగారిట్లు రస విషయమును పేర్కొనిరి- 'భక్తి శృంగారములు బాగుగా పోషింప బడినవి ప్రబంధము అద్భుత రస పర్యవసన్నమై తాత్పర్యార్థ ప్రధానమౌచున్నది'7 మరియొకచో స్వామిగారు దేవదేవిని గూర్చి వ్రాయుచు నామె తన కిచ్చిన బంగారు కానుకలను శ్రీ రంగనాథునకు సమర్పించి, పిమ్మట విరక్తురాలై శేషజీవితమును భక్తితో శ్రీరంగనాథు నారాధించుచు గడపినదనిరి 8 అనగా కథ భక్తియందు పర్యవసించినది శృంగారము-భక్తి రెండింటికి దేవదేవి విప్రనారాయణులు ప్రతినిధులు ఇందు తాత్కాలికముగ భక్తి శృంగారమునకు లోబడి నట్లు కనబడినను చిట్టచివరకు నిరువురు విరక్తులై భక్తితో జీవిత పర్యంతముండుటచే నీ కావ్యమున భక్తియే మిన్న యని నిరూపించి నట్లయినది

ఈ కావ్యము నందు భక్తి కన్న శృంగారమునకే ప్రాధాన్య మీయబడినది పైగా భక్తిని రసముగా పేర్కొనుట ఆలంకారిక సమ్మతముగాదు కావ్య పరమార్థము భక్తియే అయ్యును శృంగారముపై ఈ కావ్యము నందలి అంగిరసముగా పేర్కొనుట కావ్య ధర్మము కావ్య కథారంభము నిష్ఠా గరిష్ఠుడైన విప్రనారాయణుని భక్తితో మొదలగును కావ్య మధ్యమున భక్తి శృంగారములకు సంఘర్షణ ఏర్పడి తాత్కాలికముగ శృంగారము నెగ్గినది కథాంతము భక్తితో ముగిసినది ఆది మధ్యాంతములందు శృంగారము లేదు, కాని భక్తియే ప్రాధాన్యము వహించినది కావున అంగిరసమైన శృంగారము, పిమ్మట అంగిరసముగా పేర్కొన దగినది భక్తియే యగును ఈ కావ్యము నందు అద్భుతమును మరియొక అంగిరసముగా పరిగణనము చేయ వచ్చును. ఇక అంగిరసమైన శృంగారము నెట్లు పరిపోషించి నాడో ఇంచుక పరికింతము.

శృంగారము.

ప్రేయసీ ప్రియుల ఎదలలో పుట్టు సంభోగ సంబంధ మగు నిశ్చయే రతి. ఈ రతి శృంగార రసమునకు స్థాయి భావము గదా! రస రాజమగు శృంగారమునకధి దేవత హరి. హరి అంశావతారమే శ్రీరంగనాథుడు ఈ కావ్య నాయకుడగు విప్రనారాయణుని ఇలవేలుపు శ్రీరంగనాథుడే యగుట విశేషము హరి ధరించు వైజయంతి మాలాంశ సంభూతుడగు విప్రనారాయ ణుడు ఎంత విరక్త సంసారుడైనను, పరమ భాగవతోత్తముడైనను, శృంగార రసాధి దేవత మాయలో శృంగారలోలుడై దాసుడైనాడు

శృంగారము సంభోగ శృంగారమని, విప్రలంభ శృంగారమని ద్వి విధము ఈ రెండు శృంగారములు ఈ కావ్యమున కొంత పోషింప బడినవి ప్రథమా శ్వాసమున ఏ మాత్రము శృంగార ఛ్ఛాయకూడ కనబడదు ద్వితీ యా శ్వాసము, తృతీయా శ్వాసమున కొంత మాత్రముగ శృంగారము గలదు చతుర్థా శ్వాసమున శృంగారము శూన్యము

శృంగారమునకు లోనుగాకుండుటకు నరుల దేహము లేమైనా లోహ ములా అని దేవదేవి తన అక్కతో పల్కిన పల్కు లందు శృంగార రస దృష్టి వ్యక్తము ఇందువదనల ముఖవిలాసములకు, పూబోడుల కుచాశ్లేషములకు, మహిళల మధురభాషలకు, వనితల నిశ్వాసవాసనలకు, కలకంఠకంఠుల కలికి చూపులకు, పాటల గంధుల పాటలత పెదవుల మందహాసములకు, మగు వల వాతెఱ మధువులకు మునివృక్షతతులే వశ్య మగుచుండ నరుడు వశుడగు టలో చోద్యమే మున్నదని 2-20 దేవదేవి చెప్పిన ఈ పల్కులు శృంగార రస సమన్వితములు మరియు

క కలికించిత రస పూరము
  జిలికించి కటాక్ష వీక్షచే నలినాక్షుల్
  తిలకించి చూచి నపుడు
  పులకించక నరుల దేహములు లోహములే  2-21 అనునపుడు

హృదయములు శృంగార రస సమంచితములగును.

జారుల జారకాంతల రతి స్థలములను కవి యిట్లు పేర్కొనినాడు కట్టనికా నివేశములు, గోష్ఠతలములు, తత్కరీషపు దెడ్డిలు, పాడుగోడలు, నదీనదనములు, వసులగాడి మఱుగులు, గుళ్లవంచలు జార రతి కార్యములకు కట్టని యిండ్లట జార రతి కృత్యము లందు ఏమేమి లేదో వాని నన్నిటిని పేర్కొనినాడు ఈ పేర్కొనుటలో నొక చక్కని చమత్కారము గలగు రతి కేమేమి అవసరమో, అవి ఏమియు లేవని

మ అనుగంధాంగ విలేపనం ఒనఖదంతాంకం ఒతాంబూల మ
ప్రసవాలంకరణం ఒముక్తమణీతారావం బశయ్యాతలం
బ సుఖస్వాప మ ఒంధనైపుణ్య మసంప్రాప్తాంగ సంక్షాళనం
ఒసి ధారాటనమైన జార రతి కృత్యం బత్తఱి న్వర్తిలెన్ 2-40

రహస్యరతులు, చాటుగా చేయురతులు, భయముతో చేయు రతులు గాన ... సుఖము నందింప జాలవు 10 అసంప్రాప్తాంగ సంక్షాళన మని పేర్కొనుట అనౌచిత్య భాసితము, అధిక ప్రస్తావన

సమవయస్కులగు కోడె కాంత్రతో వేశ్య లెట్లు క్రీడింతురో ఈ క్రింది పద్యమున సూచితము ఈ కావ్యమున నాయికా నాయకుల శృంగారము కంటె నితరుల శృంగారమే వర్ణితము

సీ చెలువ గట్టిన చీర కొంగొంగ గట్ట యా
సగము పై కల్లెవాటుగ నమర్చి
పనిబూని రేకదిద్దిన కన్బొమల నంట
గమ్మతావుల కదంబమ్ము నల తి
లీలగా నూరుదోర్మూల భాగమ్ము
వాసించు గోవ జవ్వాది ... చి
తనురాక ప్రియుల కెంతయు దోల ... బి
సాళించు కీల్జు పాగాలు మెచ్చ

తే. చుట్టు పువ్వుల సిగలు కస్తూరి బొట్లు
సంది తాయెతులును జెంప గందములును
గలిగి నవ వయస్కులగు కోడెకాండ్రఁ గూడి
విటులు విహరింతు రచ్చటి వేశ్యవాటి 2-45

రాత్రులందు విటులు కొందరు సహ్యజా సైకత వేదికా వళిని మరి కొందరు చంద్రకాంత మణికుట్టిమ గృహాంగణములందు, ఇంకకొందరు వృక్షవాటికాళిందవముల మనోజ సుఖలీల 2-48 దేలిరట

దేవదేవి ఘోటక బ్రహ్మచారి యగు నా విప్రుని ప్రేమల, లావణ్యలీలల నిట్లు వ్యక్తము చేయుచు నతని హృదయమును శృంగార రసాభిముఖముగ మరల్చుచున్నది చూడుడు-

సీ. మూఁపుపై గురులు క్రొమ్ముడినేయు నొకవేళ
నొకవేళఁ జెంప కొప్పారఁగ దిద్దు
వెలినాభి దోఁప నీవిసడల్చు నొకవేళ
నొకవేళఁ గంచుకం బూడ్చి తొడుగుఁ
దొకతొక నాడు ముద్దులమాట లొకవేళ
నొకవేళఁ బ్రౌఢోక్తు లొనర నెరపు
వలిపెంబుఁ గట్టుఁ బావడలేక యొకవేళ
నొకవేళఁ బయ్యెద నొరచేయుఁ

తే. గదిసి వీనులునొక్కఁ జొక్కనుగఁ బల్క
నొయ్య నొయ్యన సంగీత మొక్కవేళ
సకియ యస్ఖలిత బ్రహ్మచారియైన
వైష్ణవోత్తము మ్రోల లావణ్యలీల 2-134

ఒకస్త్రీ ఎదుట నిట్టి చేష్టలుగావించిన నెట్టి మగవానికి మతిభ్రమణముకాదు? విప్రనారాయణుని మనసు వెన్నవలె కరిగినది శృంగారముపై దృష్టి మరలినది మనసు గతి దప్పినది అనిశము ఆకాంక్షతో నామెను రెప్ప వేయకుండ చూచును

ఆమెను తలచిన తలపుతోనె మదికి తృప్తి కలుగును కొంగు సోకిన మేను ఉప్పొంగి పోవును ఆమె నవ్వినంతనె తన ముఖము వికసించును చెలి పల్కుముందు కోయిల పల్కు నచ్చదు అధరపు మధువున కాసపడు నతని హృదయము; ఈ చేష్టలన్నియు శృంగార రస సమన్వితములే. దేవదేవి ఎట్లు విప్రనారాయణుని విటుని చేసినదో పరిశీలించుడు. శృంగారమును వాచ్యము గాకుండ నిట్లు వర్ణించినాడు.

సీ. అత్మ హస్తమునఁ బంచాయుధ చిహ్నము
 ల్బాహు మూలంబులఁ బాదుకొల్పి
దలమైన చెమట బొట్టెలమితోఁ జెన్నొంద
 నలిక భాగంబునఁ గలుగఁ జేసి
జమిలి రేఫలకు దీర్ఘములిచ్చి నైచ్య భా
 వంబుగా దాస నామంబుఁ జేసి
మౌని దుర్లభమైన మణిత మంత్ర రవంబు
 శ్రవణసంగతి రహస్యముగఁ బలికి

తే. నెమ్మి రతి దేవ పూజాక్రమమ్ము దెలిపి
యఖిల సంస్కారసరణు లిటులాశ్రయించి
మన్మథ ప్రాప్తుఁడైన యమ్మాణవకుని
మృగ విలోచన నిజ శిష్యునిగ వరించె 3—48.

దేవదేవితల్లి వేశ్యమాత విప్రనారాయణుని తమ గృహమునుండి వెలువరించి నపుడు అతడు తన పూదోటకు పోయి ఏకతమున విరహుడై విప్రలంభ శృంగారము ననుభవించినాడు ధనాశతో వేశ్యమాత తన్ను వెళ్లదోలినది చూచి యుండరాదు గాన దేవదేవి అవశ్యము తన్ను చేరవచ్చునని భావించును ౩—111 ఆరీతి నారీతిలకము రాకపోయిన మన్మథ తాపము తరించు వల నెట్టిదియో యని ౩—113 చింతించును సతికి పతికి వలపు సమానముగ జరిగిన వలపంత సౌఖ్యము స్వర్గమున కూడ నుండదని ౩—114 తలంచును మరియు నామె తలపునకు వచ్చి నంతనె నిద్రరాదట, చలి దార్కొనునట, ఎవరిని పిల్చిని గుండె జల్లుమనునట, మనః పరితాప వేదనచే

ధృతి నిల్చినచోట నిల్వదనియు నట్టి దురవస్థ వగవాని కేనియు వలదని విలపించును 3-115. దేవదేవి యున్నని బాహువులు, సుధారస మొలుకు పలుకులు, మేనుఁదీవ, సిబ్బెపు గుబ్బగుబ్బలు, కన్నుల నవ్వు నెమ్మొగము కన్నులకు కట్టినట్లయి విప్రనారాయణున కది మధుమాయమో, తనకు మతి భ్రమణము కలిగినదియో తెలియకంతని విరహ వేదన కల్గినది 3-116 విరహ బాధచే తప్త హృదయుడై విప్రనారాయణుడు ధనమును, తన్ను తాను, బ్రహ్మను, వేల్పులను ఉపాలభించినాడు ధనము గల్గిన పుణ్యాత్మ వశ్యాలికి గాక నిర్భాగ్య దామోదరుడగు తనకు నా సతి సంపర్కము సంభవించదట 3-119 దేవత లేమి చేసిరని బ్రహ్మ దేవ వేశ్యలకు మాతలన సృజించలేదు పుడమి జనులేమి చేయులేదని ఇక్కడి వేశ్యలకు మాతలన సృజించినాడు బ్రహ్మ అని ఉపాలంభించినాడు ఈ క్రింది పద్యమున బ్రహ్మనే గాక బ్రహ్మను వర్ణించిన కవులను నిందించినాడు మనోజ్ఞమగు పద్యమిది.

సీ. ముసిఁడి మ్రాఁకున సైతమును బండ్లు గల్పించి
చెఱకునకేల సృజింపఁడాయె
బూతి గడ్డకు సైతము ను గంధ మొనరించి
కుందనంబునకేల కూర్పఁ డాయెఁ
బొలము తాళ్లకు సైతమును బువ్వుఁ గల్పించి
శ్రీగంధమునకేల చేర్పఁ డాయెఁ
బుట్టి క్రోవుల సైతమును జీనె గలిగించి
గేదంగి కేల కల్గింపఁ డాయె

తే. ధర నిరక్షర కుక్షుల ధనులఁ జేసి
విద్య గలవారి నేల దుర్విధులఁ జేసె
బ్రహ్మ ననునేటి కతని నేర్పరిగ నెంచి
పుడమి వర్ణించు కవులఁ జెప్పెడిది గాక 3-121.

ఇట్లుకవి విప్రనారాయణుని విప్రలంభ శృంగారమును కొంచెము దీర్ఘముగనే వర్ణించి నాడనుట తథ్యము

శాంతము :

నిత్యానిత్య వస్తు విచార సమయమున జనించు చిత్తవృత్తిని శమ మందురు ఈ శమము శాంత రసమునకు స్థాయీ భావము గదా! శాంత రస వర్ణము శ్వేత వర్ణము. శాంత రసాధి దేవత శ్రీమన్నారాయణుడు.

విప్రనారాయణునకు నిత్యానిత్య వస్తు విచారము తెలిసినది చిత్త నైర్మల్య సంసిద్ధికి శమ దమాదుల సంసిద్ధికి వైరాగ్యము, భక్తి శరణ్యములని ఎఱిగెను. వేదవేదాంగ శాస్త్రాది విద్యల గురుముఖముగ నభ్యసించి వాడు విష్ణుపద భక్తులగని సేవించును సకల కల్యాణ గుణనిధియగు విప్రనారాయణుడు అష్టాక్షరి మంత్ర జపపరాయణుడయ్యెను మరియు నాతడు సాత్త్వికత్వమే పురుషరూపము దాల్చినదా యన్నట్లుండెను. వినయము, కరుణ, జ్ఞానము, సత్యము, తాల్మి, శాంతము, హరిభక్తి పురుష వేషము ధరించి నట్లున్నాడని ౧-౭ కవి వర్ణించుటలో శాంత రసభావము చిప్పిలు చున్నది మరియు దేవదేవి మధుర వాణులు విప్రనారాయణుని సందర్శించి నపుడాతని రూప వర్ణనలో శాంతము ప్రసరించుచున్నది. ఆ బ్రహ్మచారి శిరోముండనముతో, పిల్లశిఖతో, తులసిపూసల మాలలు ధరించి, విపుల కంధ్రములుగల చెవులతో, నిలువునామము పట్టెలతో, తిరుచూర్ణ రేఖతో, కౌపీనము గట్టి, నీర్కావి వేష్టువలు ధరించి పద్మాసనస్థుడై కన్నుమోడ్చి యుండుటను తలచి నపుడే ౨-౫ శాంతము స్ఫురించును నియమ నిష్ఠలతో పద్మాసనస్థుడై భగవదారాధనా తత్పరతతో, శ్రీ మదష్టాక్షరి మంత్ర చింతనా పరుడైన విప్రనారాయణుని తలచి నంతనే చదువరులకు శాంత రస స్థాయీ భావ మగు శమము గల్గును

భాగవతము నందలి పింగళాఖ్యానము విన్న దేవదేవి ౨-౮౦ ఆపింగ ళనే గురువుగ భావించి, వేశ్యాత్వముమాని ఏకాకినై శ్రీవేంకటేశ దేవాయత నాది దివ్య దేశములు సంచరించితి ౨-౮౨ నని చెప్పుట శాంతరస సమన్వితమే. మరియు తాను శ్రీమన్నారాయణ ధర్మస్థాపకత్వమె కులాచారముగను, పద్మనాభ నామ స్మరణమే జిహ్వ కభ్యాసముగను శంఖాయుధ చిహ్నములె బాహువుల కాభరణములుగను, భగవద్విలాస వైభవమె అంతరంగమున కాస్థానము గాగ, అవిరళ భుజంగ శయన సేవానురక్తి చిత్తమున పాదుకొల్పి భాగవత ముద్రతో నున్నానని ౨-౮౩ విప్రునితో చెప్పుట శాంతమునే సూచించును.

అద్భుతము :

అద్భుతరసమే అన్ని రసములకును మూలమనియు, ఇతర రసము లన్నియు నద్భుత రసము నందే యిమిడి యున్నవనియు వక్కాణించిన ఆలంకారికుడు నారాయణుడు 12 అసాధారణ వస్త్వాలోకనముచే కలుగు ఆశ్చర్య భావమే విస్మయము. 13 విస్మయమే అద్భుత రసమునకు స్థాయీ భావము ఈ అద్భుత రసాధిదేవత గంధర్వుడు 14

ఒకనాటి రాత్రివేళవ సమయమున లక్ష్మికి స్వప్నమున నల్లమేను నిల్వుతిరునామము, పచ్చని పట్టు వస్త్రము, నాభిపై తెల్లని తమ్మిగల దేవుడు ప్రత్యక్షమై నలుపు తెలుపు గల పువ్వుల దండ నిచ్చినాడట 1–69. శౌరి యిచ్చిన వైజయంత్యంశ విస్ఫురణతో సహా! ఆమె గర్భము ధరించె 1–70 నట. ఆ స్త్రీ స్వప్నము నందైనను అపూర్వార్థ సందర్శనము చేయు టయు, వెనువెంటనే గర్భమును దాల్చుటచే నామెకు చిత్త విస్తారముచే విస్మయము కలుగుట సహజము గాన నది అద్భుతరసావహ మనుట సము౦ జసము

బంగారు గిన్నె దొంగిలించినాడను చోరత్వము నాపాదించుటచే నా అవమానమును భరియించగ లేక విప్రనారాయణుడు దేహత్యాగమే మార్గమని కృతనిశ్చయుడై ఆత్మ శ్రీరంగ నాథుని భక్తితో స్మరించెను. అంత సభా సదు లెల్లరు విస్మయానందముల మునిగి తేలునట్లుగ రంగశాయి ప్రత్యక్ష మైనాడు.

సీ నిశటాక్ష శశిభాను లౌకట సహస్రనహో
కరముల శంఖ చక్రములు మెఱయు
శ్రీకాంత వక్షస్థలీ కౌస్తుభంబున
బంగారు ప్రతిమ నాఁ బ్రతిఫలి వ
ఛత్రాయమున శేష ఫణామణి ప్రభ
దినవాథ దీప్తులఁ బొసుగు పఱువ
వాయు భక్తులు మునీశ్వరులు సురలు సంస్తుతి
సరసిజమ్ముల పైని శిరసు లొగ్గ

తే. వాసవానల యమ దైత్య వరుణ వాయు
వైశ్రవణ శర్వ గీర్వాణ వధులు గొలువఁ
గరుణఁ బ్రత్యక్షమయ్యె భక్తప్రపంచాంత
రంగవాంఛాప్రదాయి శ్రీరంగశాయి 4-118

అపూర్వ సందర్శనముచే విప్రనారాయణుడు రోమాంచ కంచుకిత సర్వాంగు డైనాడు కాని నిది యొక అద్భుత రస సమన్వితమైన సందర్శనము మరియు నా దేవదేవుడు సకల జనులు కనుంగొనుచుండగా విప్రనారాయ ణుని శరీరమును ప్రవేశించెనట 4-127 అంత నా సభాసదు లందరు నాశ్చర్య ధుర్యులై, యఖిల జనులు భయ భక్తి వినయ సంభ్రమము లతో విప్రనారాయణునకు పునః పున రభివందనములు గావించిరట 4-21. ఆదినారాయణుడు విప్రనారాయణుని శరీరమున జొచ్చుట అత్యద్భుతము గాక మరేమి!

భక్తి.

భారతీయాలంకారికులు భక్తిని రసముగా పరిగణింపక ఒక భావము గనే పరిగణించిరి 15 కాని రూపగోపస్వామియు, మధుసూదన సరస్వతియు భక్తిని ఒక రసముగా ప్రతిపాదించి స్థాపింప యత్నించిరి.16

సమస్తాచార వ్యవహారములను భగవంతుని కర్పించుటయే భక్తి. ఆ దేవదేవుని మరువక మతియం దెల్లపుడు చింతించుటయే భక్తి విప్ర నారాయణుడు భాగవతోత్తముడు భగవద్భక్తియే గాక ఇతనికి భాగవత భక్తియు గలదు విప్రుడు.

తే విష్ణుపద భక్తులఁగని సేవిఁచి పుడమి
నెరఁగు మీపాద రేణువు నే నటంచు 1-74

ఈ భక్తుడు సాంగకముగా స్వాధ్యాయము పఠించి, సంధ్యాద్యను ష్ఠానములు దీర్చి, ప్రపూతాత్ముడై ప్రేల్చి, సమ్యగ్భక్తితో తోమాలికలు రంగ శాయికి సమర్పించెడివాడు 1- 9.

ఎట్టి కష్ట, క్లిష్ట పరిస్థితులందు సహితము భగవన్నామ స్మరణ మరువడు దేవదేవి తల్లి తన్ను వెడలగొట్టగా తిరిగి పూదోట ప్రవేశించి ఒంటరిగ చింతించు నపుడిట్లు తలంచును

తే లాలనముఁ జేసి మనద్మ కేళినేఁడు
కుసుమ కోమలి యెవ్వాని గూడునొక్కొ
యతఁడు తొలుజన్మమునను శ్రీహరిని బైఁడి
పుష్పములఁ బూజ చేసిన పుణ్యతముఁడు 3-117

విరహ వేదనాభరము భరింప లేక, మార్గాంతరము కానక చిట్టచివరకు ఇతడు హరినే తలంచినాడు. తన అంగము నిలువ దనియు తన్ను దేవదేవి యందు సాయుజ్య మొందిపు మని 3-130 వరమును వేడినా డీ భక్తుడు మరియు నాపద్ధర్మంబునకు హరిస్మరణంబు శరణంబని తలంచిన భక్తాగ్రేసరు డితడు

ఆ రంగ! రంగనాథ! రంగేశ! రంగేంద్ర!
రంగశాయి! యో పురాణపురుష
నీ కృపా విభూతి నీ బంటు బంటుల
పాదధూళి మీఁదఁబరఁగ జేయు 3-142

మని పలు విధముల పలు నామముల భగవంతుని కీర్తించినాడు తాను భగవంతుని బంటు బంటునని చెప్పు కొనుటయు మరువలేదు.

అవమాన భారముతో క్రుంగి పోవుచు విప్రుడు శ్రీరంగ శాయిని స్మరింపగ నా దేవదేవుడు ప్రత్యక్షమై బంగారు గిన్నె వి. యమును చెప్పినాడు పిదప నంతర్హితుడైనాడు. విప్రుడు పట్టణమున కేగి రంగధామము సన్నిధిచేరి ప్రణామం బాచరించి తిరువాయిముడి ప్రబంధ సూక్తుల వినుతించినాడు మరియు రంగేశ! యోశ్రీరంగేశ్వర! శాశ్వతశ్రుతి శిరస్సింహాసనాధీశ్వరా! అని పెక్కు రీతుల స్తుతించి, తన మనోగారార్తి న్వసియించి సంసరణ దుఃఖము నివారింపు మని వేడు కొనిన భక్తు డితడు అంత నా దేవదేవుడు పునః ప్రసన్నుడై విప్రుడు కోరిన యట్లు వరము లొసంగుటయే గాక సామీప్య పదవి నొసగినాడు.

క. వనజభవ వంశవర్ధన
ఘనమగు నీ పుష్పమాలికా కైంకర్యం
బున నీకుఁ గల్గు సంతత
మును మత్స్వామీప్య పదవి ముల్లోకములన్ 4—133.

నవ విధ భక్తి మార్గములగు సఖ్యము, శ్రవణము, దాసత్వము, వందనము, అర్చనము, సేవ, ఆత్మలోనెరుక, సంకీర్తనము, చింతనము మున్నగు వానితో సేవించినవాడు ఈ విప్రనారాయణుడు.

# వర్ణనా వైశిష్ట్యము

ఆదికావ్యమైన రామాయణము వర్ణనలతో విరాజిల్లుచున్నది తరవాతి కవులందరకును కథయందు స్థానమును కల్పించుకొని వర్ణనలు చేయుట పరిపాటి అయినది అందువలన తర్వాతి కాలములో లాక్షణికులు వర్ణనల ప్రస్తావన చేసి యున్నారు భారతీయాలంకారికులతో నష్టాదశ వర్ణనలు పేర్కొనిన వారిలో ప్రథముడు దండియే 17 ఈతడు పేర్కొనిన వర్ణనలను పదునెనిమిదిటినే విద్యానాథుడును చెప్పియున్నాడు 18 సంస్కృతాలంకారికుల మార్గము ననుసరించి అష్టాదశ వర్ణనలను ఆంధ్రవాఙ్మయమున ప్రస్తావించిన వారిలో ప్రథముడు నన్నెచోడుడే 19 ఇతని తర్వాత ఈ వర్ణనలనే విన్నకోట పెద్దనయు 20 ఆ పిమ్మట కావవి గోపరాజును21 ప్రశంసించి యున్నారు అనంతరకాలమున వర్ణనల సంఖ్య పెరిగినది అందువలననే అప్పకవి22 వర్ణనలను ప్రస్తావించి యున్నాడు.

సీ. పురమును ఋతుషట్కమును బ్రయాణంబు
శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబు
సూర్యేందూదయంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
వనవిహారంబును వారికేళి

కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోదితంబు

తే. పద్మమిత్రోదయంబును బరిణయంబు
సురతమును సౌహృదంబును సుతజననము
ననగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్ప వలయుఁ బ్రబంధంబు శ్రీనివాస 1-78

అప్పకవి, అధికముగా పేర్కొనిన నాలుగు వర్ణన లేవియనగా 1 వేట, 2. మహేంద్ర పుణ్యాశ్రమము, 3 కన్యాంగ సౌందర్య కథనము, 4 దౌహృదము వైజయంతీ విలాసము నందు అష్టాదశ వర్ణనలుగాని, ఇరువది రెండు వర్ణనలుగాని లేవు నిజమున కష్టాదశ వర్ణన లన్నియు నుండు కావ్యము లాంధ్ర సాహిత్యములోనే చాలతక్కువ ఏవో కొన్ని కొన్ని వర్ణనలు మాత్రమే ప్రబంధమున వర్ణితములు వైజయంతీ విలాసకథలో అష్టాదశ వర్ణనలకు తావులేదు యుద్ధము, ప్రయాణము వేట, మంత్రము, దూత మిత్యాది వర్ణనలు చేయుట కనువుగాదు మరియు కాలాంతరమున వర్ణనల సంఖ్య పెరుగుచు వచ్చినది. లాక్షణికులు సంఖ్య పెంచని మాట వాస్తవమే, గాని కవులు లాక్షణికులు పేర్కొనని విభిన్న వర్ణనలను గావించిరి. ఇక వైజయంతీ విలాసములోని వర్ణనలను ఆఖ్యానక్రమము ననుసరించి ఇంచుక పరికింతము

పురవర్ణనము —

శ్రీ రంగపుర వర్ణనముతో కథా ప్రారంభమైనది కవి శ్రీరంగ పురమును దీర్ఘముగ పదునైదు పద్యములలో వర్ణించినాడు శ్రీరంగము నందు అనంతశయనమూర్తిగలడు కావేరి నది ప్రవహించును. శ్రీరంగ దివ్య విమానరాజమున్నది 1-41 వైకుంఠనగరిపోలె శ్రీరంగవిమానశిఖాంత రత్న కుంభములు సూర్యద్యుతిలో నున్నవి 1-43 చంద్రపుష్కరిణి యందు పెల్లుమూక నిత్యము నీతలు పెట్టును కర్పూర గంధులైన స్త్రీలు కావేరి జలమున గ్రుంకులాడుటచే నచటి వాలము లందు పండు వడ్లు కర్పూర భోగులైన వని మనోహరముగ చమత్కరించినాడు. గమనించుడు.

తే సారె సారెకుఁ బొర కర్పూర గంధు
లాడు కావేరినీటఁ బెంపైన పైరు
పంట ధాన్యంబు లచ్చటఁ బండుఁగానఁ
బుడమిలో వడ్లు కర్పూర భోగులయ్యె 1-45

ఆ పురము నందలి భాగవతులు శ్రీచూర్ణమును కల్గియుందురు దివ్య ...ం ధాను సంధానములు చేయుదురు తులసికా మాలికలు కంఠమున అలం... రించు కొందురు బాహు మూలములందు సుదర్శన పాంచజన్య లాంఛన మైత్రి సంఘటింప జేసికొందురు 1-47 ఆ పురమునందు రాజులు భటులు గజములు, హరులు, విబుధులు కవులు రమణులు, వర్తకులు గలరు 1-48 త్రిలోకపాలకుడు, గజేంద్రరక్షకుడైన రంగవిభుడున్నాడు 1-49 కావేరినది పుర ఉభయ పార్శ్వము అందు నది '-51 అందు భూసుర పురమగు మం డగుడి యగ్రహారము గలదు 1-52 అ ఊరిలో ఇందిరాసఖుడును ...ం నాదినారాయణు డున్నాడు 1-53 నిత్య భాగవత కైంకర్యాను రక్తులైన శ్రీ వైష్ణవాగ్రేసరులు నవ శ్రీ రామానుజ మూర్తులై అప్పురమున వసింతురు 1-54 మధురాపుర వర్ణనము కలదు అది అంబోధి కాంచిరమణికి మాటిక్య ము వంటిది 1-105 వేద శాస్త్ర పురాణ పారాయణముగల భూమి అది అసా మాన్య రాజన్యులతో నొప్పును వాణిజ్య కృషి పశుత్రాణమైన ధనిక ప్రజలతో నొప్పును అగ్రజన్ములకు శుశ్రూష చేయు శూద్ర పరికరముతో పెల యు మహా నగర మది 1-107

కాంచీపుర వర్ణన మనోజ్ఞము- కాంచి సత్యవ్రత క్షేత్రము సరస్వతీ స్రవంతి వేదవతి పేరిట ప్రవహించును విరించి విష్ణుని గూర్చి యధ్వర్య మొనర్చిన ప్రదేశమది అష్టోదరుడు హవిస్సారమును రుచిచూచినదిక్కడే మోక్ష లక్ష్మీవిలాస కటితటికి నూత్న కళ్యాణకాంచి ఈ కాంచి 2-65 యని మనోజ్ఞముగ కవి వర్ణించినాడు

నది వర్ణన :-

సముద్ర వర్ణన ఈ కావ్యమునందు మృగ్యము కాని కావేరినదీ వర్ణన నీ కవిగావించినాడు కావేరి నది శ్రీరంగ పురోభయు పార్శ్వములందు ప్రవహించుచున్నది అది ఆ పురమునకు అప్రయత్నపరిఖవలె భాసించుచున్నది. అక్షయ పుణ్యాకర వారిగలది వారి నిధికి గారాపుదేవేరి ఈకావేరి, వార్ధయి కాద్రీంద్రకుమారి కుంభభవసాక్షొన్నారి ఈకావేరి 1-51 అని వర్ణించినాడు.

కుమారోదయ వర్ణన :-

శ్రీ మన్నారాయణుని పై జయంత్యంశ బ్రాహ్మణస్త్రీ గర్భమునందు ప్రవేశింపగా నామె గర్భము ధాల్చినది నవమాసములు పరిపూర్ణమైనవి ఆ పుణ్యవతి కుమార రత్నమును గాంచినది, మధుసూదనుడు మున్ను మాసములలో నేమాసము తాననెనో అమ్మాసమున ఇంద్రదార, రమాసమ యగు నా పుణ్యవతి కుమారుని కనెను 1-72

విరహ వర్ణన :-

సర్వసాధారణముగ ప్రబంధములందు నాయికా విరహ వర్ణన యుండును నాయికయే చంద్రో పాలంభన, మన్మదోపా లంభనాదులు చేయును కాని ఈ కావ్యము నందలి విశేష మేమనగా నాయకుడగు విప్రనారాయణుడే విరహ వేదనకు గురియగును మరియు నుపాలంభ నాదులు చేయును వేశ్యమాత విప్రుని పోద్రోలగా పూదోటకు వెళ్లి విరహుడగును ఆతని విరహము నాలుగైదు పద్యములందు వర్ణితము. మన్మథ తాపము తఱచు వల నెట్టిదియో 3-113 యని దుఃఖించును, దేవదేవి తలపునకు రాగానె నిద్ర పట్టదు చలిజ్వరము వచ్చును ఎవరు వచ్చి పిల్చినను గుండె జల్లుమనును మనసునకు నిలకడ లేదట 3-115 దేవదేవి మధురమగు పల్కులు, గబ్బి గుబ్బలు, నెమ్మొగము కన్నులకు కట్టినట్లయి మతిభ్రమ కలుగునట 3-116 విరహ వేదనకు గురి అయిన విప్రుడు బ్రహ్మదేవుని, అతని సృష్టిని ఉపాలంభించెను 3-121.

చంద్రోదయము :—

అరుణాంశుడు పశ్చిమాద్రిని చేరెను. సంధ్యారాగము పర్వినది తిమిరము నిండినది పిమ్మట తారాగణ ముల్లసిల్లినది రాజుదయించినాడు వెన్నెల విరిసినది చకోర పంక్తికి విందు అయినవి, 1-108 యామవతీ వైభవము దృష్టించుచు నిద్రావశత శయ్యాగారము చొచ్చురీతి రేరాజు క్రుంకినాడు 1-1 0 అని చంద్రాస్తమయ వర్ణన గలదు

సూర్యోదయము :—

తూర్పు తెల్లవారి నంతసె శుక్రుడు తోచెను తారకలు జారిపోయినవి కోడి కొక్కొరోకో యని కూసినది, శశి గ్రుంకినాడు సంధ్య కెంపు వచ్చినది వయోజ బంధుడు ఉదయాచలము నెక్కినాడు 1-111, మరి యొకచో కవి మరల సూర్యోదయమును వర్ణించినాడు ఒక జటిలమైన దీర్ఘ సంస్కృత సమాసములో భాస్కరోదయము ను 2-51 వివరించెను, తూరుపు తెల్లవారినది, శశి తోయధిని చేరినాడు. వెన్నెలలు తారలతోన జారిపోయినవి కుముదము లు మొగిడినవి. జక్కవలు గేరినవి ప్రసూన సాయకునికి పని తీరినది. చకో రములు దిగంతరములకు పారినవి. సాంధ్య రాగములు మీరగా 2-49 సూర్యు డుదయించినాడు 2-51 సూర్యాస్త మయము ను కవి మనోజ్ఞముగ వర్ణించినాడు

క పెరిఁగిన చీఁకటి తనుఁగని
సురిగి యరిగి వరుణు నగరుఁ జొచ్చినదానిన్
బొరిఁగొన వెంబడిఁ దానును
నరిగిన క్రియ నినుఁడు క్రుంకె నపరాంబుధిలోన్ 2-32.

అని చక్కని ఉపమాలంకార భాసితముగ రచించినాడు.

ఋతు వర్ణన :—

ఋతువులందు వసంత ఋతువు కడు నాహ్లాదకారి ధరణీ సురుని తోట వలరి-చుటకై మాధవుడు వసరమాధవుడై ఏతెంచెను 1-91. లేమావు లందు

వెనసుట్టిఁ గట్టుక ప్రేలఁ దొణఁగె
భువినెల్ల జనుల దప్పులు మాన్ప తక్రంబుఁ
దా దప్పి గాని నీళ్లు ద్రావఁజొచ్చె

జీ. హరుఁడు కైలాస కుధర నాథాగ్ర వసతి
విడిచి వటమూల తలమున విశ్రమించె
సతత నిజ దీర్ఘతా తనూకృతి నిశాప్ర
హరములగు నట్టి గ్రీష్మవాసరము లందు 1-97

ఎల్ల జనుల దప్పులను పోగొట్ట వలసిన మజ్జిగ తానే దప్పిగొని నీళ్లు ఎక్కువ గా త్రాగినదని చెప్పుట మనోజ్ఞభావన నానా దిక్కులు నవ ధూళితో నిండి నవి. 1-98 వేసవి యందు భూమి బాగుగా క్రాగి వేడి మంగలమువలె సెక లీనినది ప్రాడి నివహములు లాజలువలె ప్రేలి పోయినవి. ఆ సమయము నందు అనవ పాన మాచరించిన అజ్ఞమఖుల కుచకుంభ శైత్యము లొక కొందరిని కాపాడినవని 1-99 చక్కగా వర్ణించినాడు.

వేసవికాలము చాంపేయకములను విప్రనారాయణుడు పూజ చేయుట కొసంగినది నేనుకూడ విరు లొసంగుదునని తరువాతి ఋతువైన వర్షాకాలము వచ్చినది 2-141 చాతక పక్షుల పిపాసను పోద్రోలు వాడు, భూమి యనెడి స్త్రీకి గ్రీష్మతాప మనెడి జ్వరమును పోగొట్టుటకై ఔషధము నిచ్చువాడు, మయూరములతో నాట్యము చేయించు దీక్ష గలవాడు, శతపత్రమిత్రు డగు సూర్యుడు జగజ్జీవనమును తపింపచేయగ, తిరిగి మరల జీవన ప్రదానము చేయు వర్ష ఋతువు మేఘ జాలముతో నేతెంచినది 2-14 . మరియు

తే ఆనమాయుప్పులీక పోతేని యనుచు
ధరణి వంపునఁ దొలుకారు తరువుకొఁడు
నింగి గుడి వ్రాసియాఁగిన భంగినపుడు
చంద్ర కరుఁ డుండెఁ బరివేషమండలమున 2-143

ఘన గర్జాడంబరములు మ్రోయుగా ధరణీ జనము భయుభ్రాంతులై 'అర్జునః ఫల్గునః పార్థః కృష్ణ' యనిరట 2-145. ధరిత్రి పై కటపెట తొటతొట టొట టొట చినుకులు రాలినవి నొటనొట నాకట నొలుచున్న చాతకముల దైన్యము పోవునట్లుగ వార్బిందువులు రాలినవి 2-146 అంభోద ప్రకరములు కుంభ ద్రోణముగాగ ఘోరాంబుధారా కృతిని వర్షమును కురిసినవి 2-147 మరియు

క తోరములగు నవ్వర్షా
పారము అందొక్క నాఁడ వారిత ధారా
సారంబు వయోధరముల్
ఘోరంబుగఁ గురిసె ముసుఁగు కొని నిశదాఁకన్ 2-148

శరదృతు వేతెంచినది. కుందముల నలుగని యరవిందముల నరసి సేను రంగవిభు పూజకు అందములు చేయుదు నను చంధమున శరదృతువు వచ్చినది 3-7. మరియు

సీ కార్తిక చంద్ర విస్ఫూర్తి వక్త్రముతోడఁ
చంద్రికా మంధహాసంబుతోడ
హరిదంతరాచ్ఛ విస్ఫురదాంబరముతోడ
విమల కహ్లార నేత్రములతోడఁ
దారావళీ స్వచ్ఛ హారావళుల తోడ
సతుల రాజమరాళ గతులతోడ
నభ్ర విభ్రమ కళాదభ్ర మధ్యము తోడఁ
గమల కోమల పదాబ్జములతోడ

తే వితత సత్కాశ చామర వ్రతిత కోడ
సకల కవిరాజ సంస్తుత్య వికలుపైక
జీవన స్థితి నెరసె నానావనీత
లముల శారద సమయ విలాసలక్ష్మి :-78

లాక్షణికులు పేర్కొనని కొన్ని వర్ణనలు పై జంతీ విలాస కావ్యమునందు గలవు వర్ణన దృష్టితో పరికించి నపుడు వర్ణనలకు పదునెనిమిది, ఇరువది

రెండు అనెడి ఒక మితిలేదు వర్ణనీయ వస్తువునో, వేషమునో, రతాగారము నో వర్ణించిన యెడల దానిని గూడ మనము వర్ణనగా గ్రహింప నగును. అట్లు గ్రహించియే స్వామీ శ్రీ శివశంకరస్వామిగారు ఈ కవి ప్రకృతి వర్ణన ములే గాక మానవ శరీర వర్ణనలు మనోజ్ఞముగా కావించి నాడని పేర్కొనిరి ముఖ్యముగా దేవదేవిని, వేశ్యమాతను, వేశ్యరతా గారమును, దాసిని, తల వరిని వర్ణించిన పట్టులు గణనీయములు 22

ఈ కావ్యమునందు గల అట్టి వర్ణనల క్రమమిది 1 యతివర్ణన, 2 దేవదేవి వర్ణన, 3 దేవదేవి మధురవాణుల వర్ణన, 4 దాసరిస్త్రీ వర్ణన, 5 వేశ్యమాత వర్ణన, 6 వేశ్యరతాగార వర్ణన, 7 మాయా పటువు, వర్ణన, 8 దాసివర్ణన, 9 దండనాయకవర్ణన, 10 వేశ్య మంది ర వర్ణన 11 శ్రీరంగశాయి వర్ణన ఈ వర్ణనలందు కొన్ని రూపమును, మరికొన్ని గుణభావములను వర్ణించునవిగా నున్నవి

యతి వర్ణన :—

ఈయతి వర్ణనను చదివినంతనే అల్లసాని పెద్దన వర్ణించిన ఔషధసిద్ధుని23 వర్ణన జ్ఞప్తికి వచ్చుచున్నది కురుజోడి తలకు నలినాక్ష మాలికా వలయములు చుట్టుకొనినాడు సారంగ చర్మమును అంసమున పూనినాడు. కరపాలక క్షపాల దాల్చినాడు దండకుండికలు చేదోయి కుదురుగొల్పి అదు గడుగునకు నారాయణా యనుచు యతి వరుడు ఏతెంచినాడు 1-60

దేవదేవి వర్ణన :—

ఇది రూప వర్ణనకాదు, కేవలము మానసిక దృష్టి గోచరమగునట్లుగ భావించి రచించిన వర్ణన మిది దేవదేవి వలరాజు శృంగార వనములోని క్రొమ్మావి కందర్ప మాయలప్రోవి భావజుడు విటుల కిచ్చిన యీవి మదను సామ్రాజ్య సంపదల దీవి ఆమె మన్మథరాగరసపు నడబావి ఈమె జలజాస్త్రిని టెక్కెము కావి విధాత సృష్టిలో నీమె సరిజోడు లేరు. వచ్చ విలుకానిపై నలిగి దిగివచ్చిన రతీదేవి ఈ దేవదేవి 1-102. దేవదేవి మధుర

వాఁలి వర్ణన యందు రూప చిత్రణ కలదు ఇందు ప్రధానముగ వేషమునే వర్ణించినాడు కవి ఆకారము వర్ణింపబడ లేదు ముఖమజ్జనము గావించు కొని వారు నఖ రేఖతో కస్తూరి నామము దిద్దిరి శిరోజములు దువ్వి పువ్వు దండల తోడ కొప్పులు ఘటించిరి మెమ్మేనులకు తావిగంధ మల దిరి వలిపెంపు ముఱ్ఱు చలువ వస్త్రములు ధరించిరి ఆస్థాని కరుగు దెంచిరి 1-113

## దాసరి స్త్రీ వర్ణన :—

దేవదేవి తన మడుపులు విడిచి దాసరి వేషము నెట్లు ధరించినదో కవి రమణీయముగ వర్ణించి నాడు నడిముక్కు మీద సనపు నాభినామము వీనుల విచ్చుటాకు దుద్దులు, సిగ, పయ్యెద, తోమిన దంతములతో, దువ్వలువతో, కంఠపార్శ్వముల సగము కన్పించు తులసీ తామర పూసల సరుల ధరించిన దట ఆ దేవదేవి 2-54

## వేశ్యమాత •

ఇదియు రూపవర్ణనకాదు ఆమె ప్రవర్తన రీతిని మనోజ్ఞమైన భాష ములతో వర్ణించినతీరు ప్రశంస నీయము మునుపు జంగాలుగ చేయఁబడిన విటుల చూచి శునకము వలె కఱవ వచ్చునట దక్షిణలిచ్చు విటుని విటశిఖా మణి యనుచు కీర్తించునట, ధనవంతుడైన మెత్తని వానిని పుత్రిక కొప్పించు ను తన పిన్ననాఁటి సుద్దులు చెప్పును నోరు విప్పిన పచ్చి బూతేవచ్చు నా వేశ్యమాతకు 2-84

## వేశ్యరతీ గార వర్ణన —

పట్టిమంచము, పట్టు తలగడ, పఱుపు, చేదివ్వె, ప్రతిమ, గొజ్జగి నీటి గాజు కొప్పె, వట్టివేళ్ల సురటి, జవ్వాది, పునుగు, గందపొడి పెట్టె ముక్కాలిపీట, వెండినాళము, పటికపు గిండిచెంబు, పైడి బాగాలబరిణె, పంజరశుకము, మణిత శబ్దము పలంచు పారువపుజోడు రతాగారమున గలవట 3-74

వటు వర్ణన :–

పెడద నెన్నుదుటిపై తీర్చి దిద్దిన తిరుమణి, నామపు పెట్టెల నడుమ శ్రీచూర్ణరేఖ, కంఠమున తులసి పూసల పేర్లు, ఒంటెజన్నిదము, వసపు కౌపీనముతో చిన్నారి వటువేషమును ధరించినవాడు శ్రీ మన్నారాయణుడు 3-136.

దాసి వర్ణన :–

దాసి వర్ణన మీక్రింది పద్యమున వర్ణితము.

సీ గమకించు చమరి వాలములోనఁ గీలించి
యుప్పరంబుగ నోరకొప్పుదిద్ది
నాభినామంబు నెన్నుదుముఁ గస్తురిరేఖ
మోనుగాఁ బాపట మోయఁదీర్చి
తాటంక వలయు మధ్యమునఁ జెందొవపువ్వు
లవతంసముగాను హత్తుకొల్పి
మడుఁగుఁ జెంగావి పావడమీఁద వెలిపట్టు
చీరకుచ్చెలు నేల జీఱఁగట్టి

తే. మెఱుఁగుఁ దీఁగెయుఁ బెద్దముక్కఱయుఁ బెట్టి
దండ తా యెతులును సందిదండలునిచి
కేల గాజులు గాజసరాలు దొడిగి
ప్రేమఁ గై సేసి యద్దాసిఁ బెఁపుచేసి 4-30

దండనాయక వర్ణన :–

కొనముక్కుపైనుండి కనుబొమ్మలదాక నాభినామముదిర్చి, తెల్ల చెంగులబట్ట వెళ్లగట్టి, గంధమును నాభినుండి మూపులదాక పూత పూసి, నీలి కాసెచే హనుమంతుకాసె వేసికొనినాడు దండనాయకుడు 4-87

## వేశ్య మందిర వర్ణనము :—

కళ్లకు కట్టినట్లుగ కవి వర్ణించినాడు

సీ ఎఱమట్టి పూతచే మెఱుఁగారు గోడలఁ
  బై క్రింద సున్నపుఁ బట్టియలును
ద్వారబంధమున సిందూరంపు బొట్లును
  గడపపైఁ బసపు నక్షతలచాలు
భిత్తి భాగమునఁ గ్రొన్నెత్తురు జిట్టలు
  చూరుల మాంసంపుఁ దోరణములు
తీనెపై నంబికాదేవి పాత్రంబులఁ
  బూజచేసిన మద్యపూర్ణ ఘటము 4-118

కలిగి వేశ్య మందిరము విలసిల్లును శ్రీరంగశాయిని వర్ణించుట 4-1 8 సుమనోజ్ఞము పై వర్ణన లన్నియు సీసపద్యము లందే యుండుట గమనార్హము దీనికి అపవాదమేలేదు

మనోజ్ఞములగు వర్ణనలు చేయుటలో గాని కవితను రమణీయముగ రచించుటలోగాని సారంగు తమ్మయ్య కడు సమర్థుడు. ఈతని శైలీ సౌభాగ్యము కొనియాడ దగినది

)—(

# శైలి సౌభాగ్యము

లాటిను భాషలోని 'Style' అను పదము నుండి ఇంగ్లీషు భాషలోని 'Style' అను పదము యేర్పడినది లాటిను మాతృభాషగా గల ప్రాచీన రోమనులు వస్త్రములపై వ్రాయుటకు వాడిమొనగల ఇనుప ఘంటము వంటి దానిని ఉపయోగించెడివారు! దాని నా భాషలో 'Stylus' అని పిలుతురు ఈ పదము కాలాంతరమున అర్థ పరిణామముపొంది, అది వ్రాతగా, రచనారీతిగా, విశిష్టకావ్యరచనారీతిగా పరిణతిచెంది అధుని కాంగ్ల భాషలో 'Style' అనుపదము ప్రయుక్త మగుచున్నది । ఈ 'Style' పదముతో శబ్ద సామ్యము గల శైలి అను పదము తత్సమానార్థకమునందు ఆంధ్ర భాషలో నుపయోగింపబడుచున్నది 'లోకోభిన్నరుచిః' అనినట్లుగనే విభిన్న కవుల రచనలలో వైవిధ్యముగల రచనారీతి యుండును వైయక్తిక భేదము, అత్మీయతల కారణముగా భిన్న కవుల రచనా రీతిలో విభిన్నమైన శైలి భేదములు వ్యక్తమగును

శైలి అనుపదమునకు తెలుగు నిఘంటువులలో నీ యర్థమున్నది—భాషా సరణి, రచనా కౌశలము గలభాషా సౌష్ఠవము2 రచనారీతి 3 ఈ అర్థముల ననుసరించి శైలి యనగా కావ్య రచనా కౌశల సంబంధమైనదిగా సువ్యక్తము కొందరు తెలుగు కవులు 'శైలి' పదమును ప్రయోగించిరేకాని దానికి నిర్వచనము మృగ్యము కాని నేడు ఆంధ్ర విమర్శకు లందరు రచనా పటిమని, రచానా కౌశలమును మెలార్చు దానినే శైలి యనగా మన మనసులోని భావములను మరియొకరి హృదయమునకు పట్టించుటకై భావ బోధకములగు శబ్దములను గూర్చుటయే అని కవికొండల వేంకట రావుగారు తెలిపిరి 4 వావిలకొలను సుబ్బారావుగారు శైలి యనగా మాటల పొందిక, వాక్యముల కూర్పు, ఒక మానవుడు మరియొక మానవునికి తన భావమును వెల్లడించు రీతి అనిరి 5 శీలధాతు నిష్పన్నములయినవే శీలము శైలి శిల్పము పూర్వ జన్మ సంస్కార కారణముగా లభించినది శీలము ఇదియే స్వార్థమున శైలియగును, ఇహజన్మాభ్యాస కారణముగా లభించినది శిల్పము. అవగా అప్రయత్నఫలసిద్ధి శీలమూలకము. ప్రయత్న ఫలసిద్ధి శిల్పమూలక మని శ్రీ పాటిబండ మాధవశర్మగారి నిర్వచనము 6

ప్రాచీన సంస్కృతాలంకారికులు రచనా విధానమును శయ్య, రీతి పాకము, వృత్తి అని పలు అంశములుగా విభజించి చర్చించిరి. పాకమును– నారికేళ పాకమని, కదళీ పాకమని, ద్రాక్షా పాకమని ముప్విధములుగ చెప్పిరి ఈ దృష్టితో చూచినయెడల సారంగు తమ్మయ్య శైలిని ద్రాక్షాపాక మని చెప్ప నొప్పును.

శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారు శైలిని స్థూలముగా కావ్య సామాన్య సరణి, పదగుంఫన సరణి అని విభజించిరి మరల కావ్య సామాన్య సరణిని –అఖ్యానశైలి, వర్ణనాత్మక శైలిఅని ముత్తెరంగుల వింగడించిరి ఈ మూడు శైలులకు–నన్నయ తిక్కన ఎఱ్ఱనలు క్రమముగా ప్రతినిధులని ఆంధ్ర విమర్శకుల అభిప్రాయము ఈ మూడు రకముల శైలి విధానము ప్రతి కావ్యమునందు ద్యోతకమగుచున్నను నందు ఏది ప్రధానముగా గలదో దాని నాశైలి పేరనే పిలుచుట మనకు పరిపాటి అయినది ఈ దృష్టితో పరికించి నపుడు వైజయంతీ విలాసము నందలి శైలి ప్రధానముగ నాఖ్యాన శైలిగా పరిగణింపనగును.

వైజయంతీ విలాసము 'భూమికలో' వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సువారు తమ్మయ కవినిట్లు విమర్శించినారు–ఇట్టి మృదుమధుర ప్రబంధమును వ్రాసిన కవిగ్రామణితమ్మయ్య ఇందలి కవిత్వమంత సలక్ష ణమైనది కాకున్న నేమి గాని చదువువారికేమి వినువారికేమి యింకను జదువ వలయుననియు వినవలయుననియు మండక మానదు.8 అనిరి ఎమెస్కోవారి వైజయంతీ విలాస ప్రవేశికలో శ్రీ స్వామిగారు "ఇంతవరకు లభ్యమైన గ్రంథములలో సారంగు తమ్మయామాత్యుని కావ్యమే సరసమై సహృదయ హృదయాహ్లాదియై సర్వజన సమ్మోదకారియై విరాజిల్లుచున్న - దని కీర్తించిరి సాహిత్య విమర్శకులగు శ్రీ చాగంటి శేషయ్యగారు 0 శ్రీ ఆరుద్రగారు11 సారంగు తమ్మయ కవితను సంస్తుతించిరి తమ్మయ కవిత ధారాశుద్ధితో, ధ్వని గాంభీర్యముతో కొనసాగినది కవిత సరసమై, రచన సరళమై పఠితల హృదయావర్జక ము కల్గించు ననుట నిస్సంపహదేమ:

ఇక నీ కవి శైలి సౌభాగ్యమును వివిధరీతుల వింగడించి పరిశీలించు ప్రస్తుత కర్తవ్యము కవి శైలి విన్యాసమును ప్రదర్శించునవి - సమాస రచన, పదముల కూర్పు, రచనా చమత్కృతి, వ్యంగ్య విస్ఫురణ, రూప చిత్రణ, సూక్తివైచిత్రి, ఆలంకారిక రచన మున్నగునవి.

సంస్కృత రచన :

ప్రాచీన మహాకవులగు నన్నయ, తిక్కనాదులు ఆశీస్సును12, స్తుతులను13 సంస్కృతములో ఆంధ్రచ్ఛందము ననుసరించి విరచించుటగలదు తమ్మయయు ఆకవుల అడుగుజాడలలో సంచరించినాడు. శ్రీరంగధాముడు ప్రత్యక్షమైనపుడు విప్రనారాయణుడు ఆదినారాయణుని దివ్య మంగళ రూపమును సందర్శించి, తన కేలుదోయి ఫాలభాగమున కీలించి ఇట్లు స్తుతించి నమస్కరించినాడు—ఈస్తుతి సంస్కృత భాషలో నాంధ్ర చ్ఛందమగు సీస పద్యమున సంతరించినాడు ఇదియు శ్రవణసుభగమైన లాటానుప్రాస నలరారు చున్నది

సీ॥ సతతత్రయీ శిఖా చరణాయ శరణాయ
పావనాయ సురాధిప పావనాయ
హరిదశ్వ రజనీకృదక్షాయ దక్షాయ
శంకరాయ నిజాప్త శంకరాయ
సనకాది హృదయ రంజనకాయ జనకాయ
నాయకాయ గిరీశ సాయకాయ
హేలాశయన కాలసేశాయ నేశాయ
కారణాయ సహాఘ వారణాయ

తే॥ దేవ! రంగేశ! తే నమస్తే నమోస్తు
దేవ! మాం పాహి పాహి త్వమేవ శరణ
మన్య దైవం వినా త్వా మహం న వేద్మి
సర్వసాక్షీ భవాన్ సమస్త మపి వేత్తి

4-121

జటిల రచన :—

జటిలమైన శైలితో నలరారు పద్యములు నారికేళపాక మనబడును. శబ్దాడంబరముతోను, అప్రసిద్ధ పదసముదాయముతోనొప్పు ఈ పద్యములు చదువు వారికి హృదయ గమ్యములుకానేరవు. ఇట్టి పద్యముల కూర్పులో కవికిగల శబ్దాధికారము, భాషా పాండిత్యము వ్యక్తమగునేగాని విను వారికి హృద యాహ్లాదములు కాజాలవు. ఈ సంగతి తెలిసి యుండియు కవులేలకొ ఇట్టి పద్యములు రచించుట గలదు జటిల శైలిగల పద్యములు ఎడనెడ శ్వాచి త్కపుగ ప్రత్యక్షమగుచుండును సారంగు తమ్మయయు నాలుగైదు మార్లు ఈ పద్యములను కూర్చినాడు ఉదయ భానుని కిరణములవలె నా హ్లాదమును పొందింపక, మధ్యందిన మార్తాండ కిరణముల వలె హృదయా హ్లాదమును కల్గింపనిరీతి - అనగా చిరాకును కల్గించురీతిని కవి సూర్యోదయ వర్ణనను గావించినాడు రచన సరసము గాదు, సరళమును గాదు దీ౧ సంస్కృత సమాస భరితమై ముళ్లకంప వలెనున్నది

మ. స్ర. ఉదయ క్షోణీధరాభ్యాద్భ్యుషిత పిశితభుగ్వ్యోధయూథాగ్రహద్య
త్కదనక్ష్మాదీపదత్తార్ఘ జలకులిశసంఘాత పాతక్షతద్రా
జ్మదవన్మందేహ దేహక్షందురుతర రక్త ప్రభామండలీకుం
డుదయించెన్ భాస్కరుం డత్యుపరిదృఢసముద్ద్యోత శోభా
కరుండై 2—51

మరియొకచో సారంగుకవి వాన కురియుటను జటిలమైన శైలిలో వర్ణించినాడు మెరుపులతో పిడుగులతో వర్షాపాతము సంభవించురీతిని శబ్దాడంబరములతో, మహాప్రాణాక్షరయుత పదజాలముతో వివరించినాడు ఇదికొంతవరకు సందర్భోచితముగ నున్నను హృదయావర్జకము గలేదు ఆలోచనామృతమేగాని సద్యఃపరనిర్వృతి కల్గించుటలేదు

శా. అంభోదప్రకరంబు లత్తఱి సముద్యద్దీర్ఘ నిర్ఘాతసం
రంభాఘాతవిభగ్నదిఙ్నగకరోరగాగ్రకాండావలీ
దంభాంభశ్చర వాహినీకలుషపాథశ్శుంభదంభోళులై
కుంభద్రోణముగాఁగ వానఁగురిసెన్ ఘోరాంబుధారాకృతిన్. 2–147

దీర్ఘ సమాస రచన :–

ఇతర ద్రావిడ భాషలందువలె తెలుగునను దీర్ఘసమాస రచన వీలు కాదు దీర్ఘసమాస రచన చేయవలెననిన తెలుగు కవులకు సంస్కృత భాషయే అనుకూల్యము నన్నయాది ప్రాచీన కవులందరికి సంస్కృత భాషాపాటవ మెక్కువ. సంస్కృత భాషాప్రభావము తెలుగుపై మిక్కిలిగనున్నది సంస్కృత కవులకంటె తెలుగు కవులు సంస్కృత సమాసములను చక్కగా కూర్తురనుట వాస్తవమే యని విమర్శకుల భావన తెలుగు కవులందరు ఎడనెడ దీర్ఘ సంస్కృత సమాసరచనలు చేయుదురు వారికిగల సమాస రచనా చాతుర్యమును ప్రదర్శించుటకై దీర్ఘ సంస్కృత సమాస రచనగల పద్యములు రచింతురు వైజయంతీ విలాసము నందును నట్టి పద్యములు నాలుగైదు గలవు.

శ్రీరంగ విభుని వర్ణించుటకై తమ్మయ అలతి అలతి సమాసములతో నొక సీస పద్యమును విరచించి, ఎత్తుగీతిలో నొక దీర్ఘ సంస్కృత సమాస మును కూర్చినాడు

తే. చరణ నీరాజన క్రియాచరణ కలిత
నమదుమా సఖ శత మఖ ప్రముఖ దివిజ
రాజ కోటీర కోటీ విరాజితా జ
రత్న నీరాజిత విభుండు రంగవిభుండు 1-48

మరియొక చో మధురానగరమును వర్ణంచుచు నాతిదీర్ఘ సమాసముల తో సీస పద్య పాదముల నాల్గిటిని సంతరించి, ఎత్తుగీతిలో నొక దీర్ఘ సమాస మును సంఘటించినాడు

తే. నిరతసేవా గతాష్ట దిగ్ధరణి పాల
తతి నివాసార్థ భర్మ నిర్మిత నవీన
జీవ మణి సౌధ యూధశోభా విరాజ
మాన శాఖా నగర మమ్మహానగరము 1-67

మఱియు నారాయణు ధర్మపత్ని, విప్రనారాయణుని తల్లియగు లక్ష్మీ దేవిని నొక దీర్ఘ సమాసములలో 1-57 శార్దూలపద్యము నందు స్తుతించినాడు. ఇంకొకచో వసంత ఋతు వర్ణనను అక్షర రమ్యతతో నలరించినాడు మధుమాస మారుతమును ఊష్మ, కంపిత వర్ణ పునరావృత్తిచే శ్రవణానందము కల్గునట్లుగ రచించినాడు.

తే. హారిగతి సంచరించె గావేరికా వ్రి
తీరసారసకమల కల్హారముఖర
సౌరభారంభ సంభారసార వహన
మారపరివార మధుమాస మారుతములు 1–93

నాతి దీర్ఘ సంస్కృత సమాస రచన —

ఇట్టి సమాస రచన వినులకు విందు చేయును ఛందము నడక గంభీరముగ నుండును. గుక్కత్రిప్పుకొన వీలులేని దీర్ఘ సమాసములు కావివి శ్వాసవిడుచుటకు, శ్వాసతీసికొనుట కనువుగ నుండు సమాస రచన యిది పఠనానుకూలమై పాఠకులకు సహితము ఆనందప్రదమగు రచనయిది వర్షాగమమును వర్ణించుచు సీసపద్య పాదము నొక నాతి దీర్ఘ సమాసముతో రచించినాడు.

సీ. చాతకవ్రజ పిపాసా వ్యగ్రోద్యా నో
కార్య నిర్వాహకాపార్థ వపుఁడు
భూషరంధ్ర గ్రీష్మతాపజ్వర ప్రశా
శన రసౌషధ చికిత్సా విదుండు
మహనీయ భూమిభృద్గృహ విహారి [illegible]
సందోహ పటన దీక్షాగురుండు
శతపత్రమిత్రాపహృత జగజ్జీవన
ప్రత్యర్పణ క్రియా ప్రథితదాత 2–142

విప్రనారాయణుని మొర వినిన శ్రీరంగశాయి ప్రత్యక్షము కాబోవు చున్నాడు. అట్టి తరి కవి ఆ ప్రభుని ఒక సీస పద్యములో మనోజ్ఞముగ సంకీర్తించినాడు ఒక్కొక్క పాదమున ఒక్కొక్క సమాసమును రమణీయముగ రచించినాడు

సీ శరణాగతావన స్ఫురణా సముల్లస
త్కరుణా కటాక్ష కింకరశుభుండు
కమలాకుచద్వయీ విమలానులేప కుం
కుమ లాలితాంక వక్షోవిభుండు
ప్రపదానిశాన తతిప్రపదానసాధిప
ద్విపదాన వాహితాధిక విభుండు
శతకోటి రవి విభాతతికోటి హసితక్షి
తికోటి మానవాధిక ప్రభుండు 3-135

ప్రతి పాదాంతము నందును బిందు పూర్వక డకార ముండుటచే విన సొంపుగా నున్నది.

అలతి అలతి సమాస రచన :—

అచ్చ తెనుగు భాషలో నలతి యలతి సమాసములే యుండును. సంస్కృతము నందును నట్టి అలతి అలతి సమాసములు కూర్చినచో నది "అలఁతి అలఁతి తునియలఁ గాహళ సంధించిన విధమున"14 మనోహరముగ నుండును సారంగు తమ్మయ ఇట్టి అలతి అలతి సంస్కృత సమాస రచనలో నందెవేసిన చేయి, శ్రీరంగనాథుని ఒక సీసపద్య పాదములో రెండు సమాసములతో మధురముగ కీర్తించినాడు

సీ విలయ సన్న్యగ్రోధ దళశాయి శాంబరి
బాలకుండు త్రిలోక పాలకుండు
కమలా కపోల కుంకుమ పత్త్ర రచనా వి
చక్షణుండు గజేంద్ర రక్షణుండు

వివిధ షోడశ సహస్ర విలాసినీ మనో
రంజనుండు నిశాట భంజనుండు
సనకాది సంయమీశ్వర లోచన చకోర
చంద్రుండు సుధాబ్ధి మందిరుండు 1-49

ఈ పద్యము నందలి ప్రతిపాదములోని రెండవ దళమందు లాటాను ప్రాస యుండుట వలన చదువరులకు హృదయాహ్లాదకరముగనున్నది. ఇంకొకచో ఆదినారాయణ సేవాపరతంత్రుడగు నారాయణాహ్వయుడగు నొక గృహస్థుని అలతి అలతి సమాసములలో పొగడినాడు. ఈ సీసపద్యము ప్రతిపాదము నందలి రెండు దళము అందును రెండు చిన్న చిన్న సమాసములను కూర్చి ఇంపొసగించినాడు.

సీ. వేదవేదాంగాది విద్యా ప్రవీణుండు
పరతత్త్వ విజ్ఞాన పారగుండు
నిత్య భాగవ తార్చనా త్యుత్సుకస్వాంతు
డఖిల జీవ దయావశైక బుద్ధి
యతులితైకాదశీవ్రత నిత్య శీలుండు
ద్వాదశ వాసరోత్సవ విధాయి
యగణిత శమదమాది గుణ సంపన్నుండు
త్రిభువన స్తుత్య నిర్ణిద్ర యశుండు 1-56

## సమ సంస్కృతాంధ్ర రచన :—

సమ సంస్కృతాంధ్రముల మిశ్రమ రచనకు పరిపంథి పరమేశ్వర బిరుదాంచితుడగు నెల్లూరి మహాకవి పెట్టినది పేరు. ఇట్టి రచనకు ఇతని చెప్పిరమే మరియొకని చెప్పుట ఆంధ్రసాహిత్య విమర్శకుల కలవాటు. 'దేశిమార్గంబుల దేశీయములుగా'15 నన్నెచోడుడు రచింప వలయు ననినాడు. సంస్కృతాంధ్రములు సమముగా కలసిపోయి, పడుగు పేకల వలె నల్లుకొనిపోయిన నది వింతయగు సొంపును వెలార్చును

లక్ష్మి తన భర్తయగు నారాయణునితో తమకుసంతానము లేకపోవుట విచారకరమని చెప్పు సందర్భము నందలి పద్యము. సమసంస్కృతాంధ్ర రచనతో విరాజిల్లుచున్నది

తే. 'దేహి' యని చేయి చాఁచిన దేహి కిడను
మనకు భోగింపఁ దగిన జీవన మొసంగి
నందనానంద మిడఁడాయె నిందిరాధి
పతికి నపచార మేమి చేసితిమొకాని 1-65

తత్సమ పదములు అచ్చతెనుగు పదములు ఒకదాని నొకటి అల్లుకొని పోయినవి. దేవదేవి తనజీవిత వృత్తాంతమును విప్రనారాయణునితో నిట్లు చెప్పుచున్నది ఇందు తత్సమ పదములు తెలుగు పదములు చక్కగా కలసిపోయి రమణీయ మైన పద్య రాజముగా భాసిల్లుచున్నది

శా. స్వామీ! యేమని విన్నవింతు నతి కష్టంబైన నాజన్మ మీ
భూమి న్నేఁ బడిన పాట్లు శునకంబుల్ సూకరంబు ల్పహో
గా మున్ పడ్డది లేదు మీరనఁగ సాక్షాద్రంగ నాథుండు తో
డ్తో మీ ముందటఁ జెప్పినన్ దొలఁగు మద్దోషంబు నిశ్శేషమై 2-64

అచ్చతెనుగు రచన :

విభిన్న వ్యక్తులకు విభిన్న రుచులు ఇష్టమగును 'కొందఱకుఁ దెనుఁగు గుణమగుఁ గొందఱకును సంస్కృతంబు గుణమగు' నని పోతనామాత్యుడే పేర్కొనినాడు తేట తెనుగగిన సువ్విళ్లూరు వారు కొంద రుందురు ఇట్టి విభిన్న రుచులను గ్రహించియే ప్రాచీనాంధ్ర మహాకవులు తమ కావ్యము లందు అక్కడక్కడ అచ్చ తెనుగు పద్యములు రచించిరి ఆ పద్యము లెక్కువగాక అచట నచట నున్ననవి కావ్యమున కింపు నాపాదింప గలవు; ప్రయత్న పూర్వకముగ రచించు తేటతెనుగు పద్యములైనను ఎక్కువైన ఆహ్లాదకరములు కాజాలవు సంపూర్ణముగ నచ్చతెనుగులోనే రచితములైన యయాతి చరిత్రాదుల కంత ప్రాశస్త్యము రాలేదుగదా! సారంగు తమ్మయ అప్రయత్నముగ నక్కడక్కడ చక్కని అచ్చతెనుగు పద్యముల నందముగ

పొచ్చినాడు. దేవదేవి తనతో పందెము వేసిన అక్కతో స్వభావ సిద్ధముగ పల్కుటను అచ్చతెనుగులో రచించినాడు.

తే అప్పరో! నీటు నేఁ గట్టియలును నీళ్లు
యెంత వోచినఁగాని నా కెగ్గులేదు
నిన్నుఁ బని గొనఁగా నాకు నీతి కాదు
పేఱ పన్నిద మొకటి గావింపు మనిన 2-24

ఈ పద్యము నందు ఒక్క తత్సమ పదమైన లేకుండుట విశేషము పదజాలము కూడ పరిచిత మైనదే నిఘంటువులలో నిమిడి యుండు పదజాల మొకటియు గానరాదు పండిత పామర హృదయాహ్లాదకారి యగు నీపద్యము విలువ చెప్పరానిది దాసురాలి వేషముతో దేవదేవి విప్రనారాయణుని నిట్లు గాంచినది

క పొది నవ్వయు నేనను -
న్నిద మాడిన కొనమితనిఁ దెచ్చితి నిఁక నా
కొదవ పని దీఱె నిఁక నీ
కొదవయే యని ఎల్కఁ దల్లి కూఁతున కనియెన్ 3 98

పై పద్యము నందును నొక తత్సమ పదము కూడ లేదు కేవలము తెలుగు నుడుతే దాదాపు ఇట్టి పద్యములే 2-10, 2 30, 3-32, 3-83 ఇత్యాదులు

తన్మయ శైలి :

ప్రతికవి కావ్యములోను పద్యరత్నము లుండును అట్లే వైజయంతీ విలాస కావ్యమునందును పద్యరత్న ద్వయము గలదు తన్మయ సుకతా విన్యాసమునకు ఈ రెండు పద్యములు ఆణి ముత్యముల వంటివి ఇవి మృదు మధురములై చదివి నంతనె పఠితల హృదయంగమముగా నున్నవి రెండు మూడు మార్లు చదివినంతనె నోటికి వచ్చును పదింబదిగ పద్యము ను పఠ నము చేసి కొనవలయు ననిపించును. మరువరాని, మరువలేని పద్యద్వయ మిది పరమ నిష్ఠాగరిష్ఠుడైన విప్రనారాయణుడు వేశ్యాంగన యగు దేవదేవి తో నిట్లు మొరపెట్టు కొనినాడు-

ఉ. కాటులు దావిపండ్లు దిని క్రిక్క శిలామయ దేవ మందిరా
నీకములందు రావులు జనించును సజ్జన చిత్తవృత్తి య
వ్యాకులలీల జాతి గుడి వంటిది లోకములోన వేశ్యలుం
గాటుల వంటి వా రలటు గానఁ బ్రమాదము చేరనిచ్చినన్ 2-99

పై పద్యము నందు అలతి అలతి వాక్యములు నాల్గు కలవు ఉచిత సమసంస్కృతాంధ్రమై విరాజిల్లుచున్నది. చక్కని ఉపమానములతో విషయ వ్యక్తీకరణ చేసినాడు ఆ ఉపమానమును లోక జన వ్యవహారమున మున్న సంగతియే దీని కంటెను ఉత్తమమైన పద్యరాజ మింకొకటి గలదు వజ్రా యుధసమ కర్కశమైన వైష్ణిక విప్రనారాయణ హృదయము క్రమక్రమ ముగ కరిగి నీరయి నటువంటి వృత్తాంతమును హృదయంగమముగ వర్ణించి నాడు.

శా. ఆ విప్రోత్తము వజ్ర పంజర నిభంబై నిశ్చలంబైన స
ద్భావం బంగన సాహచర్య గుణ సంపర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణ వృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరఁగెఁ బోఁ బోనీళ్లకుం బల్చనై 2-189.

పై పద్యము నందు నిష్ఠా గరిష్ఠుడైన విప్రనారాయణుని సద్భావము క్రమ పరిణతితో అవరోహణ క్రమములో నెట్లు దిగజారి పోయినదో అత్యద్భు తముగ వ్యక్తీకరించినాడు. వజ్రపంజర సదృశ సద్భావ మతి కఠినమైనది దానికంటె కొంత కఠినత తక్కువైనది లోహము. లోహముకంటె తక్కువయి నది గ్రావము దీనికంటె మెత్తనైనది దృఢదారువు ఎండిన దారువు కంటె మెత్తనైనది తరుణ వృక్ష మూలము. చెట్టు కంటె మెత్తనిది ఫలము. ఫలము కంటె పూవు మెత్తనిది. దాని కంటె మకరందము మెత్తనిది. మకరందము కంటె పల్చనిది నీరు. కరగె పో బో నీళ్ల కంటె పలుచగా నని చెప్పుటలో చక్కని భావ వ్యక్తీకరణాభిలాష సువ్యక్తము. ఈ పద్యము చదివి నంతనె భావుకుడైన సహృదయ పాఠకునకు పోతన కృత మహాభాగవతము నందలి వామనావతార ఘట్టములోని వామనావతార రూపాభివర్ధన జ్ఞప్తి కి రాకపోలేదు. ఈ పద్యము నందు వామన రూపము క్రమ పరిణతితో ఆరోహణ క్రమములో

పెరిగిపోయిన వృత్తాంతము వర్ణింపబడినది. రెండు పద్యములును శార్దూల వృత్తములగుట మరియొక్క చక్కని సాదృశ్యము.

శా ఒంటింతై వటుడింతయై మఱియు దానింతై నభోవీధిపై
నంతై తోయద మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్య పదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై 8 622

కథాకథన శైలి :

తమ్మయతి ప్రధానముగా నాఖ్యాన శైలి యని చెప్పియుంటిమి. ఆఖ్యాన శైలి యనగా కథాకథన శైలి యని చెప్పనొప్పును ఇందు కథ చెప్పుటయే ప్రాధాన్యము జరిగిన కథా వృత్తాంతము నంతటిని ఒక సీస పద్యములో సంగ్రహముగా చెప్పుట కథనశైలికి నికషోపలము వంటిది. ఒలపరి కనకపాత్రముతో వేశ్య మాతను జియ్యరున కప్పగించెను అతడు ఆ గిన్నియు ఎట్లు వచ్చినదని వేశ్యమాత నడుగగా నామె జరిగిన వృత్తాంతము నిట్లు జియ్యరున కెరింగించినది

సీ. ఈ దాసరయ్య తా నేఁడాది నుండి మా
దేవదేవికి విటుఁడై వసించుఁ
దోటలో భిక్షమెత్తుచు పసాపడుచున్న
వాని నింటికిఁ దెచ్చె వలపుచేయ
నెదురు పెట్టునుగాని యెఱుఁగ మీతని వంకఁ
బడెడు బియ్యము స్వయంపాకమునకు
నెన్నఁడు విడెమైన నియ్య వటంచును
నేను మ గోపించి యిల్లు వెడలి

తే బొమ్మనిన బోయి యొకచిన్న బమ్మచారి
చేత గిన్నియ బుత్తెంచె నాత డితని
శిష్యు డనియెు బరామరిసించు డనిన
విప్రనారాయణుండు సభా వితతి కనియె 4-89

కట్టి, కొట్టి తెచ్చె అను రీతిగాగాక సంగ్రహముగా నేది చెప్పవలెనో దానిని మాత్రము సంక్షిప్తముగా చెప్పుటలో కవి కథనరీతి సువ్యక్తము. పునరుక్తి దోషము లేకుండ చెప్పినాడు.

సందర్భోచితరచన .

సందర్భోచితిని పాటించి రచించువాడే మహాకవి యగుచున్నాడు. రసాను గుణ పద ప్రయోగము కావ్య రమణీయకత కెంత దోహదము చేయునో అట్లే సందర్భోచితిని పాటించుచు పదప్రయోగము చేసిన యెడల కావ్యశోభ ఇమ్మడి, ముమ్మడి యగును ధరణీ జనము చకిత మగు నట్లు వర్షము కురిసినది వాన చినుకులు పడుచు ఒక వింతయగు శబ్దమును వెలార్చెను. ఆ శబ్దమును ధ్వన్యనుకరణ పదములతో సారంగు కవి వ్యక్త మొనర్చినాడు.

క కట పెట తొాట తొాట రాలెడు
 పొట పొట చినుకుల ధరిత్రి పొడ నట్టువడన్
 నొట నొట నాఁకట నొలుచుఁ
 దట తట పడు చాతకముల దైన్యము వాసెన్ 2-146.

వాన చినుకులు కటపెట తొాట తొాట రాలినవట. ఇట్లు రెండు ధ్వన్యను కరణ శబ్దముల నొక భావ వ్యక్తీకరణ కుపయోగించుట వైశిష్ట్యమే భావుకుడైన మానవునకు ధ్వన్యనుకరణములు పెక్కు విధముల తోచును కొందరికి వానచినుకులు పడుట 'చిటపట'లుగా నుండును మరికొందరికి 'కటపెట' గ నుండవచ్చును ఇంక కొందరికి 'తొాటతొాట'గా వినబడ వచ్చును ఈ కవికి 'కటపెట తొాటతొాట' గా వినుపించుట విశేషము పొటపొట చినుకులట, ఆ కొన్నవారు నొటనొట నొలుదురు కాటోలు వర్షముతో తటతట పడు చాతక పక్షుల దైన్యము పోయినదట.

వక్రతా విలసనము :

కావ్యమునందు వక్రోక్తి ప్రాధాన్యమును ప్రాచీన భారతీయాలంకారికులు వక్కాణించియున్నారు. పలుకులందు ప్రస్తుత భావమేగాక మరియొక

...ర్థముకూడ స్ఫురించుచున్నచో నది వక్రతా విలసన మన వచ్చును ...యలాడి యగు దేవదేవి వైష్ణవుడగు విప్రనారాయణునితో పల్కుచున్నది. వేశ్యాంగన యగుటచే దేవదేవి వగలాడి, నెఱజాణ తనముతో పలుకగల నేర్పరి ఆమె పలుకులందు వ్యంగ్య భావము ద్యోతక మగుచున్నది.

తే. బుద్ధిమతిఁ జెప్పి స్వాములు దిద్దుకొనిన
నే పనికినైన దాసురా లోపఁ గలదు
అర్థి మాఱట రంగేశుఁడైన నిన్నుఁ
గూర్చి వచ్చితిఁ గరుణ నీడేర్చు నన్ను 2-111

అనుపద్యము నందు దేవదేవి తన్ను దాసురాలిగా విప్రనారాయణుని కర్పించుకొనుచున్నది ఎటువంటి పనికైన నోప గలనన్నది. నీచమైన లేక చిన్న పనికైన పనికి వత్తునను నర్థము సామాన్యార్థము వేశ్యాంగన కావున ఏపనికైన అనుట వ్యంగ్యముగా చెప్పనయే. నిన్ను కూర్చి వచ్చితి కరుణ చూపించు మనుటలోను నట్టి వక్రతయే గలదు కూడుటకై వచ్చుటలో విశేషార్థము సర్వసాధారణముగ స్త్రీ పలుకు లందు మార్మికత, వక్రత, వ్యంగ్యము వ్యక్త మగుచుండును పైగా నీమె వారాంగన యగుటచే చెప్ప నక్కరలేదు

పిదప ఆచార్య సేవ నుగ్గడించి దేవదేవి విప్రనారాయణుని ఆచార్యునిగ భావించి సేవింప వచ్చితి ననుచు చెప్పు సందర్భము నందలి ఆమె పలుకులు వక్రభావ విలసనములే

తే. అనుచు శ్రీవైష్ణవ కథా రహస్య ధర్మ
మార్య లెన్నుటఁ జేసి యాచార్య బుద్ధి
మిమ్ము సేవింప వచ్చితి నెమ్మి వెరవఁ
గలపి పనిఁగొను మెద నఱ మఱలులేక 2-114

'పనిగొనుము ఎద నఱమఱలు లేక' అనుటలో సామాన్యార్థము-మొగ మోటమి లేకుండా పనులు చెప్పి చేయించు కొను మనియు, విశేషార్థము హృదయము నందు అరమరికలు లేక స్త్రీ సాహచర్యమును పొందు మనియు

వ్యక్త మగుచున్నది. ప్రత్యక్షముగా చెప్పక పరోక్షముగా, వక్రతతో పల్కుట స్త్రీజన సాధారణము గదా!

రచనా చమత్కారము

కావ్య రచనా చమత్కారము వలన పఠితలకు లోకోత్తరమైన ఆహ్లాదము జనించును 'చమత్కారవత్త్వం కావ్యత్వం' అను నలంకారోక్తి కలదు. రచనా చమత్కృతి పఠితల హృదయముల కానందము కల్గించుచు వారిచే 'ఓహో' యని తలయూపించును

విప్రనారాయణుడు వనమాలికాంశ సంభూతుడు పూర్వజన్మ వాసనలు మానవునికి వదల వనుట హైందవ విశ్వాసము. పూర్వజన్మ వాసనా కారణముగా వనమాలికాంశ సంజనుడైన విప్రనారాయణుడు వనమాలికలను శ్రీరంగనాథునకు సమర్పించు చున్నాడనుట చమత్కారావహము.

క. వనమాలికాంశమున సం
జననమగుట వాసనల వశమున నతనికిన్
వనమాలిక లంబుజ లో
చనునకు నర్పించు బుద్ధి జనియించుటయున్ 1-77

చోళేంద్రుని సభాగారమున నుచిత ప్రదేశమున నాసీనయై దేవదేవి వీణ వాయించినది వీణకు రెండు చివరలగల కాయలలో నొకదానిని భుజము నందును, రెండవదానిని నిజాంక వసతి యందు నుంచి వీణ వాయించు చున్నపుడు ఆ రెండుకాయల సందున గవిసెనతోడి కాయవలె నామె కుచకుంభ మున్న దని చెప్పుట కడుంగడు చమత్కారావహము.

చ సవరని వీణెఁ గైకొని భుజంబున నొండొకకాయ యున్నిజాం
క వసతి నొక్క కాయయుఁ దగం బొసఁగించిన రెంటి సందునం
గువలయ పత్త్రనేత్ర కుచ కుంభము పొల్చె ధృతోత్తరీయమై
గవిసెనతోడి కాయ గమకంబునఁ దత్సదృశోజ్జ్వలాకృతిన్ 2-117

సంభాషణాత్మకత :

శ్రవ్య కావ్యమున కథ సాగి పోవుటకు పాత్రల సంభాషణ లవసరము. సంభాషణాత్మకత వలన కావ్యము చదువు వారికి వినువారికి కథ రక్తికట్టును మరియు పాత్రలు, పాత్రల మానసిక ప్రకృతి, చిత్తవృత్తి అంగ వికార్యాభినయములు సంభాషణలలో వ్యక్తి మొనర్ప వచ్చును విప్రనారాయణుని వంచించుటకై ఏతెంచిన దేవదేవి మోడ్పుకేలితో నుదురు పుడమి సోకగ మ్రొక్కినది. అప్పుడు దేవదేవిని గాంచిన విప్రనారాయణుడు

క ఎయ్యది కుల మెయ్యది నెల
వెయ్యది నీ నామధేయ మిచ్చోటికి రా
నెయ్యది ప్రస్తుత మనినం
బొయ్యలి యా బ్రాహ్మణితో నిట్లనియెన్ 2-58

ఈవిధముగ ప్రశ్నించుటలో సంభాషణాత్మకత ద్యోతక మగుచున్నది క్రొత్తగ పరిచయమగు వ్యక్తిని అడుగ వలసిన ప్రశ్నలిట్టివే గదా! దానికి సహజాభాసముగ దేవదేవి తాను అనాథనని జాలితనముతో పల్కినది అంత నాతడు

ఆ. తల్లి తండ్రి యన్న లెవ్వరు లేక
యొంటి మింటినుండి యుట్టిపడితె
యింత యింత కాలమెం దుంటివి విరక్తి
కిని నిమిత్త మేమి యొనరఁ జెపుమ 2-61

అని ప్రశ్నించుట స్వభావసిద్ధముగ నున్నది. దేవదేవికి నా వేశ్యాంగన తన విరక్తికి కారణములు చెప్పి వేశ్యావృత్తిపై తన మనసు రోసినదని చెప్పి వృత్తాంతమంతయు వరుసగా సంభాషణలతో సాగిపోయినది. వరుసగా మూడు కంద పద్యములలో కవి దేవదేవి పల్కులను సంభాషణాత్మకతతో విరాజిల్ల చేసినాడు. గ్రంథవిస్తర భీతిచే నొక యుదాహరణము మాత్రమీయబడినది.

క. నా మనసు రోసి విడిగిన
దీమెయి నీ మనసురోయ కేవిడిగిన దిం
దేమిటికి శంకపడ ధా
త్రీమండలిఁ బాలుపిడిగితే పెరుఁగగునే 2–102.

నాటకీయత :

నాటకీయతకు, సంభాషణాత్మకతకు నిశిత దృష్టితో పరికించి నపుడు కొంత భేదము తోపక పోదు సన్నివేశ కల్పనలు నాటకీయములు గానున్న పాత్రలు పరితలకు మనోగోచరము లగుచుండును. దేవదేవి తన అక్కతో ఉద్యానవన విహారము చేయుచు పుష్పవాటిలో నున్న విప్రనారాయణుని గాంచినది అ విప్రుని వేషధారణను వివరించుచు చెప్పిన సన్నివేశము నాటకమున రంగము-రంగమునకు మధ్య తెరచీర మాయుటయు తెరచుటను జ్ఞప్తికి దెచ్చును. తెర తెరచిన తర్వాత రంగస్థలముపై నిష్ఠతో నున్న విప్రనారాయణుడు మానసిక దృగ్గోచర మగును చూడుడు.

సీ. ప్రతిమాస వపన ముండితమైన మస్తంబు
పెడతలఁ దూలాడు పిల్లసిగయుఁ
దులసి నెత్తమ్మి పూసల గొప్పపేరులు
విపుల రంధ్రములైన వ్రేలుఁ జెవులు
నడువీధిఁగల నిల్వు నామంబు పట్టెలు
శోభితంబగు తిరుచూర్ణరేఖ
పెన్నాలిత్రాటఁ గీల్కొన్న కౌపీనంబు
వితతంపు నీర్కావి వేష్టువలును

తే. గలిగి పద్మాసనస్థుఁడై కన్నుమోడ్చి
భగవదారాధనైక తత్పరత నున్న
శ్రీమదష్టాక్షరీ మంత్ర చింతనా ప
రాయణుండైన విప్రనారాయణుండు 2–5.

వేశ్యమాత దాసరయ్యను ప్రశ్నించినరీతి గడుంగడు నాటకీయముగ నున్నది దృశ్యకావ్యము నందలి పాటకు తనువైన పద్యము వలె భాసించు చున్నది మరియు ప్రతి పాదాంతము నందలి 'ఔనె' 'ఔనె' అను ప్రశ్నార్థకములు మరింత నాటకీయముగ నున్నవి.

సీ. నీ పట్టితిరుమణి నిటలచూర్ణంబు
గణికకు వెండి బంగారు లౌనె
నీ పుట్టగోచియు నీ కావి వేష్టువ
ల్వారకాంతకుఁ బట్టుచీర లౌనె
నీ ముష్టిగూడయు నీ తులసి సరులు
వేశ్యకుఁ బండుగు పేఁటలౌనె
నీ వేదశాస్త్రము లిన్ని సంధ్య జపమును
లంజె సానికిఁ బంజులగము లౌనె

తే. పెట్ట నోపితివా యెప్పటట్టె యుండు
పెట్ట లేకున్న విచ్చేయు పెందలకడ
మొదల రోయింతులకు నొక్క ముడుపెగాక
నీ సదాచారమేలయ్య దాసరయ్య 3–103

ప్రతిపాదాదిని 'నీ' 'నీ' అని యుండుటయు నాటకీయమె ఇట్టి పద్యములే నాటకమున "once more" అని ప్రేక్షకులచే కోరబడును.

రూపచిత్రణ :

చిత్రకారుడు తాను సందర్శించిన దానినో భావుకతతో నూహించి దానినో కుంచెతో మనోహరముగ కాగితముపై చిత్రించి చూపరుల కాశ్చర్యానందములు కల్గించును: అట్లే సుకవి యగువాడు వర్ణనీయ వస్తువునుగాని, వ్యక్తుల రూపములను గాని వర్ణించునపుడు శబ్దములతో మనోజ్ఞముగ రూపచిత్రణ గావించిన యెడల నవి పఠితల హృదయ ఫలకముపై శాశ్వతముగ చెరిగిపోని ముద్ర వేయును సారంగు తమ్మయకవి ఈ కావ్యమున నట్టి రమణీయ రూప చిత్రణలు పెక్కు గావించి యున్నాడు. అందు ప్రధానముగా పేర్కొనన

దగినవి-యతి రూపవర్ణన 1-60, శ్రీ రంగనాధుని రూపచిత్రిణ 3-136, తల వరి వేషధారణ 4-67, పురుషులకు సంబంధించినవి మరియు స్త్రీలకు సంబం ధించినవి దాసరి స్త్రీ వేషధారణ 2-54, వేశ్యమాత చెలికత్తెయగు కావేరి 4-30 వర్ణన గలవు గ్రంధ విస్తర భీతిచే రెండుదాహరణములు మాత్రిమే ఈ దిగువ నీయ బడినవి యతి వర్ణన మరువరానిది, మనోజ్ఞ మైనది

సీ మహనీయ నలనాక్ష మాలికా వలయంబు
 కురుబోడి తలఁ జుట్టుకొవ నమర్చి
శ్రవణాక్షి ఖురశృంగ సహితమై కపా్పరు
 సారంగ చర్మ మంసమునఁ బూని
పృథుల సాలగ్రామ పీఠి సహితమైన
 కకపాల కక్షభాగమునఁ దాల్చి
కాషాయ కౌపీన కలిత మస్కర దండ
 కుండికల్ చేదోయిఁ గుదురుకొల్పి

తే యడు గడుగునకు నారాయణాః యటంచు
నరుగుదెంచెఁ దదీయ గేహంబునకును
మాధుకరవృత్తి తనుయాత్ర మహిఁ జరించు
యతివరుం డొక్కరుండు మధ్యాహ్న వేళ 1-60

దేవదేవి వేశ్యా సహజమైన వస్త్రధారణ తొలగించి దాసరి స్త్రీ వేషధారణ గావించుటను కవి దాసరి దానిని కన్నులకు కట్టినట్లుగ హత్తుకొనిపోవునట్లుగ వర్ణించినాడు

సీ నడిముక్కుమీఁద సన్నపు నాభినామంబు
 నడుమ మంజిడి కావి నిడుదరేక
యలఁతి వీనుల విచ్చుటాకుల దుద్దులు
 సిగవేసి ముడిచిన చిన్ని తుఱుముఁ
జనుదోయి నిఱియఁగట్టిన చుట్టుపయ్యెద
 క్రొత్త దోమిన దంత కోరకములు

త్రికముపై నెగఁగట్టు దిగఁగట్టు దువ్వల్వ
నేలపైఁ జీరాడు ప్రేలుఁగచ్చ

తే. కంఠపార్శ్వంబున సగంబు కానిపించు
తులసి తామర పూసల వలుద సరులు
పూని నిక్కంపు దాసరి సాని వోలె
విప్రనారాయణారామ వీధిఁ జొచ్చె 2-24

**భావ చిత్రణ :**

రూపచిత్రణ కళకన్న, భావచిత్రణ కళమిన్న. రూపచిత్రణ బాహిరమైన వర్ణనకాగా భావచిత్రణ అంతరమైన వర్ణన యగుచున్నది బాహిర సౌందర్య వర్ణనము కన్న ఆంతర సౌందర్య వర్ణనము హృదయమును వెన్నను వలె కరిగించును మానవ మానసిక ప్రవృత్తిని, చిత్తవృత్తిని వివరించుట ఒక చక్కని కళ దాసరి దానిపై మోహాంధుడైన విప్రనారాయణుడు దాసరి దానికే సేవలుచేయ నారంభించినాడు దాసరి దాని వీడి నిముసమైన జీవింపలేని స్థితికి దిగజారినాడు ఆ బ్రహ్మచారి, ఆ వగలాడి తానింటికి పోయి తన తల్లిని చూచి మరునాడు వచ్చెదనని చెప్పినది ఆమెలేక అతడెట్లు ఒకనాడుండగలడు ఆ వార్త విన్నంతనే ఆ భూసురుని చిత్తమిట్లు పల్లటిల్లినది

తే. జల్లనియె గుండె ధాతువుల్పల్లటిల్లె
మొగము పసచెడె దేహంబు బిగువు సడలె
స్వాంతము కలంగెఁ జేకాళ్ళ శైత్యమొదవె
నొడలు చెమరించె మఱుమాట వెడలదయ్యె 3-57

అంగ వికారముల నత్యంత సహజముగ వర్ణించినాడు మరుని మాయలకు, బాణములకు చిక్కిన మానవుని చిత్తమేరీతికుండునో, ధృతి చెడిపోవునో, గుండె ఎట్లు జల్లుమనునో, స్వభావ సిద్ధముగ వివరించినాడు ఇట్టి చిత్త ప్రవృత్తి సర్వ మానవులకు దేశకాల భేదము లేక కలుగునదియే

చ తలఁచిన నిద్రరాదు చలిదార్కొను మోసలఁ జేర నెవ్వనిం
బిలిచిన గుండె జల్లుమను బేర్చు మనః పరితాప వేదన
ల్నిలిచిన చోట నిల్వ ధృతి నెక్కొన దక్కట! రంగ రంగ! తా
వలచిన యింతిఁ బాయు వగవద్దు సుమీ ఎగవానికేనియున్ 3-115

సూక్తి వైచిత్రి

నానారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు. నన్నెచోడుడు మృదూక్తి సూక్తులిం పొదవింప 18 కావ్యరచన చేయవలయుననినాడు శ్రీనాథ భట్టసుకవి ప్రబంధ పరమేశ్వరుని సూక్తి వైచిత్రినికొనియాడినాడు మహా కవులందరును సూక్తులను స్తుతించి యున్నారు కావ్యము సదుపదేశము చేయకపోయినను దురుపదేశప్రదము కారాదు కావ్యములు ఉపదేశప్రద ములు కూడనైనచో పూవునకు తావి అబ్బినట్లే సరసమైన సూక్తులు సార్వ జనీనములుగ నుండును సూక్తులు ధర్మము, సత్యము, దానము, న్యాయము, దయ, నీతి మున్నగువానికి సంబంధించినవిగా నుండును. జీవిత సత్యమును, సత్ప్రవర్తన కల్గియుండుటకు, సన్మార్గమున నడిపించు నవిగా సూక్తులుండును. ఈ కావ్యమునందు పెక్కు సూక్తులు గలవు. దం పతులకు పుత్ర జననము లేనిచే పున్నామ నరకమున బడుదురను విశ్వాసము హైందవులది ఎంత సంపద యున్నను పుత్రుడు లేనిచే రాణించదట గొప్రా లైన ఒక బ్రాహ్మణ వధూటి భర్తతో నిట్లు పల్కినది

తే దానధర్మము లెన్ని చందములఁ బైనఁ
దగనొనర్చినఁ గల్గునే సుగతి జగతి
సారలౌకిక వైదికాచార నియమ
కలన గల పుత్రతిలకంబు వలనఁగాక 1-64

'బుద్ధిః కర్మానుసారిణీ' అనుట మన సంప్రదాయము, నమ్మకము, పూర్వ జన్మ కారణముగా శుభాశుభకర్మలు దేహికి జరుగును. అందులకతడు దైవ మును దూఱుట వలదుట

౦ తోరణము లేక చెందవు
ధారుణి నాపదలు సంపదలు నిందులకై
యారట పడి సర్వేశ్వరు
యూఱట కోరుటయు వలదు తోయజ నయనా -67

'మాతృదేవోభవ', 'పితృదేవోభవ' అనిన దేశమిది. అంతేకాదు 'గురుర్దేవో భవ' అని కీర్తించిన ప్రజలు మనమే 'గురుస్సాక్షాత్ పరబ్రహ్మతస్మై శ్రీ గురవే నమః' అని గురువును పరబ్రహ్మతో సమానునిగా సంకీర్తించినారు గురుసేవ చేయు ప్రజలకు ఇతర సేవలక్కర లేదట. గురుసేవ చేయని ప్రజలకు ఇతర దేవతీర్థ సంసేవల వలన ప్రయోజనము లేదని ఎంత మనోజ్ఞముగ చెప్పినాడో పరికించుడు.

తే అనిశ మాచార్యసేవ గల్గిన జనులకు
దేవభూదేవ తీర్థ సంసేవ లేల?
అనిశ మాచార్య సేవ కల్గని జనులకు
దేవభూదేవ తీర్థ సంసేవలేల? 2-113

కల్గిన, కల్గని అను రెండు పదములు తప్ప తక్కినదంతయు సరి సమానమే ఇంపొదవించు సూక్తి ఇది

భగవత్సేవకన్న భాగవత సేవ మిన్నయను విశ్వాసము మన హైందవపు అది ఈ విషయమునెంత రమణీయముగ చెప్పినాడో పరిశీలించుడు —

క ఓ సతి భగవత్సేవకు
వాసి గణింపంగ భాగవత సేవయు త
ద్దాసుల కైంకర్యముఁ గృపఁ
జేసిన రంగేశ్వరునకుఁ సేయుటె సుమ్మీ 3 23

మనుస్మృతి, ధర్మశాస్త్రములు ఈ జాతికి జీవగఱ్ఱలు, ఏవి, ఎట్టివి శుచిత్వ పదములో పరికించుడు —

క. అవుల వెన్కయు, ధరణీ
దేవుల పాదములు యతుల దృక్కులు కవి వా
చావృత్తి వహ్ని వాజి
స్త్రీ వదనంబులు కడున్ శుచిత్వ సంపదల్ 3-40

పైన పేర్కొనినవన్నియు కాలమునుబట్టి కొన్ని మారినను ఆవుల వెనుకను శుచిత్వ సంపదగా నేటికిని భావించువారున్నారు ఎట్టిదానికి నుచ్ఛిష్టత్వ మంటదో ఇట్లు కవి పేర్కొనుచున్నాడు గమనించుడు —

క. మృగయా విహార వేళల
మృగదంశక వక్త్రములును, మీనాంకాజిన్
మగువల వదనంబులు శుచు
లగునుచ్ఛిష్టత్వమంట దవ్వని వట్లన్ 3-42.

పైరెండు విషయములలో ఎంగిలి లేదట, ఎటువంటి వానివలన సుఖము చేకూరదో బాగుగ చెప్పినాడు.

క నల్లిగలశయ్య్య నిద్రయుఁ
జిల్లిగల ఘటంబునందుఁ జేర్చిననీరున్
దల్లిగల వేశ్యఁ దగిలిన
పల్లవు సుఖములును బోధిపల్లవ సఖముల్ 3-123

ప్రారబ్ధ కర్మమును పరిహరింపలేము అనుభవింపక తప్ప దార్యులకు అగు నది కానిమ్మని ఊరకుండుటలెస్స విజ్ఞుడైన వా డిట్లు తలంచును.

తే దైవ యత్నములేక చెందవు శుభాశు
భములు దైవంబుఁ బరిహరింపంగరాదు
కానఁ బ్రారబ్ధ కర్మంబు దీనికేమి
కొంచ కైనట్టు గానిమ్మటంచుఁ జనియె 4-49

పైన పేర్కొనిన సూక్తున్నిలయు చక్కని కందపద్యము అందును, తేటగీతు లందు నాలా పింపబడుట గమనార్హము, చిన్నచిన్న సూక్తులను సూటిగ, సంగ్రహముగ చెప్పుట కా కంద, గీతులే శరణ్యములు సంస్కృతోక్తులను కూడ కొన్నిటిని సందర్భానుసారముగ తెనుగు పద్యములలో ననుకరించి నాడు 'బ్రాహ్మణో నహంతవ్య' యనిన వాక్యము ౬-౪౪ 'కాముకస్య కుతో లజ్జా' యనుమాట ౩-౭౬, 'ధనమూల మిదంజగత్' అను దాని ఆంధ్రీకరణము ధనమూలము జగమంతయు ౩-౧౨౦ మున్నగునవి కొన్ని ఎడనెడగలవు

కళాపరిచయము :

కేవలము కవికి ప్రతిభయున్న చాలదు లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణము వలన సంక్రమించు వ్యుత్పత్తియు నవసరమే కవిత్వ కళతోపాటు మిగిలిన సంగీత, నాట్య, శిల్ప కళలందుకూడ పరిచయమున్న యెడల నతని కవిత్వ ము ఒక సమాహారకళగా రూపొందును సారంగు వానికి వీణవాయించుట యందును, తాళవిషయమునను, నృత్యకళయందును కొంత పరిచయము, పరిజ్ఞానమున్నటు లీక్రింది పద్యముల ననుసరించి మనము భావింప వచ్చు ను చోళేంద్రుని సభారంగము నందు దేవదేవి వీణ ఎట్లు వాయించినది కవి ఇట్లు వర్ణించుటను బట్టి అతనికి గల పరిచయము సువ్యక్తము

సీ. శ్రవణ సంకుమదంబు సంధించి మునివ్రేల
మృదురీతిఁ బైతీఁగె మెఱుఁగుసేయు
శ్రుతులు విజ్ఞేయమైన చోఁ దంత్రి బిగువుగాఁ
బీడించు గిటగిట బిరుడఁదివ్వ
గోట మూనంబుగాఁ బాట లోపలఁ గేలఁ
జిటిపెట తాలంబు ఘటననడుపుఁ
గరఁగించు నప్పటప్పటికిని గద్దపై
గెంటసంబైన క్రీఁగంటి చూపు

తే. బొసఁగి నిజహస్తములను నింపొలయఁ జిత్ర
భంగి వినుపించు గీతప్రబంధ తతులు

చేతనాచేతనములు సంప్రీతిఁ గరఁగఁ
జంచరీక్షణ వీణె వాయించు నపుడు 1-118

వాయిద్య కారుల వాయిద్యముల ప్రసక్తిచేయుచు వారు వినిపించిన వ్రధాన తాళ విషయములను పేర్కొనినాడు.

చ అరుదుగ వాద్య విద్య బిరుదందిన వాయిద కారులత్తతిన్
గరములు రెండు నొక్క సరిగా మురజంబులు మొట్టి దిమ్ముగ
న్నొరయఁగఁ జేసి కాంస్య రవముల్సెలఁగ న్నియతావధానులై
సరి వినిపించి రుక్తగతి జంపె ధ్రువాద్యట ముఖ్యతాళముల్ 1-123

దేవదేవి 'కాంస్యాళవ మురజ ముఖాతాళ భావాను వృత్తి' తో ఆ సభలో నర్తించినది దేవదేవి లాస్యము నీ క్రింది విధముగా సారంగు తమ్మయ వివరించినాడు.

సీ నాగస్వరంబు గానము భుజంగియుఁబోలె
గీతమంగళము నంగీకరించి
హస్తవిన్యాసప్రశస్త విభ్రమముల
వయు మొప్ప నర్థాభినయము జూపి
వివిధ వీక్షణ విలాస విచిత్ర నటనల
బాటించి భావంబు తేటపఱచి
చరణ నూపుర ఝుణంఝుణ నినాదంబులఁ
దాళ మానము దీపితంబు చేసి

తే లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు
కోపు కోపున దొరలెల్ల దోఁపులొసఁగ
నాయకుఁడు బాపురే! బాపురే! యటంచుఁ
గట్నములు పైఁడికోర బాగాలు నంప 1-129

కరణమైన సారంగు తమ్మయ్య కుతుబ్‌షాహి ఆస్థానములోనో లేక తన మందిర ప్రాంగణములోనో నాట్యాదులు తిలకించి యుండును గావ నావిషయమును వరితల హృదయములకు హత్తుకొనిపోవునట్లు వివరించినాడు.

అనౌచిత్యము :

కావ్యమునందు ఔచిత్య మాదరించుటను పరమధర్మముగా పరిగణింప దగును. అనౌచిత్యము నొక కావ్యదోషముగా సాహిత్య విమర్శకులు పేర్కొనిరి క్షేమేంద్రాదులు ఔచిత్య విచార చర్చ విపులముగా గావించియున్నారు నిత్య జీవితములోను మనము సభ్యతను, ఔచిత్యము ను పాటించియే ప్రవర్తించుచున్నాము క్రీడాభిరామ శృంగార... ఆ జయంతీ విలాస కావ్యములో రెండు మూడు చోట్ల ఔచిత్యమో, సభ్యతయో కొరవడినదని చెప్పవచ్చును దేవదేవి ఎంత వేశ్య స్త్రీయే అయినను స్త్రీ సహజమైన అవధులు దాటి ప్రవర్తించుట అసభ్యముగా నున్నది

క క్రొన్నన విల్తుఁడు నా కను
సన్నల వర్తిల్లు సురతసామ్రాజ్య గతిం
గన్నె తీకంబుల వలపుల
మన్నె తీకంబెటిఁగి విటుల మహినేఁగొందున్ 2-70

అని దేవదేవి విప్రనారాయణునితో పల్కుట అనౌచిత్యమే —
దేవదేవి దాసరయ్య పూదోటలో నివసించుచున్నపుడు ఆమె

ఆ చెఱఁగు మాసినపుడు మఱఁగున మున్నాళ్ళు
నొదిఁగియుండి నాలవ దివసమున
నారులు వోయునట్టి యుదకంబునను దీర్థ
మాడి పిదపఁ దీర్థమాడు నదిని 2-1౯౩

అని కవి చెప్పవలసిన అవసరము లేదు ఈ విషయము చెప్ప నక్కరలేదు గదా! ఈ చెప్పుటలో ప్రయోజన మేమాత్రములేదు ఇది అసభ్యము పరమ నిష్ఠాగరిష్ఠుడైన తొండరడిప్పొడి అంటటివాడు వారిజలోచన నింటిలోనికి పిల్చి చెంతకు చేరిన మీద కుక్కుటము సేయు నుపాయము చేయుట మేలని ౩-౩ తలంచుటయు నసభ్యముగా నున్నది. అంతియేకాదు భక్తాంఘ్రి రేణువు త్రిభువనకు మలపుమని దేవదేవిని కోరగా నామె పల్కిన పల్కులు స్త్రీ జన

సామాన్యముగా లేవు. ఎంత ప్రౌఢమైన వేశ్య యయినను నిట్లు పర పురుషునితో పల్కుట అనౌచిత్యమే.

క దీపము మన్మథరాగో
ద్దీపము లక్ష్మీకరముమదికి భయహరమౌ
దీపము లేని రతు ల్వ్రా
లోపము లవి చీఁకటింటిలో పెకిరింతల్ 3-26

దీపము లేని రతులు సుఖలోపములని, దీపము రతిసమయమున నుండవలెనని ఏ స్త్రీ అయినను చెప్పగలదా? చెప్పిన నది అసభ్యముగ లేదా? మరియు నింతకంటెను అసభ్యముగ, ఏవహ్యముగ పల్కినది చూడుడు పడకటింటి రహస్యములు వేశ్యస్త్రీ కూడ చెప్పగలుగునా? ఈ పద్యము గమనించుడు —

క. ఆడెడు కొమ్మ పదంబులఁ
బాడెడు కలకంఠమోము భావజుకేళిం
గూడెడు సకియుల చోటుల్
చూడక రహిపుట్ట దంద్రడు సుగుణుల మతికిన్ 3-28

పైగా సుగుణుల మదికి భావజుకేళియందు స్త్రీల చోటులు అనగా మర్మావయవములు చూడక ఆనందము గల్గదని ఒక స్త్రీ పర పురుషునితో చెప్పుట అనౌచిత్యము కాదా? ఇట్టిదే మరియొకటి 3-35

సాదృశ్య రచన .

పూర్వకవుల రచనలను పఠించునపుడందలి భావములో, ఎత్తుగడయో, రచనారీతియో, పదములకూర్పో ఆకర్షించినపుడు కొన్నిమారులు తెలిసియు, మరికొన్నిమార్లు తెలియకయు అనుకరించుట జరుగును. అట్టి సాదృశ్య రచన చేయుటకు కారణము తత్పూర్వకవులపై వారి రచనలపై నున్న గౌరవాభిమానములే గారణములుగాని అన్యథా భావించరాదు అది గ్రంథచౌర్యముగా తలంపరాదు సారంగు తమ్మయ్య రచనలో నచ్చటచ్చట సాదృశ్య రచనలు కనబడుచున్నవి.

నన్నయ–తమ్మయ :

ఆదికవియగు నన్నయ సభాపర్వము లో మహామునుల నామములన్ని టిని అక్షరరమ్యతను పాటించి ఒక సీసములో మూసపోసినాడు 20 పిదప ఎఱ్ఱన మహాకవి కూడ హరివంశపు టుత్తర భాగములో కృష్ణ సందర్శనార్థ మేతెంచిన మునిగణమును మనోజ్ఞముగ నొక సీస పద్యమున సమకూర్చి నాడు 21 పేరుల నిట్లు శబ్దాడంబరముతో కూర్చు నలవాటు తరువాత చాల మంది కవులకు వరిపాటి అయిపోయినది సారంగు కవియు పై మహా కవుల వలెనే వారసతుల నామముల నొక సీసపద్యములోనే పంతరించినాడు. ఎత్తుగీతిలో పట్టి కూర్పు ఇతనిలో లేదు —

సీ కలహంసి కర్పూరకలిక పద్మావతి
మందారవల్లరి మధురవాణి
సౌందర్యలహరి పుష్పసుగంధి చిత్రాంగి
కాంచనమాలిక కనకలేఖ
రాజమోహిని కుమారసరస్వతి సుశీల
మదనాభిరామ మన్మధకటారి
మంజుభాషిణి భామమతి రమాతిలకంబు
కామమంజరి చంద్రకళ యనంగ 2-67

వారసతులు అపార శృంగార వతులుందురట- పై నామములు కొన్నియైనను కవి కల్పితముల వలె కనబడుచున్నవి పేరులకూర్పు విన నింపుగానున్నది

నన్నెచోడుడు–తమ్మయ :

ఆంధ్ర సాహిత్యములో వేశ్యావృత్తిని, వేశ్యల ప్రవృత్తిని విపులముగా వర్ణించిన ప్రథమకవి కవిరాజ శిఖామణి నన్నెచోడుడే వేశ్యావర్ణనను సుదీర్ఘ ముగా గావించినాడు ఈ అడుగు జాడలలోనే సారంగు తమ్మయ్యయు పయనించినాడు. నిజమునకు అంత దీర్ఘముగ చేయవలసిన అవసరము

తమ్మయకుగాని ఆ కధకుగాని లేదు అయినను లోకజ్ఞానము మెండుగా గల తమ్మయ్య వేశ్యల జీవన విధానమును నిశితముగ పరిశీలించినవాని వలెనే దీర్ఘముగ, వివరముగ చెప్పినాడు.

వారకాంతకు నియమము, వలపునున్న, సందర్భానుసారముగ ప్రవర్తించుపట: విటులకు భ్రమకల్గించుపట

ఉ ఒక్కని పిల్వనంపి మఱియొక్కనిచేతc బసండిబట్టి వే
ఱొక్కని యింటికేcగుచు మఱొక్కని నానడు చక్కినొక్కచోc
బొక్కిలి దార్చి కూడు భ్రమcబొంది విటు ల్దెలియంగలేరుగా
కెక్కడి సత్యమేడ వలపెక్కడి నేమము వారకాంతకున్ 2-77

ఈ పద్యభావమును ఇంతకు మునుపే నన్నెచోడుడు విపులముగ కొన్నిపద్యములలో చెప్పినాడు ఈపద్యమును చదివి నంతనే అవి జ్ఞాపకమునకు రాక మానవు 22 మరియొక పద్యమున తమ్మయ వేశ్యల ప్రవృత్తిని చక్కగ చిత్రించినాడు ఈపద్యమును పోలిన సాదృశ్యరచన నన్నెచోడునిలో కూడగలదు 23 నన్నెచోడుని కావ్యమును తమ్మయ చదివి యుండు నని పించుచున్నది, లేకపోయిన యెడల సాదృశ్యరచనకు కారణము వేశ్యాప్రవృత్తికావచ్చును.

చ తలనిలువర్థ మిచ్చినను దాము కులస్థులుకాని హీనులన్
విలువ మటన్న నేమములు భేషజముల్ వెలయాండ్రుపిల్తురే
కులజుల నైన మున్ను తమకుం బ్రియకృతంబుగ నిచ్చునట్టిరో
వెల కధికంబు నొక్క యరవీసము కాసును జేతి కిచ్చినన్ 2-28

భాస్కరుడు-సారంగు తమ్మయ :

వర్ణనీయ వస్తువును గాంచినపుడు అ పద్యారంభమును ఒక సమాపక క్రియలో ప్రారంభించి దీర్ఘసమాసములో నా వస్తువును వర్ణించు సంప్రదాయము లేక అలవాటునకు ఆద్యుడు హుళక్కి భాస్కరుడే ఈ భాస్కరుడు అరణ్యకాండ

ములో నట్టివద్యము24 నొక చానిని రంచించి ఆంధ్రసాహిత్యములో నట్టిరచ నకు మార్గదర్శకప్రాయుడైనాడు తరువాత నిట్టిరచన చాలమంది కవులు గావించినారు. ఎఱ్ఱన హరివంశములోని,25 నాచన సోమన ఉత్తరహరివంశ ములోను,26 అల్లసాని పెద్దన మనుచరిత్రలోను27 రచించినారు సారంగు తమ్మయ ఇట్టి పద్యములను రెండిటిని రచించినాడు అందొకటి

తే. కాంచి రయ్యంతు లంబోధి కాంచిరమణి
కొవ్వు మాణిక్యమను కోల్కి నొప్పుదాని
దంభదైతేయ కుంభిమర్దన కవర్ద
మండలీఖండ విధు సుధా మధుర మధుర 1–106

పైనపేర్కొనిన కవు లెవరును ఆట గీతులలో వర్ణింపలేదు-వృత్తములనే వారు గైకొని దీర్ఘ సంస్కృత సమాసములో శబ్దాడంబరముతో వర్ణించిరి పై పద్యముతో తమ్మయ తృప్తిచెందక మరి యొకచో వారకాంతలు చోళేం ద్రుని గాంచుటను మత్తేభ విక్రీడితములో దీర్ఘ సమాసములో శబ్దాడంబరము తోనే వర్ణించుటను గమనించుడు

మ. విధు బింబాస్యలు కాంచి యున్నత చల త్ర్వీచీసముద్యద్విలా
సధురాంచల్లవజేక్షుసారమదిరాసర్పిర్దధిక్షీర నీ
రధునీశానచిరత్నరశనారాజత్కటిస్ఫార వి
శ్వధరారక్షణ దక్షదక్షిణభుజవ్యాశేంద్రుఁ జోళేంద్రునిన్ 1–115

జీవన విధానము

కవి ఎంత జాగరూకత వహించినను సమకాలమునాటి సాంఘిక జీవన ము, స్నాన పానాదులు, పండుగ పబ్బాలు, ఆచారవ్యవహారములు అతని కావ్యములో ప్రవేశించును కథ ఎంత పౌరాణికమైనను, పాత్రలు ఎంత అలౌకికములైనను సమాజ పరిస్థితు లాకావ్యమునందు ప్రతిబింబించును వైజయంతీ విలాస కావ్యము నందు ను ఆనాటి సంప్రదాయాములు కొన్నికలవు

నాటివప్రజలు ముప్పూటలు భోజనము చేసెడి వారని తెలియును-తన యింటికేఁగి ముమ్మాఱు భుజింప 2-1'2 నటదేవదేవి విప్రనారాయణుడు కూరలు, అన్నము, తిరువట్యారము, పప్పళ్ల నావధూటికి ముప్పూటలు వసా వడ పెట్టునట 2-131 చెఱఁగు మాసినస్త్రీ మూడునాళ్లు ఒదిగియుండి నాలవ దినమున ఇతరులు పోయునట్టి తీర్థముతో స్నానమాడి పిదప నదియందు తీర్థమాడునట 2-2? విప్రనారాయణుడు దేవదేవి కిట్లు స్నానము చేయించి అలంకరించునట

సీ దినముఁ జన్నీళ్లు మజ్జనమాడఁ జలిదాఁకు
నీకంచు వేన్నీళ్లు నెమ్మిఁగాఁచు
బుధవార శనివారములు మీరుపోకుండ
శిరసంటు వెప్పఁగాచేసి నూనెఁ
జమురు పట్టించి యంగములు మర్దనచేయు
మేదించు మేనిపై మినుపపిండి
తల నిమ్మపడ్లుఁజొచ్చిలఁ బిండి సీకాయఁ
బులిమి తైలపు జిడ్డుపోవ దువ్వ

తే జలకమాడించు మడుఁగు వల్వలు ధరింపఁ
జేయు శిరసార్పుఁగ్రొమ్ముడి వేయు విరుల
సడులు పై"జుట్టి తిరుమణి చాఁదుకొనిన
దాఁక నిలుచుండు నెదుట నద్దంబుపూని 4-61

ఉరుములతో మెఱపులతో వాన ఎడునపుడు ప్రజలు భయకంపితులై 'అర్జునః ఫల్గునః పార్థ' యనెడి 2-1'5 వారట ఇప్పటివారు కృష్ణని తలచుటలేదు సద్బ్రాహ్మణుడు చెడిపోయి నట్లయిన బాంధవులు అపాంక్తేయునిగా నిల్లు చేరనీయరట 3-5 దేవునిపై అనలు 4-39 పెట్టెడివారు మరియు అక్క శోడు, అప్పకు తప్పదుపుసుమీ 4-41 అను అనలు నున్నవి. ఇంటినుండి ఎయటకు పోవునపుడు అక్కడనున్న వస్తువులను దాచెడివారు చేదను, బొక్కిని పొదలోపెట్టి కుడలు లోతురీళ్లలో దాచెడివారు 3-63. కవాటము మూసి, వెల్పుఎ నొక త్రాటగట్టి, తాళముపెట్టి, తోటవాకిలికి గడెబిగించి

బయట బలుకంపె నాటితీవారు 3-68. వేశ్యవాటిక యందు విటుల షంధెము లిట్లుండెడివి

సీ కచ్చించి సోగటాలు గడికలతోఁ గుక్కు
టాండము ల్పణముగా నాడువారు
ద్రివిణముపై పన్నిదములొడ్డి మాత్సర్య
గతిఁ గోడిపందెముల్ గట్టువారు
పైచిత్రిగాఁ గోలఁగాచి పన్నిదమాడి
చెఱకు మోపులులీల నఱుకువారు
గుఱిచూపి యటకేఁగి పఱతెంచు నందాఁక
నొసఁగిన భక్ష్యముల్ మెసఁగువారు

తే నాఢ్యులై గోత్రశాలల నధివసించి
విటుల వేశ్యాజనముల చక్కటులు దీర్చువారట 3-69

లక్ష్మీదేవి పండుగను నాటి ప్రజలిట్లు జరుపుకొనెడివారు

సీ ప్రచురమై యొకచోటఁ బాటీర కర్పూర
కస్తూరి కాదుల కమ్మతావి
దండిగా నొకచోటఁ బిండివంటల వెంటఁ
బ్రభవించు తైలాజ్య పరిమళములు
రహి నొకచోటఁ గూరల తాళింపోఁతల
తోరంపు సంభార సౌరభములు
రమణ నొక్కొక్కచో నురభ్రాదిమాంసముల్
కమలించు మాంసంపు గములకములు 3-80

క్రమ్ముకొనగ లక్ష్మీదేవి పండుగ ఏతెంచినదట. ఇట్లు నాటి ప్రజల జీవన విధానమును వ్యక్తీకరించుటలో కవికి గల లౌకిక పరిచయము నిశిత పరిశీలనా దృష్టి సువ్యక్తము. ఈ పరిశీలనలో కవి ఆత్మీయత కొంత వ్యక్తమగును

అలంకారిక రచన :

సౌందర్యాపాదకములైన యలంకారములు కావ్యశోభ నినుమడింప చేయును భాషా వ్యవహారములో అక్షరాస్యులేమి, నిరక్షరాస్యులేమి అలంకారములు తెలియకే ప్రయోగింతురు అలంకారములు ప్రధానముగా రెండు విధములు—శబ్దాలంకారములు—అర్థాలంకారములు శబ్దాలంకారములు శ్రవణ సుభగములు కాగా అర్థాలంకారములు హృదయాహ్లాదకారులు శబ్దాలంకారములలో నెక్కువ ప్రశస్తి పొందినది వృత్త్యనుప్రాస.

వృత్త్యనుప్రాస :

హల్లులు పద్యమునందు పునరావృత్తము లైనచో నది వృత్త్యనుప్రాసాలంకారము ఔర ఒకే హల్లు పెక్కుమార్లు అక్కడక్కడ పునరావృతమైనచో నది వీనుల విందొనర్చును.

క లోల సమీర కిశోరక
లాల న విహృతి క్రియాచలాచలదీప
జ్వాలిక పోలిక నిలిచెన్
బాలిక నృత్యాదిం దత్ప్ర భాగారమునన్ 1-126

ఈ పద్యమునందు 'ల' కారము పదిపర్యాయములు పునరావృత మగుటచే విన సొంపుగా నున్నది. మరియొక పద్యమును చూడుడు.

మాలిని దశరథసుతలదీపా తధ్యవధ్యానులాపా
విశదగుణకలాపా వేదవేద్యస్వరూపా
యశరణగణగోపా హవ్యవాహప్రతాపా
సశర శరధిచాపా సాగరోత్పన్నకోపా 1-36

వృత్త్యనుప్రాసాలంకార శోభితమగు నీ పద్యమునందు 'ర' 'ధ' లు, శసలు, 'పా' మున్నగునవి పునరుక్తము లగుటచే వీనులకు విందైనది.

లాటానుప్రాసము

వర్ణ సముదాయములు రెండుగాని, అంతకంటె నెక్కువగాని పునరా వృతములగుచు భిన్నార్థకములై యుండును 29

ఉదా, ఆరామ లారామ ఎక్కి ప్రియాళులగు పిరియాళులు, నవంధ్ర సౌగంధ్య వాసిత సమీరణంబులగు సమీరణంబులు, ననవరత మధువ్రత సంకీర్తన జేలనారంగింబులగు నారంగంబులను, నవనీతల సురసాలంబు లగు రసాలంబులును, నతివృధుల ఫలాపహసిత వనితాలికుచంబులగు లికు చంబులను, నమృతమయూఖశేఖర స్వీకృతమాలంబులగు తమాలంబులును, నార్యాశిరోధార్యమాణ నవమాలికలగు నవమాలికలును, నంగనాజన కర్ణ పూరంబులగు కర్ణపూరంబులను, నాత్మీయకుసుమ మాలికావికాసోపమాన మేరువులగు నమేరువులును, నళినపప్రసూనదామవ్యాహితయువతులంబు లగు వకులంబులును 2-2 మరియొక యుదాహరణ — ఇందొక వాక్యము నందే లాటానుప్రాస గలదు 'కొమ్మా! యీలోకు లెంచుకొమ్మా దీనిన్ 2-97 తెలుగు పదముల తోడి మరియొక చక్కని లాటానుప్రాసయుతమగు ఆట వెలదిని ఆలకించుడు —

ఆ  తెలుప నేను నీయు తెలివలుండఁగఁ గాక
   చొరవ గొనుచు నిల్లు చొరవశంబె
   ఎలవఁ బొమ్మటంచు నెలవఁదే నాకు నీ
   యెలవఁ దొఁకిగోసి యెలప జేలు  3-87

మరియు లాటానుప్రాసము 2-152, 3-140 పద్యము లందున్నది

చేకానుప్రాసము :

అలంకారము నందు హల్లుల జంటలు అవ్యవ హితముగ పునరావృతి మగును 30 ఈ కావ్యమున చేకానుప్రాసాలంకారము ఒక పద్యము నందే కలదు ఆ ఉన్న ఆలంకారము మనోజ్ఞమైనది లాటానుప్రాసయందు వలె నిండుమ పదములు లేక వ్యంజనాక్షరముల జంటలు భిన్నార్థ బోధకములుగ నుండవచ్చును

ఉదా.

సీ రమణీయ తేజోవిరాజులు రాజులు
పటు పరాక్రమసముద్భటులు భటులు
నిజ బలాధరితదిగ్గజములు గజములు
హరిణవేగజితార్కహరులు హరులు
వివిధక్రతుప్రీతివిబుధులు విబుధులు
కవితాభినుత మరుత్కవులు కవులు
రతిరాజకంఠహారమణులు రమణులు
వరధర్మవర్తకుల్ వర్తకులును 148

పైసీసపద్య ప్రతి పాదాంతము నందును ఛేకానుప్రాసగలదు.

శబ్దాలంకారము లన్నిటిలోను యమకము అధిక చమత్కారావహమైనది. ఒక పదముగాని అనేకార్థములుగల అక్షరములుగాని స్థాననియమముతో పునరావృత మగుటయే యమకాలంకారమున ప్రాధాన్యము 31 స్థాన నియమము నాల్గువిధములు 1 పాదము 2 ఒకపాదములోగాని అనేక పాదములలోగాని ఆదిభాగము, 3 మధ్యభాగము, 4 అంత్యభాగము వైజయంతీ విలాసములోని పాదాది భాగయమకమున కుదాహరణ.

క మాసంబులలోపల నే
మాసము దాననియె మున్ను మధుసూదనుఁ డ
మ్మానమున నింద్రదార ర
మాసమ యుష్పుణ్యవతి కుమారుం గనియెన్ 172

రెండు పాదములలో మాత్రమే పాదాది భాగ యమకమైన కుదాహరణముగా నీ క్రింది దానిని గైకొన వచ్చును

శా స్మారభ్రాంతి మదంబు లేదితని రెంచన్ ధాత్రిఁ గాఁగా నవ
స్మారభ్రాంతి మదాత్ముఁడంచుఁ బలికె న్నమ్యగ్వచోవైఖరిన్ 225

ఇట్టివే మరిరెం డుదాహరణములు గలవు.

ప్రద్యుమ్నుం డైనవాఁడే
ప్రద్యుమ్నుండు జగతి వారభామల కెందున్ 2-80

క. లోపలఁ బరికించిన నీ
లోపల సద్భుజులు వారఘోషాతతికిన్ 2-82

పై నాడు పద్యములందును పాదాంత భాగయమకము పద్యముల రెండవ
పరముగానే యున్నవి

వదలిన పదమునే తిరిగి మరల గ్రహించుటయే ముక్తపదగ్రస్తము
ఇదియొక పద్యమధ్యభాగ యమక భేదకముగా పరిగణింపదగును. ఇది
పాదాంత పాదాది ముక్తపదగ్రస్త మనియు సింహావలోకన ముక్తపదగ్రస్త
మనియు ద్వివిధముగా నుండును ౩౨ ఈ కవి ఆశ్వాసాంత పద్యములందే
ముక్తపదగ్రస్తాలంకారములను కూర్చినాడు పాదమధ్యముక్తపదగ్రస్తాలంకా
రమును గమనించుడు

చ. తరణికులీన! లీనవసుధాసురనందన జీవమారుతో
ద్ధరణధురీణ! రీణసురధామపునః పరిపూరణోదితా
పరిమితపుణ్య! పుణ్యజనభంజన' భంజనబద్ధకంకణ
స్ఫురితభుజాగ్ర! జాగ్రదవబోధసుఖామృతసింధుబాంధవా 1-134

మరియొక పాదమధ్యముక్తపదగ్రస్తము

శా. కల్యాణైకనిదాన! దానవజనఘ్నత్రాసవత్కర్మతా
చ్ఛల్యర్క్షేంద్రవితాన' తానవయుత! శ్రీపద్మజ! పోషితా
హల్యాశాపనదీన! దీనజనరక్షాశాహరోద్భాతతా
సల్యాగర్భనిధాన' దానవహరా! సౌరన్వాయగ్రామణీ 3-138.

చతుర్థాశ్వాసాంత పద్యమును ముక్తపదగ్రస్తాలంకార భాసితముగ రచించి
కావ్యమును ముగించుట విశేషము.

## ఉపమాలంకారము :

ఉపమ సర్వాలంకార బీజభూతమైనది ఉపమాలంకారములు భాషా వ్యవహారములో పండితులకేగాక పామరులకును దొరలు చుండును. ఉపమలేని కావ్యము ప్రపంచ సాహిత్యములోనే లేదనుట సత్యదూరముగాదు– ఉపమానమునకు ఉపమేయమునకును ఒకే వాక్యమున వైధర్మములేని సాదృశ్యమును చెప్పిన నది ఉపమాలంకార మన దగును 33 ఒక చక్కని ఉపమాలంకార యుత పద్యమును పరికించుడు.

తే. ధాత్రి దినరాజు విడిచి పాతాళమునకు
జనుచు వేలంబు వెలుఁగఁ జేసినవెలుంగు
చాయ నెఱసంజ యొప్పెఁ దదీయ ధూమ
పటలమునుబోలెఁ జిమ్మ చీఁకటులుమించె 2–37.

వెలుగుచాయవలె నెఱసంజ, తదీయ ధూమమువలె చిమ్మచీఁకటులు మించివి. ఈ క్రింది పద్యమునందు శ్లేషానుప్రాణిత ఉపమాలంకారము కలదు.

క. అతఁడుఁ బ్రహ్లాద సమ
న్వితంబై కువలయంబు విలసిల్లె నవ
ద్యోత సతాపటలుండై
శీతాంశుఁడు పొడిచె నారసింహుఁడుపోలెన్ 2–42

ప్రహ్లాద, కువలయ శబ్దములకు శ్లేషను కూర్చినాడు–ప్రహ్లాదుడు, మిక్కిలి హ్లాదముగలవాడని మొదట పదమున కర్థము రెండవ పదమునకు భూమి, కలువ యను నర్థములు గలవు ఈ క్రింది పద్యమునందు రెండు చక్కని ఉపమాలంకారములు గలవు

తే. దితిజ రక్తారుణ నృసింహ దివ్యమూర్తిఁ
బోలి యొప్పారెఁ బొడుపుఁ గెంపున విధుండు
తద్విశాలాంక తలదైత్య తనువుపోలె
లాంఛనంబొప్పె నమ్మండలంబునందు 2–43

రాక్షసరాజైన హిరణ్యకశిపుని సంహరించిన నృసింహమూర్తివలె ఎఱ్ఱగ చంద్రుడున్నాడు నృసింహమూర్తి అంకతలము నందలి దైత్యునివలె చంద్రుని మధ్యలో మచ్చ ఉన్నది. సారంగు తమ్మయ్య రెండు మూడు మనోజ్ఞమైన మాలోపములను కూర్చినాడు

సీ. సౌత్త్వికత్వము పురుషత వహించినరీతి
వినయంబు మూర్తిభవించినట్లు
కరుణ మనుష్య విగ్రహము దాల్చిన పోల్కి
జ్ఞానంబు సాకారమైన పగిది
సత్యంబు పురుషవేషము ధరించినలీల
శాల్మి శరీర వంతమగుభాతి
శాంతంబు మానవ జన్మమెత్తిన జాడ
హరిభక్తితనువొంది నట్టిసరణి 1-76

విప్రనారాయణుడు వెలయును మరియొక్క మధురమైన మాలోపమ—

సీ. ధనము కొప్పెరదండఁ జెనుభూత మున్నట్లు
గంగదరి మొసలిగాచినట్లు
రసకూపమున నంటిరాళ్లు గలయట్లు
మొగిలిపువ్వన ముండ్లు మొలచినట్లు
అమృతకుంభము నగ్ని యావరించినయట్లు
శ్రీగంధమునఁ బాము చేరినట్లు
తేనెతెట్టెకుఁ జుట్లురా నీఁగలున్నట్లు 3 125

అవనివేశ్యలపేరి శ్రేయస్సులకు వేశ్యమాత లున్నారట.

రూపకాలంకారము :

ఉపమానోపమేయములకు నభేదము చేతగాని తాద్రూప్యము చేతగాని ంజనము చేయుటయే రూపకాలంకార మనబడును 34

క. వటు మానస సుక్షేత్రము౯
గుటిలాలక చేష్టితముల గుద్దలిఁగొని యి
ట్టటు పాదుచేసి మోహపు
వటబీజము మొలఁతు నాటి వర్ధిలఁ జేసెన్ 2–186.

పై పద్యము నందు మానసమానెడి సుక్షేత్రము, చేష్టితము అనెడి గుద్దలి, మోహమనెడి వటబీజము అని కూడు రూపకము లున్నవి ఈక్రింది సీసపద్యము నాలుగు పాదములలో నాల్గు రూపకములు కలవు. విప్రనారాయణుని ఆత్మ యనెడి భూమి యందలి గ్రీష్మము సంతాపనోదనముగ మేఘములు వర్షించినవట.

సీ. రభటిల్లు దివ్యదుందుభి నినాదంబులు
గంబీర గర్జా విజృంభణముగ
నటియించు నప్సరః కుటిలాలకావళీ
ప్రచుర విద్యుల్లయ నిచయముగను
ప్రసరించు దేవతావిసర రత్నవిభూష
లమరేంద్రచాప విభ్రమములుగను
వడిరాలు పూఁదేనె జడివాన సోనలు
ధారాళధారాంబు పూరముగను

తే. విప్రనారాయణాత్మ భూమి ప్రవృద్ధ
వేదనాగ్రీష్మ సంతాపనోదనముగ
మెలఁగు నంబర చరులను మేఘతతులు
గురిసె నప్పుడు మందార కుసుమవృష్టి 4–119

ఉల్లేఖము :

ఒక వస్తువును అనేకు లనేక విధముల చెప్పినను ఒకడే ఒకవస్తువు ననేక విధముల నుల్లేఖించి చెప్పినను నది ఉల్లేఖమగును.35 దేవదేవి విప్రనారాయణుని చూచి తనఅక్కతో నితడేమైన శుకుడో, హనుమంతుడో, భీష్ముడో అని అనేక విధముల పేర్కొనినది గాన నది ఉల్లేఖమగును.

చ పరికింప జితేంద్రియుల్ ధరఁ బరాశర కౌశిక లంతవారు స్త్రీ
లకు వశు లంతకంటె మిగులం దృఢమై మగకచ్చ బిగ్గఁగ
ట్టుకొనంగ నీఁతడెంత శుకుఁడో హనుమంతుడో భీష్ముడో పినా
యకుడో తలంచుమా సరసిజాయతలోచన నెమ్మనంబునన్ 2-16

ఉత్ప్రేక్షాలంకారము

విషయియిందున్న ధర్మములు విషయము నందుండుటచేత విషయియొక్క తాదాత్మ్యమును విషయమునకు చెప్పుట ఉత్ప్రేక్ష యగును

తే పాటలాది సుగంధ పుష్ప ప్రకరము
లామని సృజించె శ్రీరంగధామమునను
హేమ పుష్పంబు లలరింతు నే నటంచు
వచ్చెనో యన వేసవి వచ్చెనంత 196

మరియొక చక్కని ఉత్ప్రేక్షాలంకారమును పరికించుడు

క, శ్రీరంగవిభుని సేవకు
సౌరాంగన లవనిఁ బుట్టినటు లైరో నా
మారాంగ బలమువై తగు
వారాంగనలుండు రంగవసతి ససంఖ్యల్ 1-101

ఉత్ప్రేక్షాలంకార రచనలో కవికిగల భావనా శక్తి సువ్యక్తము.

క ఏణాయతలోచన స
త్ప్రాణాయతచిత్రగాత్రి పాంచాలికయై
వాణియ యీరూపోయన
వీణియ వాయించె నొగిఁ ప్రవీణత మెఱయన్ 1-119

సారాలంకారము :

ఒకదానికంటె మరియొకటి శ్రేష్ఠమని చెప్పుట. ఉత్తరోత్తరము బలీయమగునట్లుగ వర్ణించుట సారాలంకారము 37 తమ్మయ ఒక సీసపద్యము మూడు నాలుగు పాదములలో సారాలంకారమును కూర్చినాడు

సీ అట్టి బ్రాహ్మణులందు హరిభక్తులు త్రిలోక
　　　పావనులు హరిభక్తులందు
వైష్ణవులు ఘనులు శ్రీవైష్ణవ జనులందు
　　　విజితేంద్రియుండు శ్రీవిష్ణుమూర్తి 2-60

యథాసంఖ్యాలంకారము :

క్రమముచే క్రమికానమన్వయముస్మ్ఁచెప్పిన యెడల నది యథా సంఖ్యాలంకారము.38 దీనినే మనవారు కొందరు క్రమాలంకారమనియు పేర్కొనుట గలదు ఈ క్రింది సీసపద్యము మొదటి దళమున మూడు చెప్పి వానికి క్రమముగా మరిమూడిటిని రెండవ దళమున సమన్వయము చేయుచు సీసపద్యము నాల్గుపాదముల సంతరించినాడు

సీ అరియు శీతాంశుసోదరియును నజుఁడను
　　　వాలు నిల్లాలుఁ దొల్వాలు నగుచు
హరుఁడు నండజకులేశ్వరుఁడు సాగరుఁడును
　　　దేహంబు వాహంబు గేహమగుచు
నరుఁడు కంసక్షమావరుఁడును మరుఁడును
　　　మిత్రుండు శత్రుండు పుత్త్రుఁడగుచు
హేమంబు శిఖిపింఛదామంబు నామంబుఁ
　　　బొంబట్టుఁ దలచుట్టు బొట్టునగుచు

తే గౌస్తుభమణివరంబు, గంగాఝరంబుఁ
గెంపు పతకంబుఁ బాదంపు సొంపునగుచు
వెలయు నేదేవుఁ డాదేవు నిలిపెనాత్మ
రంగనాథుఁ త్రిలోకాంత రంగనాథు 4-1'6

ఏత్తు గీతిలో మాత్రము మొదటి పాదములో రెండు విషయములు చెప్పి రెండవ పాదమునందలి రెండు విషయములకు క్రమముగ సమన్వయము గావించినాడు

జాతీయాదులు :

వైజయంతీ విలాసము సరళమైన శైలిలో సుబోధక మగునట్లు రచిత మైనను నిందు జాతీయములు, లోకోక్తులు చాల తక్కువగ ప్రయుక్తములైనవి. ఆ యున్న కొద్ది జాతీయాదులు సందర్భోచితములై కావ్యమునకు శోభ నాపాదించుచున్నవి. ఈ కావ్యము నందలి జాతీయములు, లోకోక్తులు, నానుడులు మున్నగునవి అశ్వాసముల క్రమములో నీ దిగువ నీయబడినవి

| | | |
|---|---|---|
| 1 | కన్నుల పండువ | 1-2 |
| 2 | ఎండవడి శాంతమగుదాఁక | 1-133 |
| 3 | ఏటికి బ్రొక్కితిమమ్మ యుక్కుటా నెక్కొని పెట్టిబుద్ధిమెయి నిద్దురవోయిన వాని కాళ్ళకున్ | 2-10 |
| 4 | ఇంతింతన వచ్చునే యితని వైరాగ్యంబు | 2-14 |
| 5 | ఘోటక బ్రహ్మచర్యంబు | 2-18 |
| 6 | పింగళా జపంబు | 2-13 |
| 7 | పిల్లి శీలము | 2-18 |
| 8 | అజగరోపవాసము | 2-19 |
| 9 | బక ధ్యానంబు | 2-19 |
| 10 | నక్క వినయము | 2-19 |
| 11 | గుమ్మడి కాయయునుబోలె కూర్చున్నతనిన్ | 2-56 |
| 12 | నే వడిన పొట్టు శునకంబుల్ సూకరంబు ల్పహా మున్ బడ్డది రేదు | 2-64 |
| 13 | సహించునె కక్కినకూడు క్రమ్మఱన్ | 2-100 |
| 14 | గంతలకుఁ దగిన బొంతలు లేవే | 2-101 |
| 15 | రంధ్రి మూరయుచు నుండె | 2-133 |
| 16 | గాఱఁద్రావిన మీను సంగతి | 2-140 |
| 17 | టుక్కటము సేయు నుపాయము | 3-3 |
| 18 | చల్లకు వచ్చి ముంత దాచనేల | ?-7 |
| 19 | ఏనుగులకుఁ గొమ్ములు వచ్చిన యట్టులు | 3- 9 |
| 20 | నొసలు ఎత్తుఁడును నోరు తోడే లటన్నరీతి | 3-18 |

ఇట్లు రమణీయమగు రచన గావించిన సుకవి సారంగు తమ్మయ శైలి కొనియాడ దగినదని సహృదయ పాఠకులకు తప్పక అనిపించును ఈ కవి ఛందో వ్యాకరణవిన్యాసము లాక్షణికమై అలరారు చున్నది

)—(

# ఛందో వ్యాకరణ విన్యాసము

సారంగు తమ్మయకృత వైజయంతీ విలాసమునందు నాలుగాశ్వాసములు గలవు విప్రనారాయణుడు వైజయంతీ మాలాంశ సంభూతుడగుటచే కాబోలు కవి కావ్యమును ఉత్పలమాలతో నారంభించి మాలాసాదృశ్యమును వ్యక్తమొనరించినాడు తెలుగు కావ్యములనన్నిటివలెనే ఈ కావ్యము శ్రీకారముతో ప్రారంభింపబడినది మిగిలిన అశ్వాసాది పద్యములన్నియు నితర కావ్యములవలె కందపద్యముతో నలరారుచున్నవి. మరియు నాకంద పద్యములన్నియు శ్రీకారముతో మొదలగుచుండుట విశేషాంశము. అనగా కావ్యమేగాక ఆశ్వాసములన్నియు శ్రీకారముతో నారంభమగుచున్నవి నాలుగాశ్వాసాంతములందును ఆశ్వాసాంత పద్యములు వృత్తము, కందము, విశేష వృత్తముతో ముగియుచున్నవి —

ప్రథమాశ్వాసాంతమున - చంపకమాల - కందము - మాలిని

ద్వితీయాశ్వాసాంతమున- శార్దూలము - కందము - మాలిని

తృతీయాశ్వాసాంతమున- శార్దూలము - కంగము - మాలిని

చతుర్థాశ్వాసాంతమున - ఉత్పలమాల- కందము - సుగంధి

వైజయంతీమాల మనసున మెలగుచున్నదో ఏమో తమ్మయ మెదటి మూడాశ్వాసాంతమునందలి చివరి పద్యము లను మాలిని వృత్తములుగా కూర్చినాడు నాల్గవ ఆశ్వాసాంత పద్యమును సుగంది వృత్తముగా సంత రించి ఒక సామ్యమును ప్రదర్శించినాడు తెలుగు కావ్యరచనా సంప్రదా యమువలె భాసించుచున్న రీతిననుసరించి ఆశ్వాసాంతపద్యములు పంద్రెం డింటిని సంస్కృత సమాస భరితముగ కూర్చినాడు

వావిళ్ళ రామస్వామివారిచే ప్రకటితమైన వైజయంతీ విలాసమునందు 588 పద్య గద్యములున్నవి ఈ కావ్యమునందలి పద్యగద్యముల సంఖ్య ఈ దిగువనీయబడిన పట్టికలో ప్రదర్శితము.

| | ఉ | చ | శా | మ | సీ | ం | ఆ | తే | వ | వి వృ | | మొ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప్ర ఆ. | 12 | 8 | 7 | 7 | 31 | 33 | 1 | ౪ | 26 | 2 | = | 136 |
| ద్వి ఆ. | 14 | 7 | 8 | 6 | 19 | 35 | 10 | 24 | 27 | 2 | = | 152 |
| తృ ఆ. | 11 | 6 | 3 | 2 | 20 | 41 | 9 | 18 | 29 | 1 | = | 140 |
| చ ఆ | 9 | 5 | 3 | 3 | 10 | 47 | 6 | 21 | 32 | 1 | = | 140 |
| | 46 | 26 | 21 | 18 | 80 | 156 | 26 | 75 | 114 | 6 | = | 568 |

## ఛందో విన్యాసము :

పై పట్టికను గమనించినవారికి 117 సంస్కృత వృత్తములు గలవని తెలియును. మరియు 337 దేశీయములైన కంద సీసపద్యాదులు గలవని ఎఱుగనగును ఈ కావ్యమునందు 114 వచనములుండుట గమనార్హము. దాదాపు కావ్యమునందు ఐదవ వంతుగ వచనములుండుట విశేషమని చెప్ప నగును సంస్కృత వృత్తములును ఐదవ వంతునే ఆక్రమించుకొన్నవి. మిగిలిన దాదాపు మూడువంతులు 337 దేశీయమైన ఛందములే

వై జయంతీ విలాసమునందు సంస్కృత వృత్తములలో(117) ఉత్పల మాలలకే (46) ప్రాధాన్యము చంపకమాలలు ద్వితీయస్థానము (26) నాక్రమించుచున్నవి

నన్నయాది ప్రాచీన మహాకవులు తమ గ్రంథములందు సీసపద్య రచనలో ఎత్తుగీతినే ఎక్కువగ వాడినారు - ఆటవెలది పద్యములు ఎడనెడ మాత్రమే ఉపయోగించిరి కాని ఈ కావ్యమునందలి 80 సీస పద్యము లందును నొక ఆటవెలదిని కూడ వాడక 80 పద్యాయములు తేటగీతినే ఉప యోగించుట నొక విశేషముగా పేర్కొననగును

ఈ కావ్యమునందలి కందపద్య రచన పేర్కొనదగినది. 'కందము వ్రాసినవాడే కవి' యను తెలుగువారి నానుడిననుసరించి సారంగు తమ్మయ సుమారుగ నాలుగవ వంతుకంటె నెక్కువగ కంద పద్యములను [156] విరచించినాడు

సీస పద్యములందు గల 80 తేటగీతులే గాక కావ్యమున 75 తేటగీతి పద్యములు ప్రత్యేకముగ గలవు

ప్రబంధములందు దీర్ఘ వచనములుండుట పరిపాటి కాని వైజయంతీ విలాసమునందు గల 114 వచనములలో దీర్ఘమైనవి లేవు కథాగతిని సంధించుటకు, నడుపుటకు మాత్రమే చిన్న చిన్న వచనమును గలవు ఒక్క చోట మాత్రము ఒక దీర్ఘ వచనము [2-?] కలదు విప్రనారాయణుని పుష్ప వనమును వర్ణించు సందర్భమున నీ దీర్ఘ వచనము విరచింపబడి నది

వైజయంతీ విలాసము నందు విశేష వృత్తములు కేవలము ఆరే గలవు. అందు ఆశ్వాసాంతము లందు గల యారాడు మాలినీ వృత్తములు ఒక సుగంధి వృత్తము పోగా కావ్య మధ్య మమున నున్నది రెండు మహాస్రగ్ధరలే, దేవ దేవి నాట్యము నొక మహాస్రగ్ధరా వృత్తము (I-128) నందును సూర్యోదయ వర్ణనను జటిలమైన కూర్పుతో మరియొక మహాస్రగ్ధరావృత్తము నందును నిబంధించినాడు,

సారంగు తమ్మయకు దేశీయమైన ఛందములపై మక్కువ ఎక్కువ. సంస్కృతవృత్తములపై మోజు తక్కువ.

యతులు :

పాదాద్యక్షరము పళియనబడును పాదప్రథమాక్షరము నకు నాయక్షర మునేగాని లేక తన్మైత్రము అగు నక్షరమునుగాని పద్యము ననుసరించి నియతస్థానములో గూర్చుటనే యతి యందురు సంస్కృతము నందు యతి విచ్ఛేదక సంజ్ఞకము కాని తెలుగునందు యతి అక్షరమైత్రి గలదని లక్షణ కర్తలు చెప్పిరి. సంస్కృతవృత్తములకు ఆభాషలో నెక్కడ యతి చెప్పబడినదో అక్కడ పాదాద్యక్షర మునుగాని తన్మైత్రములగు నక్షరములనుగాని తెలుగున నిలుపవలయునని అనంతామాత్యుడు చెప్పినాడు.3

యతికి గల పర్యాయ పదములను అప్పకవి - విరతి, విశ్రాంతి, విశ్రమము, విశ్రామము, శ్రాంతి, విరమణము, విరమము, విరామము యతి అను తొమ్మిదింటిని చెప్పినాడు 4 ఛవిగాక వడియను పర్యాయ పదమును గలదు. వైజయంతీ విలాస కావ్యమునందలి కొన్ని యతులు ఉదాహరణ పూర్వకంగ నీ దిగువనీయబడినవి.

బిందుయతి

వర్గాను నాసికమునకు ణ యూ వర్గాక్షరములు పూర్ణబిందు పూర్వకము లైనచో యతి చెల్లునను బిందుయతిగా నప్పకవి పేర్కొనినాడు.5

1 ఉ గం|దనుల శౌర్యసింహుం నారసింహు 1-23

2 తే న్నాటి కారీషరజము సాం|ద్రముగఁ జల్లి 1-34

3 సీ మావులఁ జిగురు జొంపములు వొలిచె 1-92

4 సీ మదను సామ్రాజ్య సంపదలదివి 1-102

5 ఉ పెర్వులు|ఘూఁతలు గన్ధము లొకపురము న్మృగనాభియుఁగాక వేశ్యకున్ 2-79

6, తే న్నా మనసు రోసినట్టి చందంబు వినుము 2-87

అనునాసికాక్షరయతి .

పూర్ణబిందు పూర్వకములైన ట ఠ డ ఢ లకు నకారముతోను నట్లే పూర్ణబిందు పూర్వకములైన త థ ద ధ లకు ణకారముతోను యతి చెల్లిన యెడల నదియే అనునాసికాక్షరయతి6 యనబడును

1 మ మం|డిత సామ్రాజ్య వధూటి చేరఁజనునే నిర్భాగ్యదామోదరున్ 3-118

2 క నోల్లం|ఠనముల నాడుచును దొంగనాసామెగొట్టిన 4-87

శా న్నా మాట ల్వినుచు న్వినమ్రవదనుండై విప్రనారాయణుం 4-114

భిన్నయతి .

ధరియించు, హరియించు, అనురీతి రూపములున్నపుడు దానిలో 'యి' కారముతో 'ఇ' కారమునకు యతి వేసిన యెడల నది భిన్నయతి యగును.

అట్లు గాక ధరించు, హరించు మున్నగు రీతి రూపము లున్నపుడు అందలి 'రి' కారమునకు హల్లు 'రి' కారముతో యతి కూర్చుటను పెఱయతి యని అప్పకవి పేర్కొనుచున్నాడు 7 మరియు రంగరాట్ఛందము, లక్షణదీపిక, సుకవి మనోరంజనము సులక్షణసారము మొదలగు లక్షణ గ్రంథములు ఇంచు గాగమమున్న ధాతువులన్నిటి యందును అనగా ఇయుఙాగమము లేక బిందయిన ఉభయ యతి చెల్లునని పేర్కొనుచున్నవి అందువలన పైన పేర్కొనిన లాక్షణిక గ్రంథము లననుసరించియే ఈ క్రింద నుదాహరణము లీయబడినవి. భిన్నయతి కుదాహరణము లీ క్రిందివి.

1 ఉ ఏ టిదియంచు గౌరి చలియించపగఁ దన్కృగడింభమున్నటా 1-9
2 క ముఁగి యించి యరుగునట్టి వేళ నైదుట నిలిచి యా
3 తే ఆశ్రయించ వచ్చితి ననుఁ గటాక్షింపు స్వామి 2-60
4 ఉ. నా క్రిందక్రొసెవచ్చితి సహించుమనె కక్కెవకూడు క్రమ్మఱన్ 2-100
4 క. ఏమీ తిరువడి ఘళాశ్రయించుట విని పుత్రి 3-55
5 తే సంతరించకుండు నో కోయమ్మ యెంచుకొమ్మ 4-25

పెఱయతి కుదాహరణములు.

1 తే. విష్ణుపద భక్తుల గని సేవించి పుడమి 1-74
2 సీ. వినయంబు మూర్తిభవించినట్లు 1-76
3 తే. వైజె వన్నిదమొకటి గావించు మనిన 2-29
4 ఉ. వేశ్యకు న్మేతలు పూఁతలన్నవి గణించఁగ మందుతె తారుమందులై 2-97
5 ఉ. మందిరా న్తికములందు రావులుజనించుమ సజ్జనచిత్తవృత్తి 2-8
6 ఉ వైందము తాయిఁగాఁగొని గడించిన కష్టపు లంజకూడు 2-100
7 క రిపుచేనోకుండ నుద్ధరించుము నన్నున్ 3-22
8 చ వాక్కిటఁ బలగాడికిన్ గడెబిగించి వెలిం బలుకంపనాటి 3-64
9 ఉ. త్రిన్న నిమేమఁదివయు మర్దించిన సిబ్బెపు గబ్బిగుబ్బలున్ 3-116
10 సీ. చైఱకునకేల స్పృశించవఁడాయె 3-121
11 క చేయక యిది ధర్మమని వచించపుడు పెద్దల్ 4-107

12 ఉ. అరిప్రాంచు నెపంబునం బచరి ంపుచు నుండినటుండి 4-109
13 ఉ. లంకించంగనోపు నీ వసిండి గి న్నియ సంశయమేల డినికిన్ 4-109

**అభేదవిరతి :**

'వబయోరభేదః' అను వ్యాకరణ సూత్రముచే వబలక భేదము చెప్ప బడినందున వ-బలకు పరస్పరము యతి చెల్లునట అభేదసూత్ర కారణ ముగా నీ యతికి అభేద విరతి యని పేరు వచ్చినది మరియు వ-బలకు చెల్లినట్లే ఆ-డలకు, ల-ళలకు కూడ నిట్లే యతి చెల్లును.9 ల-ళ లకుదా హరణము లీక్రిందివి —

1 సీ. విలయ సన్న్యగోధ దళశాయి శాంబరి 1158
2 సీ పి స్తా ంచు కిణుపాగాలు మెట్టి 2-45
3 ఉ వాటికా శి ంధములన్ మనోజ సుళలీ లలం దేలిరివారలత్తతిన్ 2-49
4 ఆ వెళ్ల లేదటంచు మెల్లన ముదుగులు 3-98
5 తే లాలనముంజేసి మన్మథ క్రేళి నేడు 3-117
6 ఆ. తల్లిఁగోపగించి, మళ్ళఁబిల్వుమటంచు 4-37
7 సీ తెల్ల చెంగులబట్ట వెళ్ల గట్టి 4 67
8 సీ జాళి ంచు రవళి ఫెళాలు మనఁగ 4-78

'వబయోరభేదః' వలె 'వపయోరభేదః' ఉండుటచే 'వ కారమునకు వ వర్గముతో యతి చెల్లునందురు 10 శబ్ద సహజమైన వ-వ లకు గాక పంధి కార్యమున వచ్చిన వానికి యతి కూర్చిన సందర్భము లీక్రిందివి

1 సీ. పులిమి, తైలపు జిడ్డుపోవ దువ్వ 3-51 జిడ్డుబోవ అనునపుడు గ స డ ద వాదేశము వచ్చి జిడ్డువోవ అగుటచే వ-వ యతిగా పరిగణింప వలసి వచ్చినది

2 ఆ. అ వ జ్ఞ మాటలెగ్గు వ ట్టఁదగునె 4-55 ఇందు 'ఏగ్గువట్ట' అని గ స డ ద వాదేశము రాకపోవుటచే ప-వయతి వలె భాసించుచున్నది. 'ఎగ్గు వట్ట' దగునె అని గ స డ ద వాదేశము వచ్చి యుండవలసినది.

నన్నయ సంయుక్తాక్షరమగు 'క్ష' కారము నందలి మొదటి వర్ణమగు కకారమునకే ప్రాధాన్యమిచ్చి క్షకారమునకు క వర్గాక్షరములగు క ఖ గ ఘ లకే యతిమైత్రిని పాటించినాడు 13 నన్నెచోడుడు క్షకారములోని రెండవ వర్ణమగు 'ష' కారణమునకు కూడ ప్రాధాన్యమిచ్చి చవర్గాక్షరములతోను14 మరియు సరసయతి కారముగ శ ష స లకుకూడ15 యతి మైత్రిని పాటించి నాడు. క్షకారమునకు కవర్గాక్షరములతో యతి

| | | |
|---|---|---|
| 1 ఉ | క్ష్మావరు కేల్ నిసర్గగుణక్ష ర్మ్మశ మశ్మము మెట్టఁబల్కె నె | 1-1 |
| 2 మ. | అ క్ష య పుణ్యాకర వారి వారినిధికిన్ గ్గారాపు దేవేరి వా | 1-51 |
| 3 శా | గా మున్పడ్డదిలేదు మీరనఁగ సాక్షా ద్రంగనాథుండు దో | 2-13 |
| 4 శా | గ్రావంబై దృఢదారులై తరుణవృక్షంబై ఫలప్రాయమై | 2-130 |
| 5 సీ | కుం క్కుమ లావికాంక వక్షో విభుండు | 3-15 |
| 6 సీ | గ డపపైఁ బసపు నక్ష తల చాలు | 4-80 |
| | క్షకారమునకు చవర్గముతో యతి - | |
| 1 శా. | శ్రీ నీరాకర లక్ష్మినెన్నఁదగు లక్ష్మీనాదు ధేయుంబునన్ | 1-57 |
| 2 సీ | స ందోహ నటన శిక్షా గురుండు | 2-142 |
| 3 సీ | శ్రీ వైష్ణవులు నిరీక్షించి రాతిరుమణి | 3-85 |

వికల్ప విరమణము ·

క చ ట త ప అను శ్వాసహల్లులకు అనునాసికాక్షరములు పరమైనపుడు వానికి క్రమముగ ఙ ఞ ణ న మ లు వైకల్పికముగ నాదేశములగును ఈ అనునాసికమునకుగాని లేక సహజముగ వంతకు ముందున్న క చ ట త ప లకు గాని యతి వేయుటయే వికల్ప విరమణ మనబడును 16 వైజయంతీ విలాసమునందు సత్ + మతిని సమ్మతిగా నొసంగిరి. ఇందు కవి 'మ' కారము నకు 'మతి' లోని మకారమునకు యతి కూర్చినాడు

సీ మనుష ప్రార్థింప సమ్మతి నొసఁగె 1-78 నమటచే నిక్కడ వికల్పవిర మణము లేదు ఇట్లే మరియొకచో సత్+నింపమా సన్మానింపగానిచ్చి ఇక్కడకూడ తమ్మయ 'మానించు' యని మకారమునకే యతి గూర్చినాడు.

సీ. స న్నానింప రమ నచిమ్మాన మెఇలి 2-85 అనుటచే నీ సందర్భము నందును వికల్ప విరమణము లేదనియే చెప్పవచ్చును పై రెండు సంద ర్భములందును కవిసమయము వచ్చినను వికల్ప విరమణము పాటింపలేదు కావ్యమ న నెక్కడ వికల్ప విరమణ ముదాహరణములు మృగ్యములు

## ప్రాదియతి .

ప్ర, పరా, ప్రతి, పరి మొదలగు నిరువదింటికి నుపసర్గలను సంజ్ఞ కలదు ఈ ఉపసర్గలతో పరా, అఙ్, అపి అనుమూడు ఉపసర్గలు తత్సమము అందు కానరావు గాన మిగిలిన పదునేడు ఉపసర్గలకు అచ్చు పరమై సంధి వచ్చిన శబ్దములందు ఉభయయతి చెల్లునని అప్పకవి చెప్పినాడు 17

1 ఉ. ప్రాంజర పాలికిన్ జెనుచు ప్రౌఢవినోది ఘటించు గావుతం 1-7
2 క. ప్రణమిరవుగఁ జేయుదము సమ్ముచిత భ క్తిన్ 2-116

ఈ రెండు ఉదాహరణములందు హల్లులకే యతి చెల్లినది మరియు నీ క్రింది ఉదాహరణముల రెండిటి యందును స్వరమైత్రి సంఘటించినది

1 సీ అ విరళామృత ఫలోద్గారమగుచు 2-3
2 క స మర్థ ధనుర్ధశనయాభిన్యాత్రా వేళా 3- 39

## నిత్యసమాస యతి :

సర్వ సాధారణముగ పదవిభాగము కనబడని సమాసములను నిత్య సమాసములందురు. రెండు పదములు స్వరములకు సంధి ఏర్పడగా నవి ఏక శబ్దము వోలె కనబడు నపు డాసంధ్యక్షరమునకు ఉభయ యతి చెల్లిన యెడల దానినే నిత్యసమాస యతిగ పరిగణింతురు.

1. తే ఆత్మ సన్నిహితాది నారాయణాంఘ్రి 1-56

పై ఉదాహరణమునందు సర్వమైత్రి పాటింపబడినది ఈ దిగువ నీయ బడిన ఉదాహరణము లన్నిటియందును హల్లునకే యతివేయబడినది.

1 తే జవ వర్గాయుణుండైన విప్రనారాయణుండు 1-76
2 తే చింతనా వర్గాయుణుండైన విప్రనారాయణుండు 2-5
3 తే కృపా వర్గాయుణుండైన విప్రనారాయణుండు 2- 25
4 తే. హరివర్గాయుణుండైన విప్రనారాయణుండు 2-34
5 తే రంగవిభునకు విప్రనారాయణుండు 2-141
6 ఉ నారాయణు కూర్మిశిష్యుడను ర్రంగఁడటందురు పేరుమీకు 4-4

శోకభయాదులచే కలుగు ధ్వని వికారమే కాకువు కాకుస్వరము ప్లుతో చ్చారణగలది ఇట్టి స్వరమునకు ఉభయయతి చెల్లును 9

స్వరమైత్రి పాటంపబడినవి ·

1 మ శాయి కృపన్ వెళ్లె దినంబు లికరణి స్వామీ నేఁటిపర్యంతమున్ 2-9
2 ఉ. భారతీయ ప్రాధికోక్తి గాదె వనితాపరిహారము నీదుశంకకున్ 3-15
3 ఉ ఔ చున్నది నామతి భ్రమణమైా! మరుమాయయెూ!
కామజమో 3
4. చ ఇటువలెనాథ భ్రష్టుఁడు హరీ! జకదీశ్వర! రంగరంగ! యీా 4-98
హల్లునకే యతి చెల్లిన ఉదాహరణములు
1 ఉ వైశ్యయుగారు మంచి గురుపై దొరికెన్ జదువెల్లుచెప్పనో 4-12
2. క రోవలఁ జేయించుకొంటిరో! యెవరైనన్ 4-21
3 క మీ యమ్మకుఁ దప్పదుపుమమీ కావేరి! 441

పాద ద్వితీయాక్షరము ప్రాస ఈ కావ్యమునందలి కొన్ని ప్రాసలీ దిగువ నీయబడనవి

అర్ధబిందు సమప్రాస ·

ప్రాసాక్షరమునకు పూర్వము అర్ధబిందువున్న యెడల తక్కిన పాదము లన్నిటిలోను ప్రాసాక్షరము అట్లే అర్ధ బిందువుతో నుండవలయును 20

1 ఆ. మేఁతలు.
పూఁతలు.
మేఁతలు
చేఁతలు 2-79

2 క. ఏఁడాది వేడుక
కాఁడై
వాఁడున్ పూఁ

పై పద్యమునందలి 'ఏఁడాది' అను పదమును నిర్బిందుకముగ వావిళ్ళ వారును, ఎమెస్కోవారును ప్రచురించిరి నిర్బిందుకమైనచో నది ఖండాఖండ ప్రాసయగును,21 కాని 'ఏఁడు' పదమునకు సంవత్సరమను నర్థము గలదు. ఇది అర్ధబిందుయుతమే22 గాని నిర్బిందుకము కాదు. కావున నది ఆ ప్రచురణ కర్తల పొరపాటేగాని కవిది కాదు గదా!

పాసవైరము :

సాధుశకటరేఫలకు ప్రాసలో సాంకర్యము చేసిననది ప్రాసవైరముగా లక్షణకర్తలు భావించిరి 23 సారంగు తమ్మయ సాధుశకట రేఫలకు యుతి పాటింపలేదు. పెక్కుమారులు ప్రాసలో గూడ సాధుశకట రేఫలకు భేదము పాటించినాడు చూడుడు

ర-ర ప్రాసము ఆ. తూరుపు
తారలు
కేరె
తారె 2-50

ళ-ళ ప్రాసము ఆ. కిళ్లిన
గొళ్లెలు
వళ్లుగ
ఉళ్లి వయస్సు -72

1 క మీయక్క
మాయమ్మయు
మీయక్క
మీ యవ్వకు 4-41

2 క మాయక్క
మాయ మ్మయు
మాయంచికమ్మ
వేయుఁక 4-45

అభేదప్రాస :

'ళళయోరభేదః' అను వాక్యమునసుసరించి ల-ళకు ప్రాసను కూర్ప వచ్చును. ఇట్లే ల-డ లకు ళ-డ లకు కూడ ప్రాస పాటించవచ్చును. వైజ యంతీ విలాసమునందు ల-ళ లకు మాత్రమే ప్రాస గూర్చిన సందర్భములు కలవు గాని ల-డ, ళ-డ లకు ప్రాసవేసిన ఉదాహరణములు మృగ్యములు. ఒదియు కేవలము మూడు పర్యాయములు మాత్రమే గలదు.

1 ఉ. బాలిక
పాలికి
కేళికి
మౌళికి -121 ఈ విధముగా ఎమెస్కో ప్రతిలో నుం డగా వావిళ్ళవారి ప్రతిలో చివరి రెండు పాదములలో కేలికి మౌలికి అనియే ముద్రించినారు

2 ఉ. అలనరి ని
చ్చలు
తళియ
మెలఁతుక 2-129 మూడవ పాదమునందలి ‹తళియ› ప్రసాదము‹ తమిళపదము

3 క లోలత ల
నేలా
కిలెఋంగక
కూళయి 3-126

సంధిగత ప్రాసము :

శబ్దసహజమైన హల్లునకు, సంధిగతముగా వచ్చిన ఆగమాదేశవ్యంజనా క్షరమునకు ప్రాసవేయుటయే సంధిగతప్రాసము25

1. సీ. మంజుతరోష్ఠ తే
కంటలిఁజూచి
పంజర
కంజభవుండు 1-7

2 సీ మ్రొక్కిన
దిక్కను
ఎక్కడి
నెక్కొని 2-19

3 క. అమ్మగువ
ముమ్మరముగ
క్రమ్మకొన
గుమ్మడి 2 56

4 క ఎయ్యది
ఎయ్యది
ఎయ్యది
తొయ్యలి 2-58

ఇట్టివి 2-77, 2-132, 3-5, 4-33, 4-38, 4-47

దుష్కరప్రాస :

దుష్కరములగు నక్షరములను ప్రాసయందు గూర్చిన యెడల నద్దానిని లాక్షణికులు దుష్కర ప్రాసగా పేర్కొనిరి.26

1. క. రక్షోగణ
దక్షోదధిట దృ
గ్రక్షో
అక్షీణ 13-8

2 శా డొడ్డాయి
షాడ్రత్నంబున తే
గిడ్డా శోష్యజనాలి
గిడ్డాలైన 1-63

3 క. మింఠజన
కంఠ ఉ
త్కంఠ కల
కంఠుల 3-83

4 క. బర్హి వ
మర్హ
నిర్హేతుక
గార్హస్థ్యాపాద[illegible] 3-139

### ద్వంద్వప్రాస :

ప్రాసాక్షరమునకే గాక తత్పూర్వ యక్షరమునకును ప్రాస వేసినచో ద్వంద్వ ప్రాసయగును 27 ఇట్టి ప్రాసను గూర్చిన యెడల నది వినుటకు సొంపుగా నుండును

1 క. శ్రీరంగే
ఘూరంగ
సారంగధరుఁడు
సారంగధరుండు 1-17

2 ఉ. నల్లనిమేను
తెల్లని
బొల్లని
త్ఫుల్ల విజాంజలి 1-69

3 మ. కరుణావారిధి
దరణిం బొప్పఁగ
స్ఫురణన్
ధరిణాంక 1-70

4 క. దివమును
త్సవమున
నవమాలిక
నవమాలిక 1-95

5 క. శ్రీరంగ
సారాంగ
మారాంగ
వారాంగన 1-101

6 క. విజాయుత
ప్రాజాయుత
వాజియు
పీజియు -110

ఇట్టివి ఈ కావ్యమున పెక్కు గలవు. 1-121, 2-31, 2-32, 2-69, 3-4, 3-9, 3-26, 3-53, 3-94, 3-113, 4-19, 4-43, 4-57, 4-122.

### త్ర్యక్షరప్రాస .

ప్రాసాక్షరమునకే గాక తరువాతనున్న రెండక్షరములకును అనగా మొత్తము మూడక్షరములందు ప్రాసయున్న యెడలనది త్ర్యక్షర ప్రాస యగును 28 ఈ ప్రాసను గూర్చుటలో కవికి గల శబ్దాధికారము స్పష్టము ఇట్టివి ఈ కావ్యములో రెండు మాత్రమే గలవు.

1 క. కిలికించిత
చిలికించి
తిలకించి
పులకించక 2-21

2 చ తలంచిన
పిలిచిన
నిలిచిన
వలచిన 3-115

అంత్యప్రాస :

పాదము చివరి అక్షరము గురువైనచో నా ఒక్క అక్షరమే ప్రాస యగును, లఘువైనచో దానికి ముందున్న అక్షరమునకు కూడ ప్రాస స్వర సామ్యములో కూర్పవలయునను అప్పకవి మతము 29 సీస పద్యములలో ప్రాస ప్రసక్తి చేయలేదు. కాని ఈ కవి సీసపద్య పాదాంతమున ప్రాస కూర్చినాడు. ఇట్టివి అప్పకవికి విరుద్ధము ఎందువలననగా పాదము చివరి అక్షరము లఘువైనచో తత్పూర్వాక్షరమునకు ప్రాసను వేయవలయును. సీసపద్య పాదాంతములందు ఈ క్రింది విధముగ ప్రాస కూర్చినాడు.

1 సీ. మావి
కోవి
ఈవి
దీవి
బావి
కావి
దీవి
తీవి 102 ఎత్తుగీతిలో నిది లేదు. మరియొక సీసమును చూడుడు

2 సీ యాత
ఘాత
ఖ్యాత
చేత
ఘూత
తాత
మేత

తే జాత
లాత
మాత 3-85

వ్యాకరణాంశములు :

సారంగు తమ్మయ లాక్షణిక కవి వై జయంతీ విలాసకావ్యము వ్యాకరణలక్షణ సమ్మతమై యున్నది ఈ కావ్యమునందలి కతిపయ వ్యాకరణాంశములు బాల-ప్రౌఢ వ్యాకరణ సూత్ర సాహాయ్యమున సాధింపఁబడినవి బాల-ప్రౌఢ వ్యాకరణములకంటెను విశేషాంశము లీకావ్యమున కొన్ని కలవు భాషా పరిణామ చరిత్ర నెరుగగోరువారికి ఇందలి కొన్ని వ్యాకరణాంశములు దోహదము చేయవచ్చును.

1 అత్తునకు సంధి బహుళముగానగు - బాల - సంధి - 4
A వ్యతిరేక అకారమునకు సంధి వచ్చినది
ఉదా రోయకే 2-102, కాకితని 4-105
B భూతకాలిక ధాతుజ విశేషణము నందలి 'అ' కారమునకు సంధి వచ్చినది
ఉదా ఐనట్టి 3-39, వినినప్పుడె 3-76 వలచినట్టి 4-57 తీసినట్టి 4-76 కూర్చున్నతనిన్ 2-56
C అదంతనామములకు సంధి వచ్చిన రూపములిందు గలవు
ఉదా. బోఁకాకు 2-83, దేవరట్ల 4-55 దొంగైనారో 4-86

D విశేషణ అకారమునకు సంధి వచ్చినది-పెద్దామె 4-36
E షష్ఠి అకారమునకు సంధివచ్చిన రూపము - మనందు 3-90
F తత్సమ అకారమునకు సంధి వచ్చినది - వృద్ధటంచు 4-55
2 శ్లిష్టతావాచకంబులగు నాల్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబులగుచో నన్ని యచ్చులకును సంధి నిత్యము-ప్రౌఢ-సంధి-1
ఉదా దాసరయ్య 2-117, 3-103, వెల్లియగారు 4-12
అక్కమాంబ 1-28, అంబికమ్మ 4-45, కందాళప్ప 1-11
3. నామముల మీది హ్రస్వ ఇకారమునకు సంధి వచ్చినది
తిరుకొల్లుంచు 2-82, దాసరనుచు 2-40 పసేమి 3 53 మునలాపె 4-26
ఇంబరవై రితి 3-113
A షష్ఠి 'ఇ' కారమునకు సంధి వచ్చినది — ఉదా ఒకరింట 2-59, మగనాని-2-59, ఎవ్వరాయనవు 4-3, వారిండ్లకు 4-79, వారింటి కడకు 4-108
B పంచమీ విభక్తియగు 'ఉండి' ఇకారమునకు సంధి వచ్చినది.
ఉదా. కంచినుండిట 3-55
4 క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు బాల-సంధి 8. ఇవ్రిత్య యాంత వ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి-ప్రౌఢ-సంధి-2
సంధి వచ్చిన రెండు రూపములీ వైజయంతీ విలాసమునందున్నవి- వణఁకందటికి 2-110, ఏమనందును 4-36
5 మధ్యమ పురుష క్రియలయందిత్తునకు సంధియగును బాల-సంధి-7
ఉదా తవిలితివీ యు అవ 4-91 మధ్యమ పురుష సర్వనామావశిష్టమైన 'వి' లోపించినప్పుడు తత్పూర్వ 'ఇ' కారమునకు సంధి వచ్చినది.
ఉదా ఉట్టిపడితే 2-11, ఊక పోతేని 2-143, వచ్చితెవ్వరి 4-3, పోయితే -19
6 చిట్టి పొట్టి శబ్దములకు హల్లు పరంబగుచో ద్విత్వంబునకు లోపంబు వైకల్పికము ప్రౌఢ - సంధి - 4
ఉదా. చిటిపొటి గిన్నెలు 4-25

7 తామరకాకు పరంబగునపుడు పుగాగమంబగు - ప్రౌఢ - సంధి - 8. తామరపాకు 3-88 చూడుము. ఉత్తరహరివంశము 3-35.

8 తలచుగఁ గర్మధారయ సమాసంబునం బెన్నాదులకడ హల్లునకచ్చు పరంబగు నపుడు ద్విత్వంబు గానం బడి యెడి ప్రౌఢ - సంధి - 9.

ఉదా పెన్నిక్క 1-104 హల్లు పరమైనపుడు - పెంజెమట 1-131, పెన్నూలు 2-5, 3-156

9. అనుకొను లోనగు ధాతుజ విశేషణముల యంత్యోకారమునకు హల్లు పరంబగు నపుడు లోపంబు వైకల్పికంబు-ప్రౌఢ-సంధి-14.

ఉదా. అన్ శంక 2-14

10. కొన్ని యెడల న వర్ణంబు పరంబగు నపుడు పూర్వ పదాంత్య డకారంబు న కారంబగు ప్రౌఢ - సంధి - 2-5

ఉదా. వేన్నీళ్లు 3-51 పూర్వ పదాంతమున డకారము లేక పోయినను, 'లి' కారమున్నను ఈ సంధి కార్యము వచ్చిన - చన్నీళ్లు 3-51

11. కొన్ని యెడల ద్రుతంబు గానం బడియెడి బాల-సంధి-21.

ఉదా. అదియునుం గాక 3-41

12. ధ్వన్యను కరణ శబ్దముల కను ధాతువు పరంబగుచోఁ గొన్ని యెడల ముగాగమంబగు-ప్రౌఢ-సంధి-15.

ఉదా. ఘల్లు ఘల్లు మనుచు 4-78 జల్లుమను 3 115. ధ్వన్యనుకరణమున ద్విత్వము-తళ తళ 4-78

13 అంటయుంక చుండు శబ్దములందప్పుసుడి తొలి హ్రస్వంబుమీఁద నుండు బిందువును ద్రుతంబునకు లోపంబును లేవు. బాల-సంధి 22.

ఉదా. ముంగల 4-78, కన్బొమలు 2-45

14. సమాసంబులందును దంతంబులగు స్త్రీ సమంబుల కుంబుంపులకుం ఒరుష సరళంబులు పరంబులగు నపుడు పుగాగమంబగు బాల-సంధి-25

ఉదా అలరుఁ దీ బియలు 1-85 మోదుపుఁ గేలు 2-67 పసపుఁ బిండియు 3-108, మెఱుగుఁ దీఁగెయు 4-30, తొడవుఁగత్తులు 4-67, పడపుఁ గూడు 2-87, 2-95, కప్పురపుఁ దావి 1-113, తక్కరిషపుందెట్టలు 2-38, అరజపుఁ చీర వన్నె 2-47, మల్లరపుఁ గోడెలు 2-72, పలి

పెంపుఁ జీర తెర 3-32, శృంగారంపుఁదోటలో 3-35, మోహనపుఁబస
నతోన 3-35, వీడెంపుఁ దొక్కు 3-71, చెందిరపుఁబండి 3-71, ముత్తె
పుఁ గంటసరి 3-72, దట్టంపుఁ దోలు 3-72, కప్పురపుఁగ్రోవి 3-74,
నామంపుఁ బట్టెలు 3-136 బంగారంపుఁ తళ గిన్నె 3-137, కున్నపుఁ
బట్టియలు 4-80, మాంసంపుఁ దోరణములు 4-80, కుందనపుం గిన్నె
4-82.

15 ఉదంత మగు తద్ధర్మార్థ విశేషణమునకచ్చు పరమగు నపుడు మగాగ
మంబగు–బాల-సంధి-33.

ఉదా. ఇచ్చునవ్వులు 1-87, హల్లు పరమైనపుడుమ మగాగమము వచ్చినది
ప్రేలుఁగచ్చ 2-51.

16 ఉదంత స్త్రీ సమంబులకును బుంపులకు నదంత గుణవాచకంబులకును
దనంబు పరంబగు నపుడు మగాగమంబగు బాల-సంధి-35

ఉదా. మూఁగ బాఱుఁదనము 1-42, చక్కఁదనము 3-90.

17. కర్మధారయంబు లందుత్తునకచ్చు పరంబగు నపుడు టుగాగమంబగు
బాల–సంధి-28

ఉదా విచ్చుటాకులు 2-54 మించుటద్దము 3-35, కంచుటరిగలు 4-78,
పుంప్వాదేశము పై టుగాగమము వచ్చిన రూపాలు.

ఉదా. సూర్యపుటజపుఁ బజపు 3-74, దేవళపుటధికారి 4-83

18. కర్మ ధారయంబు నిందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగు నపుడు
టుగాగమంబు విభాషనగు–బాల-సంధి-29

ఉదా. పెదురాకు 3-1.6

19 పేదాది శబ్దంబులకాలు శబ్దము పరంబగు నపుడు కర్మధారయంబు
నందు దుగాగమంబగు బాల–సంధి–30

ఉదా గొడ్డు + ఆలు = గొడ్డురాలు > గొడ్రాలు 3-128.

20 కర్మధారయంబున దత్సమంబుల కాలు శబ్దము పరంబగునపుడ త్వంబున ఉత్వంబును రుగాగమంబునగు. బాల-సంధి-31.

ఉదా దాసురాలు 0-57, 2-100, అపవిత్రురాలు 3-15, అపాత్రురాలు 3-106, ప్రసన్నురాలు 3-118, ప్రియురాలు 4-34, అతిశాంతురాలు 4-56.

21. కర్మధారయంబులందు మువర్ణకంబునకుంబుంపులగు-బాల-సంధి- 2.

ఉదా. గారాపుదివి 1-51 ఔక్కంపు సన్నికావి 1-102, అర్ధనపురివి 1- 02, వలిపంపు మడుగు 1-112, పట్టంపు దంతులు 1-113, వితతంపు నీర్కావి 2-5, లంజె తనపు గడన 2-30, బలితంపు వెన్నెల 2-44 పవన్నపునాళి 2-54 నిక్కంపు దాసరి 2-54, మతకంపు మాయలు 2-75, కష్టపులంజ 2-100, మోహపువట బీజము 2- 36, తైలపు జిడ్డు 3-51, నైష్ఠికపు వర్త 3-53, గడితంపుఅవికల 3-70, చంద్రంపు బొట్టు 3-72' వలిపంపు సన్న చల్వలు 3-72, పట్టపుపెతిన్ 3-72, పటికంపు గిండి చెంబు 3-74, పావురపు జోడు 3-74, తోరంపు సంభారము 3-80, మాంసంపుగముల .-80, చంద్రంపు బొట్టు 3-100, నిషిద్ధపు నోట .-106, తిరిపెపు గూడ 3-109, సిబ్బెపు గబ్బి గుబ్బలు 3-116, బంగారంపు గిన్నె 4-62, కన్నపు దొంగలు 4-61, బంగరపు గిన్నె 4-69, సిందూరంపు బొట్టు -80, చందనపు మందసము 4-82, పాదంపు కొంపు 4-11. తన బంగారంపు గిన్నె అనుటకుఒదులు కవి బంగారపు తనగిన్నె 3-147 అని ప్రయోగించుట విశేషము.

22 సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు బాల-సంధి-3?.

ఉదా ప్రామిన్కలు 1-15, లేమావులు 1-92, పూచేరుల్ 2-23,

23 ఉష్ట్ర శేషంబు నకుం బరుషములు పరములగు నపుడు ముగాగమంబగు బాల-సంధి-37

ఉదా పూఁదేనె 4-119, చెందొవ 4-30, చెంగావి 4-60.

24 క్రొత్త శబ్దమున కాద్యక్షర శేషంబునకుం గొన్ని యెడల ముగాగమంబు

నుం గొన్ని యెడల మీఁది హల్లునకు ద్విత్వంబునగు. బాల–సంధి–38.

ఉదా. క్రొమ్మావి 1–102, క్రొన్నన 2–70, క్రొవ్విరులు 2–120, క్రొమ్ముత్తి 2–134.

25 అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి బాల–సంధి–41.

ఉదా నెచ్చెలుల్ 1–2, నెమ్మది 1–62, నెమ్మేను 1–112, నెత్తమ్మి 2–5 నెమ్మనము 2–1 , నెమ్మొదురు 3–72, 3–138, నెమ్మొగము 3–118, నెన్నడుము 4– 8.

26 ఆమ్రేడితంబు పరంబగు నపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు బాల–సంధి–41.

ఉదా సొరె సొరెకు 1–45, అప్పటప్పటికిని 1–118.

27 అందదుకు ప్రభృతులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు బాల–సంధి–41.

ఉదా తోఁద్రోపులు 3–80, పట్టపగలు 4–69.

28 అది, అవి శబ్దంబుల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగానగు, బాల–సంధి–45

ఉదా ఏకవడ > ఏడు + అది=ఏడది 3–1 0.

29 పద్యాదులు పరంబులగు నపుడు ము వర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాషనగు బాల–సంధి–46

ఉదా. పదిలపడు 4–101, భయంపడు 4–94

30 పుంలింగంబయి మహద్వాచకంబయిన నామంబు తుది యత్వంబునకు త్వంబగు, బాల–తత్సమ–21. మరియు పుంలింగ మగు మహద్వాచకమునకు డుజ్జగు–22, సూత్రములచే 'రంగ' శబ్దము రంగుఁడు కావలసియుండగా నట్లుగాక 'రంగఁడు' 4–42, 4–92 అని ఈ కావ్యమున నున్నది.

31. రో శబ్దం బొందు సంబోధనంబున స్త్రీ వాచకంబునకు బరంబుగనగు, అయ్యది హ్రస్వాంతంబును నయ్యెడి ప్రౌఢ-శబ్ద-14. ఉదా అప్పరో-2-29, లలనరొ 2-128.

32 లు-ల-న-లు పరంబగునపుడొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు - బాల - తత్సమ-43.

ఉదా. జంగాటు 2-84, అచ్చరాలు 2-95 పాదాలు 3-71, ఖూతాలు 3-98, వెట్టితనాలు 4-12, సరాలు 4 30, ఏతాన 1-85, కతాన 2-95, వెచ్చానకు 3-98, నగరాన 4-26

33 ఉకారాంతంబగు మహత్తునకు వువర్ణకంబు బహుళముగా నగు బాల-తత్సమ-50, బహుళ గ్రహణముచే 'వు' వర్ణము రాని రూపము ను గలదు- ఉదా ఇక్ష్వాకు 1-78

34 కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబు వారి ప్రయోగము లందకన్న దక్కిన మహాకవి ప్రయోగములందు నుంగొన్ని యెడల నగాగమంబు చూపట్టదు ప్రౌఢ-శబ్ద-19.

ఉదా. మొదలిపాటు (న) కు 3-20, పాలు (న) కేడ 4-18.

35 తఱచుగా స్త్రీ సమంబులగు దేశ్య శబ్దంబులకుఁ గదవలఁ గొన్నింటికేక వచనంబునం బూజ్యతయందు గారుశబ్దంబగు-ప్రౌఢ-శబ్ద-39.

ఉదా. అయ్యగారు 4-9, 4-13, 4-16 బావగారు 4-36.
ద్వితీయాదులందు రు-రి యగు-40.

ఉదా. అమ్మగారి 3-102, అయ్యగారికి 4-64. అల్లునిగారికి అనుటకు బదులు ఈ కవి అల్లుని అమ్మగారికి 3-102 అని ప్రయోగించుట కతుంగదు విశేషరూపముగా పరిగణింపనగును.

36. మహత్తులగు మగాదులకుం గయిరాదులకును డుబ్బగు, నుత్వంబు గాదు. బాల-అచ్చిక-4.

ఉదా. బమ్మఁడు 4-33, బోడఁడు కావలసియుండగా నీ కవి బోడెఁడు 4 24 అని ప్రయోగించి యుండుట విశేషము.

37 కొన్ని డుమంతంబుల బహువచన నకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందు పూర్వక డకారంబునగు-బాల-అచ్చిక-6.

ఉదా అల్లుండ్రు 2-83.

38 కాప్రత్యయంబు మీఁది బహువచన లకారంబునకు లఘ్వలఘు రేఫంబులును, లఘు రేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబునగు-బాల-అచ్చిక-7

ఉదా కోడెకాండ్రు 2-45 వేడుకకాండ్రు 2-89, వేడ్కకాండ్రు 3-102.

39 దేశ్యంబునం గాని యెడల మహన్మహత్యర్థక బహువచనాంతనామంబులపై మరల బహువచన ప్రత్యయంబులు చూపట్టెడు అచ్చోవారు, వీరు, మీరు శబ్దంబుల యంత్యోకారంబున కకారంబగు ప్రౌఢ-శబ్ద-41.

ఉదా అంటుకాండ్రులు 2 - 71 అంటుకాండ్రురు అయి ఉండకపోవుట వైశిష్ట్యమే

40 ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబును ముందటి లువర్ణంబునకు బిందుపూర్వక డకారంబునగు బాల-అచ్చిక-11.

ఉదా. వెలయాండ్రు 2-8 .

41 ఇయకుమాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగానగు. బాల-అచ్చిక-23

ఉదా ఇయాంతరూపాలు అందియలు 1-113, కట్టియలు 2-227, తేనియ 2-82, 2-140, వీడియము 4-11. గిన్నియ 4-18, గుండియల్ 4-78, ఎత్వాంత రూపాలు : మల్లె 2-65, తీవె 2-35, కట్టె 2-115, విడెము 4-89, పీడెము 3-72 లంజె 3-102, 4-4, తేనె 3-121, గిన్నె 4-4, వన్నె 4-20

42. ప్రౌఢవ్యాకరణమునందలి శబ్ద పరిచ్ఛేదములోని 56 సూత్రమునను సరించి కొన్ని సర్వనామములీకావ్యమున గలవు

ఉదా ఆయన 4-4, ఈయన 4-107, 4-112, ఆయమ 4-51, ఆసె 4-36, ఆబిడ 4-40, ఈపె 2-107, ఈ కావ్యమునందు అప్ప 2-21 అక్క అను నర్థమున ప్రయుక్తము. నేటికినిది ఈ అర్థముననే వ్యవహారము గలదు

43. అపదాద్యంబయియసంయుక్తంబయిన గకారంబు నకు వకారంబు విభాష నగు బాల-ఆచ్చిక-27

ఉదా గకారయుక్తరూపాలు పగల్ 2-22, పండుగ 3-80, తీగె 4-30, వకారయుక్తరూపాలు పండువు 1-2, పవలు 4-109, పండువ 3-80 పరువు 3-68, తీవె 2-35, తీవ 2-112.

44 ఈ క్రింది దేశ్యపదాలు కొంత వైశిష్ట్యముతో నలరారుచున్నవి.
తలవరి 4-78, 4-77 దీర్ఘముతో తలవారి 4 79.
వెలయాలు అనుటకు బదులు వెలయంతి 4-1
బ్రహ్మచారి > బమ్మచారి 4-11
జియ్య 4-98, జియ్యరు 4-102
ఎల్లవారి > ఎల్లారి 4-28
అంత + దాఁక > అందాక 2-12
ద్విత్వములోపించిన రూపాలు వెకిరించతఁ 2-6, దాడ్రాయి, బొడ్డ త్నము, చేలు లేగి డ్రా, గొడ్రాలు 1 63 తెలనాకు 1-113, ఎఱమట్టి 4-80, ఇల్వెడలి 2 89

45 పట్టివర్ధకము ఏడాది శబ్దము నకు వచ్చి ఏఁడాది బట్టి 4-106 అని ప్రయుక్తము ఏఁడాది నుండి అనుటకు బదులు
ఆడినందులకు బదులు ఆడినకోసము 3-96 కోసము కొఱకు బదులుగా కనబడును

46. ధాతుజ విశేషణ భావార్థక వ్యవహిత కర్తృపదప్రథమకు యొక్క షష్ఠి తఱచుగ నగు—ప్రౌఢ—కారక—15

ఉదా. వాయుంచిన విష్ణు ప్రసాదంబు 1—62 [నేను ఉంచిన]

47 సమానాధికరణంబగు ముత్తరపదంబు పరంబగునపుడు మూఁడుశబ్దము డువర్ణంబునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబునగు బాల—సమాస—17

ఉదా ముల్లోకములు 4—133, ముక్కాళ్లు 2—128, ముప్పాతలు 2—131. ముప్పది 3—55

48 ద్విగువునకేకవచనంబు ప్రాయికంబుగానగు మిశ్రంబునకుఁగాదు బాల—సమాస—18

ఉదా. ముమ్మాటు 2 1:2

49 కొండొకచో సమాసంబులందు సామ్యాది కనుమ్యాదుల మువర్ణంబులు పవ్వర్ణంబులగు—బాల—సమాస—19.

ఉదా మినువ పిండి 3—51, ఇనుప కలప 3—63.

50. బహువ్రీహిని స్త్రీ వాచ్య మగుచో నుపమానంబు మీఁది మేనునకుఁ బోఁడియగు. బాల—సమాస—24 దీనినమసరించి ప్రౌఢవ్యాకర్త అలరుఁబోఁడీత్యాదులుపమాన పూర్వపదకర్మధారయంబులు—సమాస—19 అని సూత్రించినాడు

ఉదా చిగురుబోఁడి 1—63, 2—20, పూఁబోఁడి 1—70, 4—108, పువ్వుబోఁడ్లు 2—35, తలిరుఁబోఁడిము 4— :8

51 వైరిసమాసములీకావ్యమున రెండు గలవు బాలవ్యాకర్త అద్వ్యవ్యవహితంబుల దృష్టంబు గ్రాహ్యంబు—సంజ్ఞా—23 అనినాడు.

ఉదా. అవజ్ఞమాట 3—55 ప్రౌఢ వ్యాకర్త కరకంతుడు. బహువ్రీహి సమాస—27 మనినాడు ఉదా కఱకంఠుడు 3 33

52. తన వర్ణకంబుతాత్పర్యంబునందగు-బాల-తద్ధిత-1
ఉదా లంజెతనము 3-76.

53 చిన్నాదులకు తీకవర్ణకంబగు-బాల-తద్ధిత-3
ఉదా కన్నెతీకము 2-70, మిన్నెతీకము 2-70 పెదతీకంబు 3 82

54 కాకత్తియు వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతుబర్థంబునందాటా దులకగు. బాల-తద్ధిత-11
ఉదా. అడపకత్తె 1-113, తరువుకాండు 2-143 వింతకాండు 4-15

55. తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యంబగునపుడు మతుబర్థంబునందగు-బాల-తద్ధిత-19 మరియు తవర్ణకంబు పరంబగుచో నీకానీకచో నెత్వంబు చూపబడు-20
ఉదా మత్తెత 4-12

55 A మానార్థంబున కెకత్వంబునందేండు వర్ణకంబగు బాల-తద్ధిత-25
ఉదా. పదేండు 4-89

57. మతుబర్థంబునందరి వర్ణకంబు పరంబగునపుడు పూజ, స్నానములకు యుచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘంబగు — ప్రౌఢ తద్ధిత-3. ఉదా. సొన్నారి 4-19.

56 వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యంబగునపుడు మత్వర్థంబునందు 'మారి' వర్ణకంబగు-ఇది బాల ప్రౌఢవ్యాకరణములలో మృగ్యము ఉదా. మాయలమారి 4-8

58. ఒకచో నపుంసక లింగమునకు బదులు కవి స్త్రీ లింగమును ప్రయోగించినాడు ఉదా. వేశ్యమాత వెడమాయలజేయ(ము)లు విష్ణుమాయకున్ 4-5.

59. కొఱకు, కంటె, కొంటెలు పరంబులగునపుడు భావార్థక 'ట' వర్ణంబునకు లోపంబు విభాషనగు-ప్రౌఢ-ప్రక్రియ-14. ఉదా ' కొఱకు కొఱకు 2—83.

60 క్రియాఫలంబు కర్తృగామియగుచోఁగొను ధాతువనుప్రయుక్తంబగు బాల-ప్రక్రియ 52 కొనునకు 'కో' కొన్నియెడల కన్పట్టుచున్నది.
ఉదా. పేర్కొ 1—63, ఎత్తుకో 2-105 కైకోవచ్చునె 4-126, మరికొన్నిచోట్ల 'కొను' నకు 'క' కన్పట్టుచున్నది - పెట్టుక 2-10, కట్టుక 1-97.

61 చువర్ణకంబు పరంబగునపుడున్నాదుల కుత్వలోపం జేనినుస్థానంబున బిందువేని విభాషనగు బాల ప్రక్రియ—55, ఉదా కొంచు 1-1, 4-32.

62 పకారంబుకొన్నియెడల శత్రర్థపరక చువర్ణంబునకుంగానంబడియెడి, ప్రౌఢ-ప్రక్రియ-17 ఉదా వినుపించుచు 2-37 పచరింపుచు 4-109 భజింపుచు 4-137 చువర్ణమునకు ముందును 'పు' వర్ణమున్నది. బాల. క్రియ-90. అభియోగింపుదురు 4-99, అభియోగింతురు అనియుండవచ్చును.

63 రువర్ణకంబు పరంబగునపుడు నున్నమీఁది తగడలయుత్వంబునకు లోపంబు విభాషనగు బాల క్రియ-62- ఉదా ఉంద్రు2-17 ఉండు్రు 1-47, 1—48, 1-01, కొంద్రు 4-55, అండ్రు 4-99

64 చువర్ణంబుతోడ దుగ్గకారంబుతకారంబగు, బాల ప్రక్రియ 108 ఉదా. కొలుతున్1-11, మోతున్ 2-27, వసింతురు 2—71, ఫిల్తురే 2-81, ఒల్తురు 2-86, భజింతున్2-94, నేర్తు ను2-111, కాంక్షింతురే.-13, సారింతున్ 3-30, తుదిపింతురు 3-65, వగపింతుర్రు 3-72- అనిపింతున్ 3-93, చూతురో 3-109, చరియింతున్ 4-52, వక్కాణింతు 4-130, విసర్జింతున్ 4-114, మన్నింతురే 4-89, వత్తురు 2—14, తెత్తును 2-53, యువర్ణము దుగ్గకారమైన రూపముకలదు ఉదా. చేతున్ 3-97.

85 భ్రమ అను సంస్కృతనామమునకు 'చు' వర్ణముచేర్చి 'భ్రమచు' అని క్రియాధాతువునుచేసి 'భ్రమతురు' 2-18 అను క్రియారూపము నీకవి ప్రయోగించుట విలక్షణముగనున్నది.

వ్యావహారిక భాషారూపాలు: వైజయంతీ విలాసమునందు కొన్ని వ్యావహారిక భాషారూపములు ప్రయోగింపబడినవి.

మళ్ల 4-37 [మరల] గ్రాంథిక రూపము
వద్ద 4-100 [ఒద్ద] ,,
అంటే 4-33 అనినన్ ,,
విఱిగితే 2-102 విఱిగినన్ ,,
పోవుదాఁకా 2-128 పోవుదాఁక ,,
చుట్టీరా 3-125 చుట్టుచు ,,
వివేకించవయా 4-84 వివేకింపుమయా ,,

తమిళ పదజాలము: వైజయంతీవిలాసకథ వైష్ణవమగుటచే తమిళదేశము నందలి వైష్ణవాచారములను దెలియజేయుపదజాలము ఈకావ్యమున ప్రవేశించినది 30 తళిగప్రసాదము 2-28, తిరుచూర్ణము 2-5, 3-103, తిరునామము 4-13, తిరుమణి 3-18, 3-103, తిరుకట్టిసేవ 2-115, తిరువత్యారము 2-131, తిరుపుట్టము 2-115, తిరుమంజనము 2-115, 2-120, తిరుమాళిగ 2-1 0, 128, తిరువడిఘళ్ 3-25, తిరువరంగము 1-132, తిరువారాధన 4-137 తిరువాయ్‌మొళి 4-129, తిరువళకు 2-128, తొడవ 3-93, తోమాలికలు 2-141, పసాపాటు 2- 08 ప్రసాపడి 2-46 పిరాటి 4-89, పెరుమాళ్లు 3-117, 4-137, వేష్టువు 2-5, మాటి 3-8 , సాపాటు 2-'22.

కన్నడపదము హపుదప్పా 1-1 8 కలదు.

అన్యదేశ్యపదాలున్నవి-గులాము 3-122, హజారము 1-114, రుమాలు 2-471

పైనపేర్కొనిన ఛందోవ్యాకరణాంశములను పరిశీలించినపుడు సారంగుతమ్మయ లాక్షణిక కవియనుటలో నెట్టివిప్రతిపత్తియు నుండదు

# జ్ఞాపికలు

క థా వై చి త్రి-పా త్ర చి త్ర ణ

| | | |
|---|---|---|
| 1. | ఎమెస్కో ప్రచురణ-వైజయంతీ విలాసము ప్రవేశిక | పు 13 |
| 2 | విప్రనారాయణచరిత్ర ద్వితీయముద్రణ పీఠిక | పు. 32 |
| 3 | ఎమెస్కో ప్రచురణ-వైజయంతీ విలాసము ప్రవేశిక | పు 12 |
| 4 | అముక్తమాల్యద-ఉపోద్ఘాతము | పు. 48 |
| 5. | విప్రనారాయణచరిత్ర ద్వితీయ ముద్రణ పీఠిక | పు 32 |
| 6 | అందే | పు. 33 |
| 7 | తెలుగుసాహిత్య సమీక్ష సం.2 | పు. 282 |
| 8 | ఎమెస్కోవారి ప్రతి ప్రవేశిక | పు 14 |
| 9. | విప్రనారాయణచరిత్ర ద్వితీయ ముద్రణ పీఠిక | పు. 33 |
| 10 | ఎమెస్కోవారిప్రతి-ప్రవేశిక | పు. 14 |
| 11. | విప్రనారాయణచరిత్ర ద్వితీయ ముద్రణ పీఠిక | పు. 34 |
| 12 | ఎమెస్కోవారిప్రతి - ప్రవేశిక | పు. 15 |
| 13 | తెలుగుసాహిత్య సమీక్ష సం 2- | పు. 28[illegible] |
| 14 | ఎమెస్కోవారిప్రతి ప్రవేశిక | పు. 14 |
| 15. | విప్రనారాయణచరిత్ర ద్వితీయ ముద్రణ పీఠిక | పు. 34 |
| 16. | ఆంధ్రకవిసప్తశతి | పు. 77 |
| 17 | విప్రనారాయణచరిత్ర - ద్వితీయ ముద్రణ పీఠిక | పు. 34 |
| 8 | తెలుగునాటక వికాసము | పు. 274 |
| 19 | విప్రనారాయణ సినిమా మొదటిది | 1939. |
| 20 | రెండవ విప్రనారాయణ సినిమా | 1952. |
| 21 | విప్రనారాయణచరిత్ర చోళదేశవర్ణనతో ప్రారంభము | 1-51 |
| 22. | ఈ దంపతులకు నామములులేవు | 1-71 |
| 23 | యతివృత్తాంతము విప్రనారాయణ చరిత్రలోలేదు. | |
| 24. | ఈ సంభాషణ వి చ. లో లేదు. | |
| 25 | వి. చ. లో స్వప్న వృత్తాంతములేదు. | |
| 26 | వి. చ. లో ఇట్టిభావములు చెప్పబడలేదు | |

27. దేవదేవి అక్కపేరు లేదు.
28. దేవదేవి రంగశాయిగుడి పాత్రగా పేర్కొనబడలేదు.
29 అక్కచెల్లెండ్రమధ్య నిట్టిపంతములేదు
30 దేవదేవి విప్రనారాయణులు వేరు కుటీరములందుండిరి.
31. విప్రుడు తోటకుపోక దేవదేవి యింటిముందు ఉండెను.
32. వి. చ లో కావేరి ప్రస్తావనలేదు.
33. వి. చ లో నారాయణుడు విప్రుని శరీరమును ప్రవేశించలేదు
34. వి చ. లో దేవదేవి విరట్టురాలు కాలేదు ఈ విషయము చెప్పబడలేదు.
35. సమగ్రాంధ్ర సాహిత్యం. సం. 8 పు. 185

రసపరిపోష ణ-వర్ణనా వైశిష్ట్యము

1. గురుబాలప్రబోధిక. పు 151
2. నాట్యశాస్త్రము - VI పు 151
3. దశరూపకమ్ - IV - 1
4 ప్రతాపరుద్రీయమ్ -
5. సాహిత్యదర్పణమ్ - I-3
6. వావిళ్లవారిప్రతి - భూమిక III IV
7 ఎమెస్కోవారిప్రతి పు 12
8. అందే పు. 37
9. కావ్యాలంకార సంగ్రహము. 3-149
10. కిరాతపర్వము - 2- 0
11 కావ్యాలంకార సంగ్రహము పు 441
12. అందే పు .11
13. ప్రతాపరుద్రీయము పు. 197
14. కావ్యాలంకార సంగ్రహము పు 428
15. అందే పు. 307
16. అందే పు 307, 308
17. కావ్యాదర్శమ్

| | | |
|---|---|---|
| 18 | ప్రతాపరుద్రీయమ్ | శ్లో. 69 70 |
| 19. | కుమారసంభవము | 1-44 |
| 20 | కావ్యాలంకారచూడామణి | 3-82 |
| 21 | సింహాసనద్వాత్రింశిక | 1-37 |
| 22. | ఎమెస్కోవారిప్రతి | పు 43 |
| 23 | మనుచరిత్రము | 1-59 |

శైలి సౌభాగ్యము

| | | |
|---|---|---|
| 1 | తెలుగువ్యాస పరిణామం | పు 529 |
| 2 | శబ్దార్థ చంద్రిక | పు 861 |
| 3 | సూర్యరాయాంధ్రనిఘంటువు సం 8 - | పు 58 |
| 4 | తెనుగుశైలి | పు 215 |
| 5 | సులభవ్యాకరణము | పు 20 |
| 6 | ఆంధ్రమహాభారతము - ఛందఃశిల్పము | పు 6 |
| 7 | ఆంధ్రసాహిత్యచరిత్ర | పు 55 |
| 8 | వైజయంతీవిలాసము, వావిళ్ల ముద్రణ భూమిక | పు. IV |
| 9 | వైజయంతీవిలాసము, ఎమెస్కో ప్రతి ప్రవేశిక | పు 44 |
| 10 | ఆంధ్రకవి తరంగిణి సం,8 | పు, 89 |
| 1 | సమగ్రాంధ్ర సాహిత్యం సం. 8 | పు 165 |
| 12 | ఆదిపర్వము 1-1, విక్రమార్కచరిత్రము | 2-118 |
| 13 | విక్రమార్కచరిత్రము | 2-222 నుండి 2-2 4 |
| 4 | తిక్కనకృత నిర్వచనోత్తర రామాయణము | 1-16 |
| 15 | కుమార సంభవము | 1-6 |
| 16 | ఆంధ్రమహాభాగవతము -ప్రథమస్కంధము | 1-20 |
| 17, | ఆదిపర్వము | 1-26 |
| 18 | కుమార సంభవము | 1-36 |
| 19 | కాశీఖండము | 1-14 |
| 20 | సభాపర్వము | 1-21 |

| | | |
|---|---|---|
| 21. | హరి వంశము-ఉత్తర భాగము | 5–154 |
| 22. | కుమారసంభవము | 8–142, 8–158 |
| 23 | అందే | 8–139 |
| 24. | అరణ్యకాండము | 1–2 |
| 25. | హరివంశము ఉత్తర భాగము | 6–7 |
| 26 | ఉత్తరహరివంశము | 2–38 |
| 27 | మనుచరిత్ర | 2–3 |
| 28 | ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము | పు–186 |
| 29. | కావ్యాలంకార సంగ్రహము | పు- 550 |
| 30 | ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము | పు–387 |
| 31. | అందే | పు–388 |
| 32. | కావ్యాలంకార సంగ్రహము | పు–549 |
| 33 | ఆంధ్రసాహిత్యదర్పణము | పు–288 |
| 34 | అందే | పు–297 |
| 35 | అందే | పు–3 5 |
| 36. | అందే | పు 309 |
| 37 | ఆంధ్ర చంద్రాలోకము | పు-115 |
| 48. | అందే | పు–116 |

ఛందో వ్యాకరణ వివ్యాసము

| | | |
|---|---|---|
| 1 | ఎమెస్కో వారి వైజయంతీ విలాసమున 50 పద్యములు కలవు. | |
| 2 | ఎమెస్కో ప్రతియందు కందముల సంఖ్య | 158 |
| 3. | ఛందోదర్పణము | 1–129 |
| 4. | అప్పకవీయము | 3-6 |
| 5. | అందే | 3–52 |
| 6. | అందే | 3–62 |
| 7. | అందే | 3–81 |
| 8. | అప్పకవీయ భావప్రకాశిక | పు–62 |
| 9. | అందే | పు–64 |

| | | |
|---|---|---|
| 10 | అందే | పు.73 |
| 11, | అప్పకవీయము | 2-105 |
| 2 | అందే | 3-10 |
| 13. | ఆదివర్వము 2-289, అరణ్యపర్వము | 2-133 |
| 4. | కుమార సంభవము | 2-127 |
| 15 | అందే | 2-38,2-54 |
| 16. | అప్పకవీయము | 3-132 |
| 18 | అందే | 3-135 |
| 19 | అందే | 3 241 |
| 20 | అప్పకవీయము భావప్రకాశిక | పు-208 |
| 21 | అప్పకవీయము | 3-202 |
| 22 | శబ్దరత్నాకరము | పు- 15 |
| 23 | అప్పకవీయము | 3-344 |
| 24 | అందే | 3-331 |
| 25 | అందే | 3-372 |
| 26 | అందే | 2-383 |
| 27 | అందే | 2-384 |
| 28 | అందే | 3-3 5 |
| 29 | అందే | 3 3 |
| 30 | ఎమెస్కోవారి పీఠిక | పు-50 |